# ఆత్మవిజయము

లోకము లన్నియున్ గడియలోన జయించినవాఁడ వింద్రియా
నీకము జిత్తముం గెలువ • నేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకర శత్రు లార్వురఁ బ్ర • భిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁ డొకఁడు • నేర్పునఁ జూడుము దానవేశ్వరా!

— భాగవతము.

బౌద్ధ వాఙ్మయబ్రహ్మ,

దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.

# మానవాదర్శ గ్రంథమండలి

## పోషకవర్గము.

---

### శాశ్వతోద్ధారకులు.

1 శ్రీ గొడాలి ఉమామహేశ్వరరావు చౌదరిగారు,
భూస్వాములు—జబర్లపూడి.

2 శ్రీ కొప్పర్తి సుబ్బయ్యశాస్త్రిగారు, వైసు చైర్మను
ప్రొద్దుటూరు.

3 శ్రీ మెట్టుపల్లి కొండారెడ్డిగారు, భూస్వాములు. ,,

### ప్రధానరాజపోషకులు.

1 శ్రీ చలసాని వెంకటకృష్ణయ్యగారు, భూస్వాములు,
కురుమద్దాలి.

2 శ్రీ కొమ్మారెడ్డి పట్టాభిరామయ్యగారు, భూస్వాములు,
కమ్మసంఘాధ్యక్షులు—బందరు.

3 శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు, ఎం. ఎల్. సి.
జిల్లాబోర్డు ప్రెసిడెంటు,—గుంటూరు.

4 శ్రీ పోలా వేంకటగురవయ్య శాస్త్రిగారు, వర్తకులు,
నంద్యాల.

5 శ్రీ మొగిళ్ళ సుబ్బారెడ్డిగారు, భూస్వాములు — నంద్యాల.

6 శ్రీ కొర్రపాటి శివరామయ్య చౌదరిగారు, భూస్వాములు,
చల్లపల్లి.

## రాజపోషకులు.

1 దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, ఆంధ్ర, భారతి పత్రికాసంపాదకులు — మద్రాసు.

2 ముక్కపాటి వేంకటసుబ్బారావుగారు & బ్రదర్సు.

3 అట్లూరి కాంతయ్య చౌదరిగారు — అంగలూరు.

4 సూదనగుంట అప్పారావు చౌదరిగారు, భూస్వాములు, మునుపల్లె.

5 రాజా చినసుబ్బారాయుడు శ్రేష్ఠిగారు, వర్తకులు, నంద్యాల.

6 ఆత్మకూరి సుబ్రహ్మణ్యం శ్రేష్ఠిగారు, వర్తకులు, నంద్యాల.

7 వంకదారి రామయ్య శ్రేష్ఠిగారు, వర్తకులు, గోపాలపురం.

## ప్రధానపోషకులు:

1 రావుసాహెబు కంఠంనేని వెంకటరంగయ్యచౌదరిగారు, భూస్వాములు, నాగాయతిప్ప.

2 కావూరి కోదండరామయ్యచౌదరిగారు, కృష్ణాజిల్లా ఎడ్యుకేషనల్ బోర్డు ప్రెసిడెంటు, మోపిదేవి.

3 యార్లగడ్డ అనంతశ్రీధరం బహద్దరుగారు, బాదరు.

4 మలినేని రాఘవయ్య చౌదరిగారు, భూస్వాములు, తోట్లపాలెం.

5 అతోట సత్యనారాయణ చౌదరిగారు, భూస్వాములు,
కొల్లపాలెం

6 దాసరి పెదబాపయ్య చౌదరిగారు ,, ,,

7 రామినేని అంకమ్మ చౌదరిగారు ,, ,,

8 దాసరి అంకమ్మ చౌదరిగారు ,, ,,

9 తుమ్మల సూర్యనారాయణ చౌదరిగారు, భూస్వాములు,
గోవాడ.

10 కంఠంనేని రాఘవయ్య చౌదరిగారు, భూస్వాములు,
పెదగాదెలవఱ్ఱు.

11 చదలవాడ నాగభూషణరావు చౌదరిగారు, భూస్వాములు
పేరుకలపూడి.

12 కుకరవల్లి సూర్యరామలక్ష్మయ్య చౌదరిగారు, భూస్వాములు
నెమ్మికూరు.

13 భట్టా జ్ఞానకోటయ్యగారు, చైర్మను, పెదన.

14 కరిపినేని రాజయ్య చౌదరిగారు, భూస్వాములు,
కొరిమెర్ల.

15 కిలారు గోవిందయ్య చౌదరిగారు, భూస్వాములు,
కోమటిగుంట.

16 శ్రీమతి రావులూరు తులిశమ్మగారు, పసుమర్రు,
(ప్రకాశరావు చౌదరిగారి సతీమణి)

కృతిభర్త.



విద్యాపోషకులు, జాతీయవాదులు :
చెలసాని వేంకట కృష్ణయ్య చౌదరీగారు.

17 ఓరుగంటి సుబ్రహ్మణ్యం అయ్యర్ గారు, బి. ఏ. బి. ఎల్.
నంద్యాల.

18 రాజా పెదసుబ్బారాయుడు శ్రేష్ఠిగారు, వర్తకులు,
నంద్యాల.

19 కొప్పరపు రామయ్యశ్రేష్ఠిగారు, వర్తకులు, నంద్యాల.

20 పగడి వీరన్నశ్రేష్ఠిగారు, వర్తకులు, నంద్యాల.

21 శింగారెడ్డి తిమ్మారెడ్డిగారు అహింసాప్రచారకులు,
కోయిలకుంట్ల.

22 చెలసాని రామయ్యచౌదరిగారు, భూస్వాములు,
శేరీకల్వపూడి.

23 మండవ కోటయ్యచౌదరిగారు, భూస్వాములు,
శేరీకల్వపూడి.

---

# కృతిసమర్పణము.

సీ॥ ఏమహనీయునందు నిద్ది సద్గుణపేటి
కవికోటి కాకమేటి కల్పకంబు,
ఏమహాశయుఁడు ప్రజ్ఞామానసికవాసి
గుణరాశి యర్థిచకోరవిధుఁడు,
ఏశాంతమూర్తి కళాశాంతవర్తి యా
యతకీర్తి ధనుఁడు బుద్ధైకసురభి,
ఏధన్యచారిత్రుఁ డీ ధాత్రిని పవిత్ర
మిత్రాబ్జతతికెల్ల మిత్రుఁడందు,

తే॥ గీ॥ అట్టి చెలసానివంశ సుధాబ్ధి శీత
కరుఁడు వేంకట కృష్ణచౌదరికిఁ గృతిగ
"ఆత్మవిజయ" మహాగ్రంథ మాత్మవిజయ
మగను నర్పింతుఁ దారార్కమగును నహింప.

తే॥ గీ॥ మిత్రునకు బద్మములు నమో మిత్ర యనుచు
ముకుళిత కరాబ్జములఁ దొల్లి మ్రొక్కుయే వి
కాస స్వాగతమిచ్చు నా గతిని దీని
కృతినొసంగితి వేంకటకృష్ణ గొనుము.

# విన్నపము.

"యస్యాస్తి సద్గ్రంథ విమర్శభాగ్యం,
కిం తస్య శుష్కైశ్చపలా వినోదైః."

మనుష్యలోక సంతరణమునకు జ్ఞానము ముఖ్యసాధనము. అతిక్లిష్టమగు మానవజీవితముయొక్క వివిధసమస్యలు జ్ఞానము మూలముననే పరిష్కరింపఁబడుచున్నవి. జ్ఞానశూన్యమగు జీవితము మనుష్యజీవితమనఁబడ నేరదు. జీవసామాన్యధర్మములగు నాహారనిద్రాభయమైథునములకంటె నాదర్శప్రాయములగుధర్మముల ననుష్ఠింపఁజేయు జ్ఞానము లోకమందలి యితరప్రాణులందుకంటె మనుష్యునియందు విశేషముగా వెలయుచున్నది. పరమ పవిత్రమగు నిట్టి జ్ఞానబలముచే మనుష్యుఁడు తనజీవితమున కావశ్యకములగు సకలసద్గుణములను సముపార్జించి, తద్ద్వారమున విశ్వమునఁగలుగుచుండు విషాదభయముల నతిక్రమించి సౌఖ్యానందముల బడయఁగలుగుచున్నాఁడు. మానవజీవిత పరమావధియు నిశ్చలమగు నిట్టి బ్రహ్మానందమే. శోకమోహభయాది వికారములచేఁ గూడియున్న యిహలోకము నానంద సామ్రాజ్యము గావింపఁగల దైవతేజమగు జ్ఞానమును మానవలోకమందంతట బాగుగా వ్యాపింపఁజేయుటకు సద్గ్రంథములు ఉత్తమసాధనములు. మానవునియందు విషయ వాసనలను బెంచి వాని జీవితము నంధకార బంధుర మొనరించునట్టి ప్రగాఢమగు నవివేకమును విధ్వంస పఱచుటకుఁ

దగునీతిని, ధర్మమును, సత్యమును, ఆత్మబలమును ప్రసాదించు నట్టి లోకోత్తరమగు జ్ఞానమును గలిగించునట్టిదే సద్గ్రంథము- ఇట్టిసద్గ్రంథముల మూలమున లోకమందలి స్త్రీపురుషు లెల్లరు సుజ్ఞానమును సంపాదించి నాగరికులు కాఁగలుగుచున్నారు.

నీతివిరుద్ధములును, ఆత్మవికాస ప్రతిబంధకములును నగు గ్రంథములు క్షుద్రములు. ఇట్టి గ్రంథములఁ బఠించుటచే మానవుని చిత్తమున విషయవాసనా బీజములు పుంఖానుపుంఖములుగ నుదయించి, వాని చారిత్రమును భ్రష్టమొనరించి, తుదకు వానిజీవిత నౌకను దుఃఖవారిధిని ముంచివేయుచున్నవి. ప్రకృతి రంగమున దృగ్గోచర మగుచుండు భ్రాంతికరములగు వివిధవస్తువులనుండి మానవుని విముఖు నొనరింపఁగల సామర్థ్యము సద్గ్రంథములకే కలదు. కల్పిత కథలతోడను అశ్లీలములగు శృంగారమయ వర్ణనముల తోడను నిండియుండు గ్రంథములచే మానవజీవిత ముద్ధరింపఁ బడనేరదు.

లోకకల్యాణము నిమిత్తము పావనచరితులగు మన ప్రాచీన ఋషివరేణ్యులచే సృజింపఁబడిన ధార్మికసాహిత్యము విపుల జ్ఞానదాయక మయినది. కాలవైపరీత్యముచే నానాట నాయార్షవాఙ్మయము వికాసముండక, విషయవాసనలఁ బరమ లక్ష్యముగఁ గలిగియున్న భౌతిక సాహిత్యము నేఁడు సర్వత్ర విజృంభించినది. దీనిప్రభావముననే విలాసము నాగరి

శత్రువైనది. నాగరికతచే మానవుని తృష్ణ వృద్ధి నొందినట్టి దురంత లకేని సుముఖుని గావించి వైచినది. నేటి మానవ జాతీయ దైన్యదశకు నైతిక సాహిత్య విహీనతయు నొక ముఖ్యకారణమని వచింపకతప్పదు. సువర్ణయుగమున "ధమ్మపదము" వంటి నీతిబోధకమగు సద్గ్రంథముచే నసంఖ్యాకులగు స్త్రీపురుషుల జీవితములు సంస్కరింపఁ బడినవి. కావుననే మహాత్ములు సద్గ్రంథమును కల్పవృక్షమని పొగడియున్నారు.

శ్రీ గాంధియుగము ప్రారంభమయినప్పటినుండి మానవలోకదృష్టి భౌతికజీవితమునుండి ఆధ్యాత్మిక జీవితము వైపునకు మరలినది. సమస్త మానవులిపుడిపుడే పశుబలము వ్యర్థమయినదనియు, ఆత్మబలము మహత్తర మయినదనియు, గ్రహింపుచుఁ బంచేంద్రియముల విషయాదుల వైపునకుఁ బరుగెత్తించునట్టి నీతివిరుద్ధము లగు గ్రంథములను, నావస్తువులను నిషిద్ధములుగ భావింపఁ గడంగినారు. తత్ఫలితముగ మహాపురుషులగు పండితులును, కవులును శ్రమచే హితోపదేశముల నొసంగు సద్గ్రంథముల దేశదేశముల విరచింప మొదలిడినారు. ఏ దేశములకంటెఁ గర్మభూమియగు నార్యావర్తమున నిట్టి కృషి విశేషముగ జరుగుచున్నది. భరతఖండముయొక్క ప్రతిరాష్ట్రమందు గల కవులెల్లరు నిష్కళంక చారిత్రులయి తమ మేధాశక్తిని, పాండిత్యమును, లోకానుభవమును సద్గ్రంథముల

రచించి, తమ మాతృభాషావధూటి కమూల్య భూషణములు గ
నొసంగి ధన్యులు కావలసియున్నది.

పవిత్రమగు నిట్టి సంకల్పముచేఁ బ్రేరేపితులమయి యే సర్వాంగసుందరమగు నైతిక జీవితమున కావశ్యకములగు పవిత్ర గ్రంథములఁ బ్రచురించి, తన్మూలమున భాషాసేవ దేశసేవ సలుపు నిమిత్తము మేము "మానవాదర్శ గ్రంథ మండలి" ని స్థాపించియుండుట దేశీయు లెఱుంగుదురు. మా మండలికి సంపాదకులుగను, గ్రంథ రచయితలుగను నున్న బౌద్ధవాఙ్మయబ్రహ్మ, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి పరిచయము నాంధ్రుల కొసంగ నవసరములేదు. బౌద్ధవాఙ్మయ బ్రహ్మగారు పిన్నవయస్కులయ్యు నాదర్శ వాఙ్మయ సేవా ధురీణులయి "బుద్ధపురాణము" వంటి మహాగ్రంథమును సకల పండిత సంస్తవపాత్రముగ విరచించి, ఆంధ్రలోకమునకు సమర్పించిరి. మామండలియొక్క యీ ప్రథమ కుసుమ ప్రాశస్త్య ప్రయోజనముల గ్రహించి విద్యాభిమానులగు నాంధ్ర మహాశయు లనేకులు మండలిని స్వయంశక్తిచే స్థాపించి, స్వతంత్రముగ నడుపుచు, వ్యయ ప్రయాసలకు లోనగుచున్న బలరామకృష్ణకవిగారికిఁ గడు యుదారబుద్ధితో సాయమొనరించి వందనీయు లయినారు.

మామండలి తరఫున "శ్రీకృష్ణ వేణుగానము" అను ననుబంధగ్రంథమొకటి వెలువడియున్నది. ప్రస్తుత గ్రంథమగు

“ఆత్మవిజయము” ద్వితీయ కుసుమము, ఇత్యాది విదేశీయ పండిత కృతము. బౌద్ధవాఙ్మయ బ్రహ్మగారు దీనికి స్వతంత్రానువాదకర్తలు. ఇందుఁ జర్చింపఁబడిన పదునాలుగు విషయములును మానవ జీవతోన్నతికిఁ దారకమంత్రములయి రాణింపఁగలవు. ఇందలి ప్రతివాక్యమును మానవజీవిత సామాన్యములగు దోషముల విమర్శించుచు సంస్కరణమునకు దారి తీయుచున్నది. ఈ గ్రంథరాజము యొక్క నీతి మనఃబుద్ధ్యాదుల నైతికవిజ్ఞానముతో నేకీభవించి యుండుట సంతోషదాయకము. బౌద్ధవాఙ్మయబ్రహ్మగారిచే వ్రాయబడిన “ఆదర్శ మనుష్యజీవిత”మను 2000 పుటలు గల బ్రహ్మాండమగు గ్రంథమును ప్రచురించుటలోఁ గలుగనున్న విలంబమును సహింపలేక మేమీ గ్రంథరాజమును ప్రకటింప వలసిన వారమయితిమి. ఈగ్రంథ ప్రాశస్త్యము నెఱుంగు బాధ్యత చదువరులపై నున్నది.

ఆంధ్ర మహాజనులు దాస్యగ్రస్తమును, దారిద్ర్యపిశాచపీడితమును నగు ప్రస్తుత స్థితిలో నొక గ్రంథమండలిని యథోచితముగఁ బోషించుచు, దాని బాధ్యతలనెల్ల వహించుటలో నొక వ్యక్తికిఁ గలుగు కష్టనష్టముల విచారించి శక్తివంచన లేక తోడ్పడుచు మాపవిత్రోద్యమము నుద్ధరింప బద్ధాంజలినయి వేడుచున్నాడను. ఆంధ్రులు 'మేధావంతులును, వివిధ భాషల నెఱింగినవారును, ధీరులును, మహావక్తలునునగు బౌద్ధవాఙ్మయబ్రహ్మగారిని సన్మానించినచో శీఘ్రకాలమందే

అమూల్యములగు గ్రంథరాజము లనేకములుగ నాంధ్ర భాషాయోషా పాదారవిందార్చన ప్రసూనములుగ మామండలినుండి వెలువడఁగలవు.

ఇంతవఱకు బలరామకృష్ణకవిగారికి వారి సంచారములో మండలిహితము నపేక్షించి ధనసాహాయ్యము లొనరించిన దయామయు లెల్లఱకు నాకృతజ్ఞతాభి వందనములు. మామండలియెడ విశేష శ్రద్ధాభక్తులఁ బ్రదర్శించిన శ్రీ కొండాలి ఉమామహేశ్వరరావు చౌదరిగారికిని, శ్రీ చెలసాని వెంకటకృష్ణయ్య చౌదరిగారికిని మేము మిక్కిలి కృతజ్ఞులము. ఈగ్రంథమును బంపినంతనే తన బాధ్యతల నన్నింటి గట్టిపెట్టి శ్రమయనక సాంగోపాంగముగ జదివి, అమూల్యమగు నుపోద్ఘాతమును దయచేసిన దయార్ద్రహృదయులును, దేశభక్తులును, సుప్రసిద్ధాంధ్ర మహాకవులును నగు శ్రీ శ్రీ జనాబ్ ఉమర్ అలీషా పండితులవారికి మానమశ్శతంబులు. ఏతద్గ్రంథ లేఖన ముద్రణాది కార్యములు కేవల మొకపక్షములో ముగింపవలసి వచ్చుటచే నటనట దోషములు దొరలియుండవచ్చు. ఆదోసగులు ద్వితీయ సంస్కరణమున దూరమొపరింపఁ బడఁగలవు.

3—6—29
అంగలూరు.
యం. జ. మండలి
కార్యస్థానము.

విధేయుఁడు,
తిపిర్నేని లక్ష్మీనారాయణ,
వ్యవస్థాపకుఁడు.

# ఉపోద్ఘాతము.

ఆంగ్లభాషను అమెరికావాసి, 'జేమ్సు ఎలను' అను మహాకవి వ్రాసిన (Byways of Blessed) అను మహాగ్రంథమునకు 'ఆంధ్రవాఙ్మయబ్రహ్మ' బిరుదము వహించిన శ్రీయుత దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు ఆత్మవిజయమను పేర నాంధ్రభాషను చక్కని శైలిని, పదములు మాటలు గట్టునట్లు రచియించియున్నారు. ఇందలి విషయము గొప్ప పారావార సదృశమైన నైతిక జ్ఞాన సంపత్తిని ప్రబోధించునదిగా నున్నది.

వేదములు, వేదాంగములు, నానావిధపురాణములు, భారతేతిహాసాద్యనేక మహానైతిక గ్రంథములు సంస్కృతము ననే గాక, ఆంధ్రీకరణములయి కుప్పలు తిప్పలుగాఁ బడి యుండ, పాశ్చాత్యులంతకన్న నధికము నిర్వచింపగలరని యా వారి నీతియను నాటిని యుద్ధరించి, ఆంధ్రావనిని బ్రవేశఁ బెట్టుటయని కొందఱు తెగనాడవచ్చును. కొందఱు ముసిముసినవ్వులు నవ్వుకొన వచ్చును. కొందఱు పెదవివిఱువ వచ్చును. "ఎవరేమన్న నేమి? నాకేమికొదువ" యని శ్రీనాథుఁడన్నట్లు, నైతికవిజ్ఞానసంపన్నుఁ డిట్టివి లెక్కింపఁడు. నీతి, ధర్మము, కళ, విద్య మున్నగు మహాపదార్థము లొకరి కాణాచి కానేరవు; ఒకరి కంకితమై వారితో నమసి పోవలసినవిగావు. సూర్యుని వెలుతురు, గాలియొక్క సంసర్గము, నీటియొక్క మధురసుధాసేచనము ఎల్లవారి కెట్లు సేవ్యమానములో నీతిగూడ నెల్లరిచేఁ బరిగ్రహణీయము. నీతి గోడయూఁ

దనున్నను, గౌడ మృత్తిక జడపదార్థమని ఆ నీతిచదు వకుండ వదలిపెట్టఁజాలము. మనకు వస్తువుతోఁ బనిగాని ఉపాధితోఁగాదు. గులాబిపువ్వు ముల్లలోనున్నను, ముల్లు తొలఁగించి పువ్వును తీసుకొనుచున్నాము. అట్లే నీతిని వచించు నప్పుడు విదేశీయులని, దేశీయులని భేద మనావశ్యకము. ఇది యును నేర్చికొనవలసిన నొక నీతియే.

శుక్రాచార్యులు రాక్షసగురువయినను తన పేర 'శుక్రనీతిసార'మని వ్రాసినప్పుడద్దానిని మనము ప్రమాణముగ గ్రహించుచున్నాము. హూణులాది విదేశీయులును అట్టి తెగకుఁ జేరినవారేయని యనవచ్చును.

"భూరుహమెల్ల వారలకుఁ ॥ బుష్పఫలంబులు నీడయుం బ్రతీ,
కారము గోరకిచ్చుటను ॥ గాంచి బకంబది యభ్యసింపఁగా,
నేరదు పెద్దకాలమల ॥ నిల్చియు మోసము జేసి చేపలా,
హారము సేయు దుష్టమతి ॥ కబ్బునె సత్సహవాస సంపదల్."

కావున నీతిచెప్పుట సుకరము. చేయుట దుర్ఘటము. నీతివంతులను చూచియు నీతి 'ఒప్పుకోఁ జాలనివారలఁ జూడ, ప్రపంచమెంత తీవ్రతరముగ మానవులను స్వార్థము వంకకు లాగుచున్నదో యిదమిత్థమని వచించుటకు ఎవరికిని సాధ్యము గాదు.

ఈ నైతిక విజ్ఞానసంపత్తి లోకసామాన్యమునకు నేర్పుకొఱకే వేనవేలు గ్రంథములు వ్రాయఁబడినవి; వేనవేలు మతములు స్థాపించఁబడినవి; వేనవేలు ప్రవక్తలు, ఋషులు, అవతారులు, బోధకులు ఒకటేమిటి– అనంతకోటి మహావిశ్వ

మంతయు నీతిని బోధించుటకయి యున్నదని ప్రతిపాదించు చున్నారు.

అజగరుఁడను ఋషి సహ్యపర్వతముయొద్దఁ బడి యుండి యీమహానీతి నీవెచ్చటనేర్చితివని ప్రహ్లాదునిచేఁ బ్రశ్నింపఁబడినప్పు డతఁడు

"అజగరమును జుంటీఁగయు
నిజగురువులుగాఁ దలంచి నిశ్చింతుఁడనై
విజనస్థలిఁ గర్మంబుల
గజిబిజి లేకున్నవాఁడ గారవమొప్పన్."

— భాగవతము.

అని తనకు నీతి పాము, తేనెటీఁగ చెప్పినవని చెప్పినాఁడు.

ఇఁక విదేశీయులు నీతిచెప్పరాదని యెవరు చెప్పనాహసించెదరు? నీతి నీతియే. అది యెక్కడున్నను 'సాది' అను పారసీకకవి చెప్పినట్లు మన జారిపోయిన ధనము యెందయిన లభించిన నెట్లు నాది యని వాదించి పుచ్చుకొనుట కధికారముకలదో, అటులే నీతి వినిపించినపుడు అది నాదే యని గ్రహింపఁగలహక్కు యెల్ల మానవలోక సామాన్యమైన ధర్మమైయున్నది.

ఈనీతి చెప్పినకొలఁది యనుకపాతిరవలె ననంతమై యున్నది. మఱియు నీతికి రెండు ముఖములు. ఏది నీతియని చెప్పుదురో స్థలాంతరమున నదియే అవినీతి యగుచున్నది. ఎట్లందురా— 'కల్లు' త్రాగుట దుర్నీతి. అదియే వండి బెల్లముచేసి తిన్న నీతి. స్త్రీలకుఁ గాపురముచేయుట నీతి. పర

స్త్రీతోఁ గాపురము సేయుట అవినీతి యిట్లే లెక్కనరయ గ్రహింపనగును. దీని నెఱుంగుట కేదేని కొలబద్దగలదా యని విచారింప మహాగాఢ సవిలసనయుక్తమైన హృదయమునకె అనూహ్యముగానున్నది. గ్రంథము శాసించు నీతులు కొన్ని యున్నవి. మహమ్మదీయుల మతనీతిప్రకారము పినతండ్రి కూఁతురును భార్యగా గ్రహింపవచ్చును. అదేరీతి భారతీయునకు చుక్కెదురు. మహాఘోరమైన పాపపంకిలము. ఏ నెట్లు ఇట్టి ద్వంద్వములను సమన్వయింపవచ్చునని యోజించి మహానుభావులైన పింగళి సూరన్న ఒక్క మంచి సూత్రము నొసఁగినాఁడు. దానితో నెల్లవిషయములు సమన్వయింపఁబడె నవి. అది యేమందురా—"అచ్చపుబుద్ధికి లేవగమ్యముల్" అని ఒక పెద్దసిద్ధాంతమును జెప్పిపోయినాఁడు.

మఱియు నీ "యాత్మవిజయము" గూడ నైతికగ్రంథమే. ఇందు పెక్కు వాస్తవమానసిక నైతికపరిణామములు పెక్కు ఉదాహరణపూర్వకముగాఁ జూపఁబడినవి. ఇవి యోజించిన కొలఁది—ఆచరణములలో బరీక్షించినకొలఁది విశాలవిశ్వమునఁ బ్రిస్తారముచేసినకొలఁది క్రొత్తక్రొత్త రుచుల నీనుచు, అనంతానుభవసిద్ధమైన అమృతస్థితికి మానవుని గొనిపోయి, ఆత్మను పరబ్రహ్మపదార్థముగా మార్చి, విజయరథమెక్కించి యీ యఖండమాతను త్రుటిలో మెట్టవచ్చునట్లు గావింపు చున్నది. ఆహా! రత్నాలకైన వెలయున్నదిగాని నీతికి వెల యింతయని యెవరు నిర్ణయింపఁగలరు? దీనికి భారవిలోని పద్యముగూర్చి చెప్పుకథయే ఉదాహరణము.

ఈ "ఆత్మవిజయము" 14 నైతికవిషయములపైఁ జర్చింపబడినది. ఈ పదునాల్గును పదునాలుగు లోకములవలె మానవుని సంతృప్తిని గావించుచున్నవి. కాని చదివి అర్థముచేసికొని ఆత్మకుఁ బట్టించుకొన్నప్పుడే ఆత్మ, విజయమును బడయుచున్నది. కాని యిది యెల్లవారికి సులభసాధ్యముగాదు. ప్రతి పక్షికి మామిడిచిగుళ్ళు ఆహారము కాజాలవు.

ఈగ్రంథమును స్వతంత్రముగా భాషాంతరీకరించుటలో నా పరమమిత్రులయిన శ్రీ బలరామకృష్ణయ్యగారు గొప్ప మేధాశక్తిని, భాషాపరిశ్రమను చాల ఓరిమిని, నేర్పును, ప్రశాంతతను జూపియున్నారు. వీరి అసాధారణ ప్రజ్ఞావిశేషము లాంధ్రలోకము చిరకాలము పరిచయము గలిగించుకొనియున్నది. సహజముగా వీరు రచించియున్న "శ్రీబుద్ధపురాణము" గొప్ప ఆదర్శప్రాయమై యెందరినో ఆకర్షించినదనుటలో నతిశయోక్తిలేదు.

వీరు "మానవాదర్శ గ్రంథమండలి" అనుపేర నొక నిలయమును స్థాపించి దానికి బుద్ధపురాణమును మొదటి కుసుమముగను, ఈ "ఆత్మవిజయము"ను రెండవ కుసుమముగను నేర్పఱచి లోకమునకుఁ బ్రసాదించియున్నారు. ఇట్టిగ్రంథముల నాంధ్రమహాజనులు చదివి తరింప బ్రార్థితులు.

ది 29-5-29, }<br>
పిఠాపురము. }

ఇట్లు,<br>
ఉమర్ అలీషా.



# విషయసూచిక.


| | | పుట. |
|---|---|---|
| 1. ఉత్తమోద్యోగము. | (ప్రథమ ప్రకరణము) | 1 |
| 2. సామాన్యకార్యములు - కర్తవ్యములు | (ద్వితీయప్రకరణము) | 22 |
| 3. కాఠిన్యము - వ్యాకులత | (తృతీయప్రకరణము) | 46 |
| 4. భారము తగ్గించుకొనుటెట్లు? | (చతుర్థప్రకరణము) | 62 |
| 5. గుప్తాత్మసమర్పణము | (పంచమప్రకరణము) | 85 |
| 6. సహానుభూతి | (షష్ఠమప్రకరణము) | 113 |
| 7. సహనము | (సప్తమప్రకరణము) | 138 |
| 8. దోషములఁ జూడకుండుట | (అష్టమప్రకరణము) | 154 |
| 9. సుస్థిరానందము | (నవమప్రకరణము) | 194 |
| 10. మౌనము | (దశమప్రకరణము) | 205 |
| 11. ఏకాంతవాసము | (ఏకాదశప్రకరణము) | 223 |
| 12. స్వావలంబనము | (ద్వాదశప్రకరణము) | 246 |
| 13 జీవిత సామాన్యనిబంధనముల గ్రహించుట | (త్రయోదశప్రకరణము) | 259 |
| 14. సౌఖ్యమయపర్యవసానము | (చతుర్దశప్రకరణము) | 282 |

# ఆత్మవిజయము.

## ప్రథమ ప్రకరణము.

### ఉత్తమోద్యోగము.

మనుష్యజీవిత సంగ్రామ రంగస్థలమున సదాలోచన గోచరము లగుచుండు వివిధములగు వస్తుసంతతులును, భిన్న కార్యములును, సంతోషాసంతోషములును, సుఖదుఃఖములును మానవుని జీవితాభ్యుదయ ప్రాసాదము నధిరోహింప సుదృఢములగు సోపానములు. మనుష్యుల మగు మనకు వాయుపథమున కెగసి సంచరింప విహంగములకు వలెఁ బక్షములు లేవు, కాని మనకుఁగల పాదముల మూలమునఁ దుముకుచు, లంఘించుచు జీవిత విజ్ఞానశిఖరము నధిష్ఠింపఁ బాత్రులమయి యున్నార మనుట సత్యము. —లాంగు ఫెలో.

మానవ జీవితముయొక్క సామాన్య కార్యములను, సాధారణ నిబంధనములను, నైసర్గిక వాంఛలను మనోహరముగఁ జరిత్రించుట కంటె నాకు హృదయాహ్లాదకరమగు వృత్తి మఱొండు లేదు. —బ్రౌనింగు.

ఈశ్వరసృష్టియందలి సకలపదార్థములలో నుత్తమ స్థానము నలంకరించునది మానవజీవితము. తజ్జీవితమునఁ బ్రాముఖ్యమును వహించినది విజ్ఞానము. విజ్ఞానమున కుద్గమస్థానమాత్మ. ఇట్టి లోకపావనమగు నాత్మయొక్క గంభీర తత్త్వమును గూర్చి పర్యాలోచన మొనరింపఁ గడంగని వ్యక్తి యభ్యుదయపదవి నధిష్ఠింపఁ జాలఁడు. తనజీవితమును స్వర్గీయానందధామ మొనరించుకొన నభిలషించు ప్రతిసాహాదముఁడు నాత్మీయములగు భావములను గుర్తించియు, భాషణములను గూర్చియు, ప్రారంభములను గుర్తించియు, సమస్త కర్తవ్యాకర్తవ్యములను గుర్తించియు, క్రమముగ వివేచించుటగత్యము. ఆత్మతత్త్వము నెఱిఁగి సాధించిన వ్యక్తి విజయుఁడై యు సకలార్థసిద్ధికి సులభముగాఁ గడఁగి మొనరించుకొన సమర్థుఁడగుచున్నాఁడు. ఆత్మవిజయ రహస్యోద్ఘాటనమునిమిత్తమీ ప్రకరణమందుఁ బ్రప్రథమ ముత్తమోద్యోగమును గూర్చి చర్చించుట సమంజసము.

మానవజీవిత ముద్యోగపరిపూర్ణము. ప్రతిదినమును, ప్రతినిమేషమును మనుష్యుఁడు స్వాభావికముగ నుద్యమింపుచునే యుండును. అతఁ డేదో యొకకార్యమును ప్రారంభింపని గడియకాలమేని వానిజీవితమందు లభింపనేరదు. విశ్వమునందనేకములగు కార్యములు ప్రారంభమునందు నీచములుగను,

నల్పములుగను, గోచరింపుచుండును, కాని పర్యవసానమం
దాలఘుకార్యములే వాస్తవముగా మహోత్తమకార్యము
లుగఁ బరిణమింపుచున్నవి. స్థూలప్రపంచమును విలోకింపుఁడు.
ప్రతికార్యమును సాధారణోద్యోగముచేఁ బ్రారంభమగు
చున్నది ప్రతిమహానదియుఁ దనజన్మస్థానమున సామాన్య
కీటకములకేని దాటుటకుసాధ్యపడునంతటి సంకీర్ణముగ నుండు
చున్నది. ప్రచండమగు తుపాను సృష్టియొక్క స్వల్పసంఖ్యా
కములగు జలబిందువులనుండియే ప్రారంభమగుచున్నయది.
అతివిశాలమయి, మనోహరమయి సహస్రవర్షములుండిగ
భయంకర శీతాతప వాతముల సహించుచు సుస్థిరముగ భూమిపై
నిలిచి గగనా[illegible] కన [illegible] గా[illegible] నొసంగు
చున్న బ్రహ్మాండమగు వటవృక్ష మొకానొకదినమున గణ
ప్రాయమగు బీజరూపమునం దుండియుండెను. రేణు[illegible]కంటె
సూక్ష్మమగు నగ్నిస్ఫులింగము ప్రమాదవశమున దేశ
ఖండమునఁ బడిన నో విశాలములగు నగరములనేని భస్మీ
భూత మొనరించివేయ సమర్థమగుచున్నయది.

ఇదియేచందమున సూక్ష్మప్రపంచమును వీక్షింపుఁడు,
మహత్వము లఘుత్వమునుండియే ప్రారంభమగుచున్నది. ఒక
సాధారణమగు నాలోచనముచే నద్భుతమగు పదార్థావిష్కర
ణమును, సామాన్యభావచింతనముచేఁ జిరస్థాయియగు శిల్పాది

మహాకార్యమును నెఱవేరుచున్నవి. న్యూటను వినోదా
సక్తిచే నాకసమున గాలిపటము నెగురవేయుచు విద్యుచ్ఛక్తి
యొక్క రహస్యములను గుర్తింపనేర్చెను. ముఖోద్గతమగు
నొకభాషణముచేనయిన దేశచారిత్రమంతయుఁ బరివర్తనము
నందఁగలుగుచున్నది. పవిత్రమగు నొక్కభావన కవివరాత్మ
యందు స్థానము నొసంగుటచే విశ్వాభ్యుదయశక్తియొక్క
పరిజ్ఞానము సహజముగా హస్తగతమగుచున్నది. క్షణికమగు
నొక్క పాశవికభావమున ఘోరమగు నత్యాచారము సంభ
వించుచున్నది. ఇంతపర్యంతము నుడువఁబడిన వాక్యములచే మీ
కెల్లర కిపుడు ప్రారంభముయొక్క మహాత్మ్యము గోచరించి
యుండఁగలదు. ఒకానొక కార్యముయొక్క పతనోత్థానములు
ను, జయాపజయములును దాని ప్రారంభముపై ముఖ్యముగా
నవలంబితములై యున్నవని మీకిప్పటికి స్పష్టముగా గోచరించి
యుండవచ్చును. మీ రనుదిన మెన్నిపర్యాయము లుద్యమిం
పుచున్నదియుఁ, గద దుద్యమములకెట్టి మహిమకలదయి మీ
రెపుడయిన గుర్తింప నగకించి యుంటిరా? యత్నించియుండని
చో నిర్వాణసౌఖ్యము ననుభవింప నాత్మవిజయతంత్ర ధురీ
ణులరయి నన్ననుగమింపుఁడు. మీరీ ప్రకరణమున నాచే
వచింపఁబడు 'ప్రారంభము'నుగూర్చి దీర్ఘముగా విచారింప
నాయత్తపడుఁడు. ఉద్యోగపరిభావము నెఱుంగు వ్యక్తి వివే
కవంతుఁడయి, బ్రహ్మానందపథము నన్వేషించుటయందు విజ

యశీలుఁడు కాఁగలఁడు. అప్పుడు వాని సౌఖ్యము, ఆనందము, ధైర్యము, శాంతి వర్ధిల్లఁగలవు.

కార్యారంభమే యాకార్యముయొక్క కారణము. కారణమునకు వెనువెంటనే తత్తుల్యములగు పరిణామములు నియతము తటస్థింపుచుఁ గర్త కవశ్యభోక్తవ్యము లగుచున్నవి. ఒకానొక కార్యప్రారంభ మేరీతినుండునో, అది యేవిధమునఁ దత్పర్యవసాన మగు కార్యము నగుచుండుట సత్యము ప్రకృతి యొక్క యచంచల నియమప్రభావముచేఁ గార్యకారణముల కవినాభావ సంబంధ మేర్పడియున్నది. ఆరంభము గల స్థానముననే పరిపూర్ణత్వమును, అంతమును, పరిణామమును, ఉద్దేశ్యమును వెలయుచుండునని గ్రహించు టావశ్యకము. మనుజుఁడు గృహద్వారమునుండి బాహ్యమున కేతెంచుచున్నాఁడు. అటు లరుదెంచి మార్గము ననుసరించి నిర్దిష్టస్థానమును జేరఁ గలుగుచున్నాఁడు. ఇదియేచందమున ప్రారంభముచేఁ బరిణామమును, పరిణామముచేఁ బరిపూర్ణతయు సిద్ధింపుచున్నవి. ప్రారంభము ధర్మాశ్రితమును, సత్యానురక్తమును నగుచో సత్పరిణామమును—ప్రారంభము సత్యవిరుద్ధమును, ధర్మప్రతికూలమును నగుచో దుష్ఫలితమును సిద్ధింపఁగలవు. పర్యవసానముయొక్క మేలు కీళ్ళు ఉద్యోగావలంబితములు. మనుష్యులు అప్రమత్తులయి దీర్ఘదృష్టియుక్తులయి విమర్శనజ్ఞానముచేఁ దమ్ము వివిధ

కార్యములయొక్క తత్సంగోద్యోగములనుండి విముక్తులను గావించుకొనుచో నవశ్యము దుష్పరిణామములనుండి సంరక్షింపఁబడి, సత్పరిణామముయొక్క సత్ఫలరసము నాస్వాదింప సమర్థులగుదురు. ఈశ్వరసృష్టియందు మానవశక్తికిని, విజ్ఞానమునకును నానావిధముగా నగమ్యములయి యొప్పు ప్రారంభములు కొన్ని కలవు. మనుష్యుఁడు వానిని గూర్చి శ్రమపడు టనుచితము. అట్టియుద్యోగములు మానవుని యంతర్బాహ్యములను, దశదశలను వ్యాప్తములయి యున్నవి. అందు గొన్ని ప్రకృతిసిద్ధములు. మఱికొన్ని దుష్టమానవకల్పితములు. ఉదాహరణములఁ దిలకింపుము, అతివృష్టి, అనావృష్టి కలుగుటకును, నిరోధింపఁజాలుటకును మానవుఁడు హేతుభూతుఁడు కాఁజాలఁడు. కొన్ని దేశములం దగ్నిపర్వతములు బ్రద్దలయి భూకంపము నొదవించుచుండును. కొన్ని రాష్ట్రముల సముద్రము లుప్పొంగఁ దుఫానువీచి మహానగరముల విధ్వంసపఱచును. మానవుని సామర్థ్యముచేఁ దొలఁగఁ దీయఁబడని యిట్టి యుద్యోగములన్నియుఁ బ్రకృతికి సంబంధించియున్నవి. కావుననే వీనిని ప్రకృతిసిద్ధములని వచించియుంటి. బుద్ధిమంతుఁ డెవఁడేని మార్గము ననుసరించిపోవుచుండ హఠాత్తుగా దస్యులు వానిని దండించుటయో, సంహరించుటయో తటస్థింపుచుండుట మనము విలోకింపుచునే యున్నారము. ఇట్టి దుఃఖదాయకములగు నుద్యోగములే దుష్టజన విర

చితములు. నిజోన్నతి నభిలషించు మనుష్యుఁ డిట్టి యుద్యోగ
ములతో నెట్టినిమిత్తమును గలిగియుండరాదు. ఇవి మానవుని
మెడ ప్రయోజనశూన్యము లగుచున్నవి. మనుష్య విజ్ఞానము,
వీనిపై స్వాతంత్ర్యమును సంపాదించుటనుండి మానవలోక
మును నిషేధింపుచున్నది. సహోదరులారా! మీరు తమ
శక్తిని, ధ్యానమును, మానవజీవిత మందిరనిర్మాణానుగుణ్య
ములగు పరికరములను సేకరించునట్టియు, సుఖాంతము లయి
నట్టియు, ధర్మవిరుద్ధములు కానట్టియు సద్యోగములు కయి
విని యోగింపుఁడు. ఇట్టి యుద్యోగములు మానవజీవితోత్థాన
మున కత్యావశ్యకము లనియు, నివి మీ భావముల యొక్క ప్రతి
బింబము లనియు గుర్తింపుఁడు. మీ రనుదినము చూచుచున్నట్టి
వివిధకార్యములయొక్క సంపాదనమున మీకుఁ గలుగు మనో
భావము నుండియే సముద్యోగములు లభింపఁగలవు. మీదిన
చర్యయందును, జీవితవ్యవహారమందును, మీ యాత్మకు సంబం
ధించిన యంతర్గతస్థానమునను, మీరు పాలించునట్టి సమస్తోద్యోగ
ములమీఁదఁ బూర్ణమగు లక్ష్యమును గలిగియుండు టావశ్య
కము. స్వాభావికమగు జీవితానందము ననుభవించునిమిత్తము
మీరు మీదినచర్యను భావములను నెట్లు ప్రారంభింపవలయు
నో విచారించుట ముఖ్యము. సూర్యోదయానంతరము మనము
మన దైనికకృత్యముల నేరీతిగ నారంభింపుచున్నదియు బాగుగాఁ
బరిశోధించుకొనవలయును. మనము ప్రాతఃకాలమునం దేసమ

యమున శయ్యాతలమును బాయుచున్నదియుఁ, దదనంతర మే వరుసన స్వీయకర్తవ్యముల నారంభించుచున్నదియుఁ బరిశీలింపఁదగును. ప్రతి నవీనదినముయొక్క పవిత్రజీవిత రంగమునం దేకీ వర్తింపుచుండునదియు మనము మనయాంతరాత్మలఁ బ్రశ్నించుకొని సముచిత ప్రత్యుత్తరములఁ బడయవలసి యున్నది. అంతఃకరణము స్వపాదిఁ బృచ్ఛించుటచేఁ బ్రతిదినముయొక్క యుచితానుచితోద్యోగములమీఁద సమగ్రదినముయొక్క సుఖదుఃఖము లాధారపడి యున్నవని గ్రహింపఁ గలము. మనము ప్రతిదినమును వివేకపురస్సరాముగ సద్వ్యోగమునకయి వినియోగించుచుందుమేని దివారాత్రములు విశుద్ధానందస్వరూపములుగా మనల సౌఖ్యవంతులనుగఁ జేయఁగలవు. అట్టి స్థితియందు జీవితాదర్శానందమునం దెట్టి న్యూనతయు తటస్థింపనేరదు.

ప్రాతఃకాలమున శీఘ్రముగఁ దల్పమును బాయుటే దైనికకార్యములయొక్క సముచితమును, సబలమును నగు ప్రారంభమయి యున్నది. ప్రాత స్సమయమున మన మేదేని విశేషకార్యము నాచరించు బాధ్యతను గలిగియుండకున్నను సకాలమునకుఁ బ్రమత్తతను విసర్జించి నిద్రావిముక్తుల మగుటావశ్యకము. మేల్కాంచుటకుఁ బిమ్మట దైనికకృత్యముల నారంభించుటయం దెట్టి యాలస్యమును, మాంద్యమును, నిరు

త్సాహమును వహింపఁ జనదు. ప్రత్యూషముననే పర్యంకమును వీడి, తదనంతరము మనుష్యుఁడు దుర్బలత్వమునొంద దైనిక విధులను నిర్వర్తింపఁ గడంగినచో వాని శరీరబలమును, మనోబలమును వృద్ధి నొందనేరవు. ఏమానవుఁడు తన హృదయాంతరాళమునఁ జొచ్చి తన చారిత్రబలమును జీర్ణమొనరించుచున్న దోషములయెడ దయాళుఁడయి శిక్షింపక క్షమించుచుండునో వాని జీవిత మవశ్యము దుఃఖమునకును, భయమునకును, వ్యాకులతకును బుట్టినిల్లగుటయం దాశ్చర్య మేమి గలదు? సూర్యోదయానంతరమును పర్యంకము నంటిపట్టుకొని నిద్రించుచుండు మనుష్యులు దృఢకాయులును, స్వస్థదేహులును, సౌఖ్యానంద మయులును, ప్రఫుల్ల వదనులును, తేజోమయులును గాఁజాలరు. అట్టివారు సదా వ్యాధిపీడితులయి దుర్భర దుఃఖగ్రస్తులయి దుర్బలులయి మానసికముగను, దైహికముగను నానాట క్షీణించి, సౌఖ్యానంద కాంతులకు నోచక మృత్యుదేవతయొక్క వినోదసామగ్రి కావలసివచ్చుచున్నారు. దైనిక కర్తవ్యాచరణమునం దశ్రద్ధను, నిర్లక్ష్యమును, మాంద్యమును వహించు మనుష్యులు జీవితానందమను పెన్నిధినుండి వంచితులయి దుర్భరదారిద్ర్యమునకు గురియగుచున్నారు.

మద్యపాయి అనుదినము సురాపాన మొనరించుచుఁ దన్మూలమునఁ దన దేహము వజ్రసమానమయి, నిత్యనూతన

స్వాస్థ్యమును గాంచుచున్నదని విశ్వసించుచుండును, కాని యతఁడు మద్యపానముచే దినకాయ మెట్లు రోగగ్రస్తమయి జర్జరమగుచున్నదియు గ్రహింపఁజాలఁడు. కావున వాఁడను దినము విశేషముగ మద్యమును సేవింప నారంభించుచుండును. అటియేకవిధముగ నలసుఁడును దన దేహమునకు విశ్రాంతి నొసఁగుటచే సంపూర్ణారోగ్యము సిద్ధింపఁగలదను నంధవిశ్వాసమునకు వశుఁడయి వ్యర్థముగా జీవితకాలమును గడపుచుండును. సోమరి తన వ్యాధుల విస్తృమునకు శాంతినిగలిగించుటకును, స్వస్థమగు శరీరమును దూరమొనరించుటకును చిరకాల సోమరితనమే హేతువై యున్నదని తెనమూఢవిజ్ఞానముచే సిద్ధాంతీకరింపఁ జాలకున్నాఁడు. లోకమునందలి సమస్త వ్యాధులకు సోమరితనమే మూలమను రహస్యము సోమరి కగాహ్యము. వాస్తవ మాలోచింతుమేని దైహికములగు సమస్త విపత్పరంపరలకు నవిరామమగు విశ్రాంతిని గైకొనుటయే యని ప్రాజ్ఞులు గ్రహింపవలసియున్నారు. ఈవిధముగ కృత్రిమారోగ్యలాలనముచే మనుష్య జీవితమునకుఁ గలుగు గణనాతీతములగు కష్టనష్టములను భ్రమత్తులు గ్రహింపఁజాలకున్నారు. ఆత్మదోషములను క్షమించుకొనుచుండుట వలననే దేహమనోబలక్షీణయు, వైభవనష్టమును, జ్ఞానహానియు, సౌఖ్యనాశనమును సంభవించుచున్నవని గ్రహింపలేని మానవులు కేవలము నిర్భాగ్యులు.

ఉషఃకాలముననే నిద్రనుండి విడివడి దినమును సదుద్యోగమునకయి వెచ్చించవలెననుట శ్రేయస్కరము (ప్రత్యూషముననే మేల్కొంచి నిర్వహింపవలసినన్ని కార్యములు లేకున్నను స్త్రీ పురుషు లెల్లరు సత్వరము నిద్రావిముక్తులగుట కర్తవ్యము. ప్రతిమనుష్యుడును ప్రత్యూషముననే శయ్యాతలమును వీడి గృహబాహ్య సీమయందు విహరింపనడుగవలయును అప్పుడట ప్రకృతియొక్క మనోహరమగు సౌందర్యమును చేతఃపర్వముగ గాంచుచు ప్రకృతిని గూర్చి గంభీరముగ నిశ్చింతాంతఃకరణమున దర్కవితర్కములు కావించుచున్నను చుండినచో ససారమగు ప్రయోజనము కలుగ గలదు. ఈరీతి నాచరించుటచే ప్రతిమనుష్యుడు శక్తిని, తేజస్సును, స్వాస్థ్యమును, హర్షమును బాగుగా ననుభవింపగలిగి బ్రహ్మముహూర్తమున శయ్యాతల బహిష్కరణ ప్రశ్నకు యోగ్యమగు పారితోషికమును బడయుచున్నాడు. మనుష్యుడు లోకతూరి సముద్యమమునకు గడంగినచో ద్వితీయ ప్రారంభమును ప్రశస్తముగనే యుండ గలదు. ప్రాతఃకాలమున మేల్కొంచుట కభ్యస్తుడయిన మానవుని స్వాంతము నిర్మలమయి వాని భావములను ప్రశాంతములుగ జేయగలదు అట్టి యప్రమత్తుడు క్రమముగా విచారశీలుడయి తన జీవితమును, జీవిత సమస్యలను, వ్యక్తియొక్క కర్తవ్యములను వినిర్మల తేజో విలసితములుగ జేసికొన

గలుగు చున్నాఁడు. ఈ కారణమున నతఁడు నిత్యము ప్రాతఃకాలముననే నిద్రనుండి మేల్కాంచి సమగ్రదినముయొక్క కర్తవ్యముల ప్రాముఖ్యమును, కాఠిన్యమును వివేకయుక్తతను, ఆత్మబలముమూలమునను దూర మొనరించి నిజ మస్తిష్కమును, స్వాంతమును వజ్రసమానముగ నిర్మించు కొనుట కలవడుచున్నాఁడు.

ఉషఃకాలముయొక్క ప్రశాంతినిమేషము దాని విధముగ దైవశక్తియుఁ, బవిత్ర మౌనమును, గుప్తశాంతియు, సుస్నిగ్ధగాంభీర్యమును నెలకొని యుండు చున్నవి. ఏమానవుఁడు కార్యార్థియై పురుష సింహమువలె దోషము లను జంతుజాలముల మట్టుపెట్టుచు విశ్రాంతిదుకూలమును దూరముగఁ బాఱవైచి, రక్తవర్ణమును వహించుచున్న ప్రాగ్దిశను బాలభానుని గాంచు నిమిత్తము మోమెత్తి చూచుచుండునో, వాఁడవశ్యము సత్యమును, నిత్యమును నగు బ్రహ్మానందముయొక్క సమున్నతపర్వతము నధిరోహింపఁ గలుగుచున్నాఁడు. ప్రాతఃకాలముననే సకాలమునఁ గార్యారంభ మొనరించుటచే మనుష్యునకు భోజన స్వీకారమందును విశేషానందము లభింపఁ గలదు. మఱియు నతఁడు నిండు దినముయొక్క సమస్తకర్తవ్యముల సులభముగా నిర్వహింపఁ గలిగి తనదైనిక జీవిత ధర్మభారమునుండి విమోచనము నంది ప్రశాంతస్థితిని భజించుచు సుఖింపఁ గలఁడు.

ఒక విధముగ విచారించినచో ప్రతి నూతనదిన మొక నవ్య జీవితారంభము గాగలదు. ఈ నవ్యజీవితమునందే మనుజుడు నవీన భావములను, గార్యములను నూతన వివేకోత్సాహములమూలమున నిర్వహింప సమర్థుడగు చున్నాడు.

ప్రతిదినము విశ్వజీవితమునందొక నూతన ప్రారంభము.

ప్రతిదినము ప్రభాతమున విశ్వము నవీనముగ నుండుచున్నది.

భయవిషాద పాపములచే నలసిసొలసియున్న ప్రతి వ్యక్తియు స్వహితముకొఱకును, లోకహితము నిమిత్తమును స్వీయ జీవితపరివర్తనమునకయి కోరినపుడెల్ల నవీనాశాలతను సృష్టించి పుష్పిత మొనరించుకొనవచ్చును.

మనుష్యుడు గతదినమున దానొనరించియుండిన పాపములను గూర్చియు, దోషములను గుఱించియు విశేషముగ దుఃఖించుచు నేటికర్తవ్యముల నిర్వహింపజాలనట్టి దుస్థితిని తన మానసమునకు గలిగింపరాదు. పాపమునకు బ్రాయశ్చిత్తము పుణ్యాచరణము. నిరుత్సాహపూర్వక మగు స్వయంకృతాపరాధ చింతనముచే బాపికి నిష్కృతి కలుగనేరదు. నిన్న పాప మొనరించిన వ్యక్తి నేడు పుణ్యమును సముపార్జింపలేడని భావింపరాదు. గతదినానుభవముచే నీదినమును బొత్తిగా నూతన

పద్ధతి ననుసరించి ప్రారంభించు టుచితము. ప్రతి మనుష్యుఁడు నిన్నటికంటె నేఁడు తనకార్యాచరణ విధానమును ప్రశస్తము గావించుకొనఁ గలిగినపుడే ధన్యుఁడు కాఁగలఁడు. మనుష్యుఁడు నిత్యము తన జీవితమున దైనందినాభివృద్ధి కలుగుచున్నదియు లేనిదియుఁ బరీక్షించుకొనుచుండు టవసరము. కార్యప్రారంభమును సంభాళించుకొనఁ జాలని వ్యక్తి కార్యము నుత్తమ రీతి సాధింప నేరఁడని వేఱుగ నుడువవలయునా? సమగ్రదినముయొక్క వివిధ కర్తవ్య సాఫల్యము ప్రాతఃకాలముయొక్క ప్రారంభము ననుసరించి యుండుచున్నయది. మహత్తరమును, సుదీర్ఘకాలమును నగు కార్యమును బ్రారంభించుట ద్వితీయ శ్రేణికి వర్తించు సముద్యోగము. మనుష్యుఁడు గృహమును నిర్మించునపుడు దాని నేరీతి నారంభించుచున్నాఁడు? నిర్మింపఁ బడవలసిన గృహముయొక్క చిత్రపటము తొలుత సృజింపఁ బడుచున్నది. అనంతరము పునాది వేయఁబడి దానిపైనుండి చిత్రపటానుగుణ్యముగ సమగ్రనికేతనము విరచింపఁబడుచున్నది. ప్రప్రథమము గృహముయొక్క చిత్రపటమే సిద్ధమొనరింపఁ బడకయున్నచోఁ జేసిన ప్రయాస యంతయు వ్యర్థము కావలసియే వచ్చును. ఒకవేళ విశేష శ్రమచే నేదియో యొక రీతి గృహము సాంగముగ నిర్మింపఁబడినను సుదృఢమును, ప్రశస్తమును నయి యుండఁ జాలదు. ఈ నియమమే మహత్తరములగు కార్యములనాచరించు

వల్లను సార్థకమగుచున్నది. ఏదేనియొక గురుతరమగు సత్కార్యము నాచరింపవలసి వచ్చినపుడు మనుష్యుఁడు తన్నిర్వహణప్రక్రమణమునకుఁ బూర్వము తా నాచరింపనెంచిన ఘనకార్యముయొక్క సూక్ష్మరూపమును, తద్విశేషములను మనోదృష్టితోఁ గాంచు టావశ్యకము. ప్రతికార్యము స్థూలప్రపంచమున ప్రకటీభూత మగుటకుఁ దొలుత సూక్ష్మప్రపంచమున మూర్తీభూతమగు టగత్యము. ప్రకృతిమహాలక్ష్మి నియమశూన్యమును, నికృష్టమును నగు కార్యమును బ్రేమింపనొల్లదు. ప్రకృతి క్రమభంగమునకుఁ బ్రబలశత్రువు. క్రమశూన్యత కే సర్వనాశన మను మఱొండునామధేయము కలదు. మృతునకును, క్రమము నుల్లంఘించినవానికిని మధ్య భేదమేమియు లేదనియే నుడువవచ్చును. స్థిరమగు పద్ధతి, మితత్వము, నిశ్చితోద్దేశ్యము సర్వకాల సర్వావస్థలయందు శాశ్వతములగు సంపదలు. తనకర్తవ్యముల నిర్వహించు సందర్భమునందీతత్త్వరహస్యముల విస్మరించువ్యక్తి సత్యమునుండియు, సమగ్రస్థితినుండియు, సాఫల్యమునుండియు వంచింపఁబడుచున్నాఁడు.

ఒకపద్ధతి లేకుండ జీవితమే గడియయందు సృజింపఁబడినదో, ఆగడియనుండియు నయ్యది వ్యర్థమే యగుచున్నది. తజ్జీవితమందు కేవల మసంతోషమే నిత్యము తాండవించుచుండును. అయ్యది యర్థమైనను గడవకముందే భయంకరో

పదార్థములు పొడమి చెలరేగుచుండఁగలవు. నిరంతరోపద్రవ ముల భయంకరాక్రమణములచే నాజీవితనౌక తలవని తలంపుగా నొక్కసారి భవసాగరమున మునింగి యధాయధ లయి పోఁగలదు.

మనుష్యుఁ డేకార్యమునయిన ముందు తనమానసమున నిర్మించుకొనక యే యాచరింప సన్నద్ధుఁడయిన వో వానిసకల ప్రయత్నములు నిష్ఫలములగును. అతని కపుడు విజయము, సిద్ధి, ప్రాప్తి, ఉపలబ్ధి యను పదములు స్వప్నగతసంపదలు కావలసివచ్చును. ప్రతికార్యసాఫల్యమునకు సుదృఢమగు నియమ మపేక్షితమయి యున్నది. ఉత్తమంబగు చిత్రపటము ననుసరించి వస్తునిర్మాణసాధన మొనరింప యత్నించు మానవునియుద్యోగము సదా సఫలీభూతమయి వానిజీవితమును సౌఖ్యానందమయ మొనరించివేయఁ గలదు.

కేవలము వాణిజ్యశిల్పాది కార్యములపట్ల కాక సమస్త కార్యములయెడ నీనియమము చరితార్థమగుచున్నది లేఖకుని గ్రంథరచనమునకును, చిత్రకారుని చిత్రచిత్రణమునకును, వక్తయొక్క వక్తృత్వమునకును, సంస్కర్తయొక్క సంస్కరణమునకును, శోధకుని పరిశోధనమునకును, చమూపతియొక్క సంగ్రామనిర్వహణమునకును వేయేల సృష్టియందలి సమస్త కార్యములకును మనఃక్షేత్రమున రచనావిధానమును వొలుత

నేర్పు ఆదిగాని యందు టగత్యము. మానసమందు నిర్మిం చఁబడిన చిత్రపటముయొక్క సమష్టికృతిని, దార్ఢ్య మును, సమగ్రస్థితిని ననుసరించియే కార్యములును ప్రశస్త ములయి సిద్ధించుచుండఁ గలవు.

వివిధ విధములగు కార్యాచరణపరిజ్ఞానమును సము పార్జించుటతోఁ బాటు మూఢజనులచే నల్పము లని భావింపఁ బడి, విసర్జింపఁబడిన నిగూఢోద్యోగముల గుప్తమహత్వ మును గుర్తించి యాచరింప నేర్చిన మనుష్యులే సకలజనవంద నీయులగు కార్యకుశలురు.

సుఖమునకుఁ గాని, దుఃఖమునకుఁ గాని హేతుభూత మగుచు మానవున కగోచరముగ నుండు సర్వవ్యాపకమగు కారణముయొక్క జన్మస్థానము మానసము. మనుష్యుఁడా! నీసమగ్రజీవితము నీమానసమందు జనించు కారణరూపము లగు భావములయొక్క పర్యవసానమే యని గ్రహించితివా? నీ సమగ్రచారిత్రము త్వదీయభావపరంపరలచే నిర్మితమయి యున్నది. సమస్తకార్యములు దుష్టశిష్ట భావములయొక్క చిత్రములు. ఇవి తొలుతఁ జర్మచక్షువులకు గోచరింపనంతటి సూక్ష్మరూపమున మానసాంతరాళమున దాగియుండి పరిపక్వ స్థితికిఁ బ్రాపించినపిదప బహిర్గతములయి లోచనగోచరము లగుచుండును. క్షేత్రమందు నాటఁబడిన బీజ మెుకానొక

వృక్షముయొక్క ప్రారంభము. బీజ మంకురింపనది వృక్షమయి వాయుమండలము నాక్రమించుకొని సూర్యరశ్మిచే ననుదినము ప్రవర్ధమానమగుచున్నయది. ఇదియేవిధముగ మస్తిష్కమునం బుట్టుభావము మనుష్యునిచారిత్రమున కారంభమయి యున్నది. భావము తొలుతం దనమూలముల మస్తిష్కమున నెలకొనం జేయుచున్నది. అటుపిమ్మట వానిని ప్రకాశముపైపునకుం గార్యముయొక్కయు, చారిత్రముయొక్కయు రూపమునం బహిర్గమింపం జేయుచున్నది. తదనంతరము మానవుని చారిత్రమునుండియే స్వభావము, భాగ్యము సృజింపంబడుచున్నవి.

నింద్యములును, క్రోధాన్వితములును, ఈర్ష్యాపరిపూర్ణములును, లోభయుక్తములును, స్వార్థాంధములును నగు భావముల సృజించుట యనుచితప్రారంభ మనంబడుచున్నది. ఇట్టి హేయమగు సదుద్యోగముచే దుఃఖదాయకమగు పర్యవసానము లభించుచున్నది. పవిత్రములును, నమ్రములును, దయార్ద్రములును, నిస్స్వార్థములును నగు భావముల యుత్పాదనము సదుద్యోగ మనంబడుచున్నది. ఈ సదుద్యోగముయొక్క పర్యవసాన మనంతసౌఖ్యదాయకము. ఈనియమము విశుద్ధమును, సత్యమును, నిత్యమును నయి యున్నది. ప్రపంచ మందలి విఖ్యాతము లగు సకలమతములు, ఉపనిషద్దర్శనాది భారతీయ పవిత్ర ధర్మగ్రంథము లీ పవిత్ర

సిద్ధాంతము నైక్యకంఠముతో స్తుతించుచున్నవి. కాని మనుష్యులీసిద్ధాంతమును మఱచి పుచ్చుచుఁ దుచ్ఛమని నుడువుటకును సాహసించుచున్నారు.

తన పుష్పవాటికయం దెచ్చోట నెవ్వఁడే బీజముల నాటవలసియుండునదియు నెఱుంగు తోటమాలి యుత్తమ ఫలప్రాప్తి నందుచు వృత్తివిద్య యొక్క ప్రశస్తమగు జ్ఞానమును సముపార్జింపఁగలఁడు. ఉత్తమోద్యోగ మొనరించు మానవుని యంతరాత్మ ప్రశస్తఫలప్రాప్తిచే హర్షోత్ఫుల్లమయి నిత్యవికాసము నందుచున్నది. ప్రయోజనకరములును, పరమపూతములును, సుకృతమూలకములును నగు సద్భావములఁ దనమస్తిష్కమునందు నాటు సక్రమపద్ధతి నభ్యసించు మానవుఁడు సర్వోత్తమంబగు విజయమును సంపాదించి జీవితసార్థక్యమును బడసి మహాసత్యముయొక్క నిగూఢమగు విశేషజ్ఞానమును సంచిత మొనరింప సమర్థుఁడగుచున్నాఁడు. వానికి సర్వోత్తమంబగు నానందము లభించి సత్యము వాని మస్తిష్కమునఁ బవిత్రములును, సర్వోన్నతములును నగు భావముల నుదయింపఁ జేయు చుండఁగలదు.

విశుద్ధభావములచేఁ బరిశుద్ధములును, సత్యములును నగు కార్యము లుదయించు చుండును. సత్యము నాశ్రయించియుండు కార్యాచరణముచే నాదర్శప్రాయమగు విశుద్ధ

జీవితోపలబ్ధి కరగత మగుచున్నది. పవిత్రజీవితముచే ననూనమును, నక్షయమును, నపారమును నగు స్వర్గీయానందము సిద్ధింపుచున్నది.

తనభావముల నిర్మాణము నెడను, దదుద్దేశ్యము నెడను నిశ్చలమగు ధ్యానమును గలిగియుండునట్టియు, దూషితభావములఁ దనమానసక్షేత్రమునుండి నిర్మూలించివేయ నిరంతరము దత్తచిత్తుఁడయి యుండునట్టియు, సదా తనస్వాంతమును సదాశయములచేఁ బరిపూర్ణ మొనరింపఁ బ్రయత్నశీలుఁ డయియుండునట్టియు మనుష్యుఁడు తనజీవితముయొక్క వివిధకార్యముల పర్యవసానములకుఁ దన మనోద్భూతములగు భావములే ముఖ్యకారణము లని గ్రహింపఁగల సూక్ష్మజ్ఞానమును మిక్కుటముగ సంపాదింప సమర్థుఁ డగుచున్నాడు. అతఁ డిట్టి యమూల్యమగు జ్ఞానమును సముపార్జించి, తద్దివ్యదృష్టిచే సమగ్రవిశ్వముయొక్క బహిరంతరప్రకృతుల విలోకింప నేర్చి సదా సద్భావములకే తన చిత్తమునఁ దావొసంగుచుఁ జిరానంద శాంతి సౌఖ్యముల నిర్నిరోధముగ ననుభవింపఁ గలుగుచున్నాఁడు.

దూషితభావములు మానసమునం దుదయించునపుడును, వృద్ధినందునపుడును, బరిణమించునపుడును గడుంగడు క్లేశదాయకము లగుచుండును. కాని సద్విచారములు స్వాంత

మున జనించు నపుడును బ్రవర్ధమానములగునపుడును, జరిణతములగునపుడును విశేషానందసంధాయకము లయి యొప్పుచుండఁ గలవు.

బుద్ధిని, వివేకమును సంపాదింప నాకాంక్షించు మనుష్యుఁడు గణనాతీతము లగు విశుద్ధ సదుద్యోగముల నన్వేషించుటత్యంతావశ్యకము. ఆ విశుద్ధములగు సదుద్యోగములలో సర్వోత్తమములును, సర్వవ్యాపకములును నగు సౌఖ్యముల మూలములు నెలకొనియుండి మానవుని మానసికశక్తియొక్క సద్వినియోగవిధానమును, ఆత్మదమనమును, దృఢసంకల్పబలమును, దేహారోగ్యమును, అంతర్బాహ్య శౌచమును, వినయ విధేయతలను, బుద్ధి వివేకములను వృద్ధిగావింపుచుండఁ గలవు. ఈ కారణముచే మనుష్యజీవితము సమగ్రస్థితిఁ బ్రాపించుచున్నది. కారణ మేమనఁ బరిపక్వమగు బుద్ధిబలముచే భావముల సృష్టింపుచుండు మానవుఁడు సమస్తభయ విషాదముల విధ్వంస మొనర్పఁ జేయు శక్తుఁ డగుచున్నాఁడు. ఇట్టి పురుషోత్తముని జీవితకాలముయొక్క యనుక్షణమును శాంతిమయమయి భాసిల్లఁ గలదు. తన్మహనీయుని జీవితకాలము యొక్క సంవత్సరములు సౌమ్య సౌఖ్యానంద సమృద్ధము లయి వానిని బ్రహ్మానంద మూర్తిని గావించివేయఁగల వనుట ధ్రువము.



# ద్వితీయ ప్రకరణము.



## సామాన్యకార్యములు - కర్తవ్యములు.

స్వర్గద్వారమును దెఱువఁగలట్టి కీలకమును మన కర్తవ్యములే మనకు సులభముగా బోధించుచున్నవి. త్వరపడకయు, నాలసింపకయు యథోచిత సమయమున స్వీయకర్తవ్యముల నిర్వహించు మనుష్యుఁడే బ్రహ్మానందముయొక్క స్వర్గీయదృశ్యమును విలోకింపఁ గలుగుచున్నాఁడు. ఆకాశమండలమున దూరముగ దేదీప్యమానముగ వెలుఁగు నక్షత్రమువలె మనుష్యుఁడు తనదైనికకర్తవ్యముయొక్క పరిక్రియ దృఢసంకల్పముతోఁ గావింపవలసి యున్నది. —గేటే.

ఉత్తమోద్యోగములచే సౌఖ్యమును, అనుచితోద్యోగములచే దుర్భరమగు దుఃఖమును మానవునకు లభించువిధముననే సాధారణకార్యములవలనను, కర్తవ్యములమూలమునను విషాదానందములు ప్రాప్తించుచున్నవి. స్వయముగాఁ గర్తవ్యపాలనమందే మనుష్యునకు సుఖదుఃఖము లను పారితోషికములఁ బ్రసాదించుశక్తి కలదని భావింపరాదు. సుఖదుఃఖముల మనుష్యునకుఁ గర్తవ్యపాలనమునకు ముఖ్యసాధనముగ నున్న మానసముయొక్క భావమే కలిగించుచున్నదని గ్రహింపఁదగును. మనుష్యులమగు మనలను గర్తవ్యపరాయణులు

గను, కర్మయోగులుగను చేయుచుండు భావమను మహత్తర శక్తిమీఁదనే విశ్వముయొక్క ప్రతికార్య మవలంబించి యున్నది. అల్పములగు కార్యములను స్వార్థశూన్యమగు బుద్ధితోడను, వివేకపూర్వకముగను సాకల్యముగను నిర్వహించుటచే నపారమగు సౌఖ్యము కలుగుచున్నది. ప్రశాంతమగునట్టి సౌఖ్యము ననుభవించుచుండు మానవున కసామాన్యమగు లోకోత్తరశక్తియు లభింపఁగలదు. కారణమేమన బిందుపతనక్రమమున ఘటము జలపూరితమగురీతి మానవజీవితమును లఘుకార్యపరంపరల సమ్యగాచరణముచేఁ బూర్ణస్థితికిఁ బ్రాపించుచున్నది. అణువునుండియే బ్రహ్మాండము విరచితమయిన దను దార్శనికసిద్ధాంతముచే నల్పములేనిదే యధికము కలుగనేరదను విజ్ఞానరహస్యము సార్థకమగుచున్నది. జీవితముయొక్క సామాన్య దైనిక కార్యములందు సూక్ష్మమగు వివేక మంతర్వ్యాప్తమయి యున్నది. ఒకపదార్థముయొక్క భిన్నభాగములు పూర్తిఁజెందినపు డావస్తువుయొక్క సమగ్రరూప మేర్పడుటయం దాశ్చర్యము లేదు.

విశ్వమండలముయొక్క ప్రతివస్తువును సూక్ష్మములగు పరమాణువులచే సృజింపఁబడియున్నది. సూక్ష్మపదార్థములయొక్క సంపూర్ణత్వముపై మహాపదార్థములయొక్క యాస్తిక్యమును, సమగ్రస్థితియు నవలంబితములయి యున్నవి. సృష్టి

యొక్క యేదేని యొక విశేషాంగనిర్మాణమున దోషముండు దొరలినచో సకలసృష్టియందునయితము న్యూనత గోచరింపఁగలదు. ఒకవస్తువులోఁగల పరమాణువును దీసివేసినచో నావస్తువుయొక్క యా స్థైర్యమునకును, స్థిరత్వమునకును భంగము కలుగఁగలదు. ఇసుకయొక్క లఘుకణములు లేక యే వసుంధర సృజింపఁబడజాలదు. ఇసుకయొక్క చిన్నిరేణువులు సంపూర్ణముగ నున్నపుడే పృథ్వియుఁ బూర్ణాకారమును బడయఁగలుగుచున్నది. అల్పకార్యముల నాచరించుటయందు విస్మృతి యొదవినచో మహత్తరకార్యములందు ఘోరోపద్రవములు చెలరేఁగఁగలవు. నభోమండలముయొక్క నక్షత్రమెంతసంపూర్ణమో హిమముయొక్క ఫేనము సయితము నంతియే సంపూర్ణమయియున్నది. తుషారకణ మెంత సుందరమును, సుఘటితమును నయియున్నదో భూగోళముసయిత మదియే రీతిగ నున్నది.

ఒక సూక్ష్మమగు క్రిమియు మనుష్యుఁడెంతటి పరిమాణమునం దేరీతి నిర్మింపబడి యున్నాఁడో, అదియేరీతిగ సృజింపఁబడియున్నది. ఇటుకపై నిటుకనుంచుటచేతనే మహోత్తుంగమును, సుందరమును నగు ప్రాసాదము నిర్మింపఁబడుచున్నది. కావున నల్ప మల్పము కానేరదు. అల్పత్వము గురుత్వమునననుసరించియుండు పదార్థము కాదు. అత్యాదిగురుత్వమునకు జ్ఞానమును గలిగించు స్వామిగ నున్నది.

గర్వాంధులును, ఉద్రేకపరులును నగు మూఢమానవులు మహోన్నతస్థితిని సంపాదింపవలయు ననియెడి యుత్కటాభిలాషచే మిథ్యాప్రతిష్ఠను గలిగింపనట్టి యల్పములగు కర్తవ్యములను స్వీయ మంతవ్యములు గను, ఋజుమార్గములుగను భావింపక, వానినన్నింటి నుల్లంఘింపుచు, నీచదృష్టితో విలోకింపుచు వెఱ్ఱివెంకటాయలవలె ఘనకార్యముల కయి నిరంతరము వెదకులాడు చుందురు. మూర్ఖునియందు నమ్రస్వభావ ముండనేరదు. నమ్రస్వభావవిహీనుఁడు జ్ఞానదూరుఁడయి, దురహంకారముచే నుద్రిక్తుఁడయి యసంభవములగు గురుతరకార్యములఁ దృటిమాత్రకాలమున సాధించివేయువానివలెఁ బ్రయత్నశీలుఁడయి వానివైపునకుఁ బర్వెత్తుచుండును.

మిథ్యాప్రశంసను, క్షుద్రపారితోషికములను, ఆలీక గౌరవములను నభిలషింపక మహాపురుషులు నిస్సందేహహృదయులయి, నిస్స్వార్థభావముతోఁ దమసామాన్య కర్తవ్యముల నిర్వర్తించుకొనుచు, గర్వాంధకారమును, లోభమును నిర్మూలించి జ్ఞానసంపన్నులయి, శక్తియుక్తులయి విశ్వపూజ్యు లగుచున్నారు. మహాపురుషులు మహత్త్వము నన్వేషింప వాంఛింపరు. సదా వారు భక్తిని, స్వార్థత్యాగమును, సత్యమును సంపాదింప నాతురపడుచుందురు. వారు లోక

వ్యవహారముయొక్క పవిత్రములగు సామాన్య కార్యములను, కర్తవ్యములను సాధించుచు సద్గుణగణాలంకృతులయి, మహాత్త్వమను పర్వతముయొక్క యుత్తుంగశిఖరమును సులభముగా నధిరోహించుచున్నారు. మనుష్యుఁడు లోకసంస్తవము నపేక్షించి దంభమునిమిత్తము మహత్తరములగు కార్యముల నాచరింపఁ బనిలేదు. అతఁడు విశ్వజీవితముయొక్క సర్వసాధారణములగు కర్తవ్యముల ననుదినము ధార్మికుఁడయి, స్వార్థత్యాగియయి, సన్మార్గము నుల్లంఘింపక నిర్వహించుచున్నచో నకలంకమగు యశశ్చంద్రిక వానిముఖబింబము నావహించుటయందబ్బుర మేమికలదు?

మహాపురుషులు ప్రతిక్షణమును, ప్రతిశబ్దమును, స్వాగతమును, భోజనమును, వస్త్రమును, విశ్రాంతిని, కార్యమును, పరియత్నమును, వస్తువును మొదలగు సకలవిషయములను నీచదృష్టితో విలోకింపనొల్లరు. వారు సర్వమును సమ్మానదృష్టితోఁ గాంచుచు గౌరవించుచుందురు. మహాపురుషులు ప్రతికార్యమును భగవన్నియమిత మని విశ్వసింపుచుఁ దత్కార్యమును బ్రశాంతభావముతో మానవజీవితము సౌఖ్యానందమయ మగునిమిత్తము నిర్వహించుటనే తన పవిత్రకర్తవ్యముగఁ దలపోయుచుందురు. మహాపురుషులేవిషయమందును త్వరపడ నొల్లరు, కావున వారి జీవితములు

దోషపూరితములు కానేరవు. వారు నిరంతర మశౌచము నుండియు, మాధ్యమునుండియు దూరముగా నుండ యత్న మొనరింపు చుందురు. తమసన్నిధానమున వెలయుచుండు సమస్తకర్తవ్యముల గురులఘు భేదమును పాటింపక యాచరింపు చుందురు. మహాపురుషుఁడు నేఁ డాచరింపఁ బడవలసిన కార్యమును రేపటికొఱకు శేషింపఁజేయ సమ్మతింపఁడు. అతఁడు విస్మృతియందును రేపుమాపులఁ గల కర్తవ్యముల బాధ్యతను సంస్మరించి ఖేదము నొందఁజాలఁడు. భూతభవిష్యద్వర్తమాన కాలత్రయ కర్తవ్యము లేవియు నా మహాపురుషుని రోమమునయినఁ జలింపఁజేయఁ జాలవు. అతఁడు సర్వకాల సర్వావస్థల యందు కర్తవ్య నిర్వాహణమునఁ ద్రికరణపూర్వకముగ లీనుఁడయి యుండి బాల్యకాలోచితమగు నిష్కాపట్యమును, సరళత్వమును, నైసర్గిక మగు మహాశక్తిని సంపాదించి సంపూర్ణమహత్వమును హస్తగత మొనరించుకొనుచున్నాఁడు. ఖేదమోదము లతని నేస్థితియందును స్పృశింప నొల్లవు.

మహాత్ముఁడగు కన్ఫ్యూసియసు "సార్వభౌముని రాజప్రాసాదమున షడ్రసోపేతాహారమును భుజించుచున్నరీతిని నిరంతరము మనుష్యులు తమతమగృహములందు బ్రహ్మానందహృదయులయి తమకుఁ గల కలియో గంజియో త్రాగుచుండ

వలయును. నిత్యమానందమయులయి జీవించువారు ధన్యులు.” అని యుపదేశించి యున్నాఁడు. సమస్తలోకాదర్శప్రాయ మగు నీయుపదేశము సామాన్యవిషయములయొక్క మహత్వము నుద్ఘోషించుచున్నయది. శ్రీబుద్ధభగవానుఁడుసయితము “భక్తుఁడు కాఁగోరు ప్రతిమనుష్యుఁడు సామాన్య మగు కర్తవ్యము నయిన విలంబ మొనరింపక సంపూర్ణధ్యానముతో, దృఢసంకల్పముతో నాశ్రయించి నిర్వహించుట పరమ ధర్మ” మని బోధించియున్నాఁడు. సామాన్యకార్యముల విస్మరించుటయు, వానిని సోమరితనముతో ధ్యానములేక యాచరించుటయు దుర్బలత్వముయొక్కయు, మాఢ్యముయొక్కయు ముఖ్యలక్షణము లయి యున్నవి.

ప్రతికార్యమును ధ్యానపూర్వకముగను, నిస్స్వార్థభావముతోడను నిర్వహింపఁ గడంగుటచేఁ బ్రకృతి యొక్క నియమానుగుణ్యముగ మానవుని కర్తవ్యములు వృద్ధినందఁగలవు. అవుడు వాని కర్తవ్యనిర్వహణశక్తి సర్వోచ్చస్థానము నలంకరింపఁ గలదు; కారణమేమనఁ గర్తవ్య పాలనముచే బలవృద్ధియు, బుద్ధివికాసమును, సౌజన్యమును, చారిత్రదృఢిమయు, సమున్నతస్థితికిఁ బ్రాపించుచుండఁగలవు. ప్రకృతిధర్మము ననుసరించి స్వయముగా వృక్షమునుండి ఫలపుష్పములు జనించువడువునఁ గర్తవ్యపరాయణుం డగు

మనుష్యునియందుండి స్వాభావికముగాఁ బవిత్రమగుమహత్త్వముదయించును. తన్మహాత్త్వముయొక్క ప్రభావముచే మనుజుఁడవిరామముగా, క్రమపూర్వకముగ సకాలమున సముచిత స్థానమం దుద్యోగించి తనచారిత్రమును, జీవితమును మనోహరముగఁ జేసికొనుచున్నాఁడు.

'ఇచ్ఛాశక్తి' (మనోబలము) యొక్కయు, మానసిక ధ్యానముయొక్కయు వృద్ధినిమిత్తము నేఁడు ప్రపంచమున వ్యవహారమునందున్న వివిధోపాయము లనుభవదృష్టితోఁ జూడఁబడినపుడు నిరర్థకములుగనే తోఁచుచున్నవి. ప్రాణాయామము, ఆసనములు, దృష్టిస్థిరీకరణము మొదలగు మంత్రతంత్రము లన్నియుఁ గృత్రిమములగు నసత్యప్రయోగములు. జ్ఞానులు వీనినన్నింటి నున్మత్తుల భ్రాంతిమూలకములగు ప్రలాపములుగ భావింపఁగలరు. విద్యావంతులు సయితము సత్యమార్గమును, దైనికకర్తవ్య పథమును నిత్య మనుసరించుటవలననే సమస్త విధముల మానవుని యిచ్ఛాశక్తియు, మనోవికాసమును వృద్ధినందుననుట మఱచి కృత్రిమమార్గముల ననుసరింపఁ గడంగుచున్నారు. దైవికశక్తిని, ఆధ్యాత్మిక ప్రభుత్వమును సంప్రాప్తింపఁజేసికొను నిమిత్తము మానవుఁ డస్వాభావికకష్ట మొనరించు పద్ధతిని సంపూర్ణముగ బహిష్కరించి వేయవలయును. బాల్యమునుండి యౌవనమును—మాధ్య

యనుండి వివేకమును—అజ్ఞానమునుండి జ్ఞానమును—దుర్బలత్వమునుండి సబలత్వమును నెమ్మదినెమ్మదిగా మానవకోటికి లభించుచుండును. ప్రతిమనుష్యుఁడును నిత్యనూతన భావములను, నవీన ప్రయత్నములను, నగణ్యములగు కార్యములను నెడతెగకుండఁ జేయుచు దనశక్తుల వృద్ధిగావించు కొనుచుండుటావశ్యకము.

సాధువులును, యోగులును సమాధులవలనను, ఆసనముల మూలమునను దమశరీరములను హింసించి యొక విధమగు శక్తిని సంపాదింపఁ గలుగుచున్నారనుట సత్యము, కాని యీ యల్పమగు శక్తిని బడయుటకై యమూల్యమగు దేహబలమెంతయో యాహుతి కావింపఁబడవలసి వచ్చుచున్నది. సమాధిచే సాధువులు విశేషమగు శరీరబలమును వెచ్చించి మానసిక బలమును సంపాదించుచున్నారు. వారి యీపద్ధతిచే నొకశక్తిక్షీతియు, మఱొక్కశక్తి వృద్ధియు నొందుచున్నవి. అట్టిసాధువులాధ్యాత్మిక జ్ఞానవిశేషమును గ్రహింపఁ గలవారలయినను దమ దేహబలమును, ప్రయోజనకరమగు స్వభావమును గోల్పోవవలసినవార లగుచున్నారు. దేహబలమును, లాభదాయకమగు ప్రకృతిని బోగొట్టుకొనిన మనుష్యు లెవుడును సంపూర్ణస్థితికిఁ బ్రాపింపక సదా యపూర్ణస్థితియందే యుండుచుందురు. వ్యాకులము, తత్తరపాటు, మాధ్యము, వ్యభిచారము మొదలగు

భయంకరదోషములు నిరంతరము మనుష్యుని వెంటాడుచుండి అవకాశము లభించినంతనే నానిదేహాగేహమునఁ జొరఁబడఁ జూచుచుండును. మనుష్యుఁడీదుష్టవికారములజయించుచు, విశ్వముయొక్క కర్మక్షారాతపమున విహ్వలచిత్తులయి, వ్యాకులహృదయులయి ఖేదపడు దుర్బలమానవులసంఘముమధ్య వర్తించుచు శాంతిని, ఆత్మదమనమును, ధృతిని బరిపక్వమునరించుకొనఁ జూడవలయును. అప్పుడే వాఁడాత్మశక్తిసంపన్నుఁడు కాఁగలుగుచున్నాఁడు. భయంకర విషయప్రాబల్యముయొక్క మధ్యభాగమున నిగ్రహమును గలిగి వర్తించుటకే యాత్మబలమనియు, శక్తియనియుఁ బేరు. పవిత్రమగు స్వీయాత్మశక్తికి భిన్నమగు నేవస్తువును వాస్తవికమగు శక్తియని వచింప వలనుపడదు. నిరంతరము దైనికకార్యములను, కర్తవ్యములను, లోకోపకారములను విశేషముగాఁ బ్రౌఢోపాయములచే, నిస్స్వార్థభావముతో, సంపూర్ణత్వముయొక్క సింధుస్మృతితోఁ గావించుచుండుటచే నాత్మశక్తి స్వయముగా నానాట వర్ధిల్లుచుండఁగలదు. గుప్తమును, నత్యద్భుతమును నగు నాధ్యాత్మిక జ్ఞానమును గలిగియుండియు నసావధానతచే బొమ్ముడిపాటు, ఖేదము, మాంధ్యము, ద్వేషము, కామము మొదలగు నేవిధమయిన దుర్వ్యసన మహాపిశాచముయొక్క మాయాజాలమునఁ దగుల్కొనిన వ్యక్తియు సద్గురువు కాఁజాలఁడు. తనదివ్యమగు మహత్త్వమును సాహసము, రోషశూన్యత,

దృఢత్వము, శాంతము, ధైర్యము, స్థైర్యము మొదలగు సాధనములచేఁ బ్రకటింపుచుండు వ్యక్తియే వాస్తవికమగు సద్గురువు. విషయాదివికారముల జయింపలేని దుర్బలుఁడు కేవలము నింద్యుఁడు. విషయలోలుఁడు మనుష్యుఁడు కానేరఁడు. ఇంద్రియనిగ్రహమును సంపాదించిన వ్యక్తియే గౌరవాస్పదుఁడగు నుత్తమమానవుఁడు. తనచిత్తమును శాసించుకొననేరని మానవుఁ డెంతటి దృఢకాయుఁడయినను, ధనాఢ్యుఁడయినను తుదకు సకలభూమండలము నేకచ్ఛత్రాధిపత్యముగఁ బరిపాలించు సార్వభౌముఁ డయినను జ్ఞానులదృష్టియం దుత్తమమానవుఁడు కాఁజాలఁడు. ధన ధాన్యాది వైభవములఁ గలిగి యుండక పోయినను, జర్జరపర్ణకుటీరమునే నివాసగృహముగను, కందమూలాదులనే నిత్యాహారముగను గలిగియున్నను మనుష్యుఁడు విషయాదుల బహిష్కరించి తన యాత్మపై స్థిరమగు ప్రభుత్వమును సుస్థాపిత మొనరించి యున్నవాఁడగుచో నిజమగు ప్రభువుగ నిహపరముల సన్మానింపఁ బడఁగలఁడు. ఏతద్భిన్నమగు వ్యవహారమంతయు ప్రభుత్వమని నుడువఁబడ యోగ్యమయినది కాదు, కేవల మది కపటనాటక మనియు, బాహ్యవేషమనియు, మోసమనియుఁ జెప్ప బడఁగలదు.

ప్రతిమనుష్యుఁడును దన సమ్ముఖమునఁ గానవగు నెట్టి స్వల్పకార్యమునయినఁ దదేకనిష్ఠతో బుద్ధిపూర్వక

ముగ ధ్యానము నొసంగి యాచరింపుచుండవలయును. మనుష్యుఁ డొక కార్యము నాచరింపు చుండు నపుడు తద్బాహ్యమగు నట్టిపవిత్రభావమునకును స్వీయమస్తిష్కమున స్థలము నొసంగరాదు; అతఁడు కర్తవ్యాచరణమునకు మాఱుగ నే దేని లంచమునకయి ప్రతీక్షింపఁ జనదు. కర్తవ్యమును ఫలాపేక్షలే నిర్వహింపఁబూనుటకంటె ధర్మబుద్ధితో సాధింపఁ గడంగుట శ్రేయస్కరము. నిష్కామకర్మచే మానసికశక్తి వసంత ఋతువునందలి పచ్చికవలె చరచర వృద్ధినందఁగలదు. మనశ్చాంచల్యమును బాయుటకును, ననాసక్తస్థితిని సంపాదించుటకును నిష్కామకర్మకంటెఁ బవిత్రమగు దైవికసాధనము వేఱొండు లేదు. ఫలాపేక్షాశూన్యుఁడయి కర్మభూమిని బ్రవేశించు మనుష్యుడు తనచిత్తముపై సంపూర్ణమగు నధికారమును నెఱపనేర్చి సులభముగా నున్నతచారిత్రుఁడయి లోకోత్తరమగు శక్తియుతుఁడు కాఁగలుగుచున్నాఁడు.

మనుష్యుఁడా! నీసమ్ముఖమున గోచరించు కార్యమును సులభముగా సిద్ధించురీతి దత్తచిత్తుఁడవయి దృఢసంకల్పముతో నాచరింపుము. ఆత్మశక్తియు, ధ్యానబలమును, పౌరుషమును వర్ధిల్లుట కిదియే సత్యమగు నుత్తమమార్గము. కర్మయోగము నభ్యసించుటకంటె జీవితము నుద్ధరించుకొనుటకుఁ దగు నుత్తమసాధన మేదియు భూమండలమునఁ గానరాదు.

కావున నీవు భ్రాంతుఁడవయితేని, దుష్టోపదేశముచే మోస గింపఁ బడితేని, కర్మయోగమహిమను విస్మరించి నిజాభ్యుద యమునకయి మంత్రతంత్రాది కృత్రిమోపాయముల నన్వే షింపఁ బోకుము. ఉన్నతిని సంపాదించుటకుఁ బ్రతివిధమగు నుపాయము నీలోఁ దనే - నీహృదయమందే వెలయుచున్నది. నీ హృదయస్థమగు నుపాయమును గ్రహించుటకు నీ వేస్థితియం దుంటివో దానియందే సంపూర్ణముగా నీచిత్తమును లీనమొన రించు పద్ధతి నభ్యసింపుము. అనగా నీ వేకార్యమును బ్రారం భింపుచుందువో, యాకార్యమునందే సంపూర్ణమగు ధ్యాన మును గలిగియుండు చుండుము. నీ వీరీతి వర్తింప నంతపర్యంతము నీ వెంతగాఁ గామించినను కల్యాణము కలుగ నేరదు.

ప్రతిక్షణమందును గార్యాచరణమునకు బలమును, బుద్ధిని ముఖ్యసాధనములుగ నవలంబించి జ్ఞానమును వృద్ధిగా వించుకొను చుండవలయును. జ్ఞానసంపన్నుఁడు క్షణకాల మం దెన్నికర్తవ్యములబాధ్యత నెత్తిపైఁ బడినను వ్యాకుల చిత్తుఁడు గాక, వాని నన్నింటి సులభముగా నిర్వహించివేయు నంతటి సమర్థుఁడు కాఁగలఁడు. ఏవిషయము నల్పమని భావిం పక సామాన్య కార్యములను మహాకార్యములవలె నాచ రించు వ్యక్తియే శక్తిసంపన్నుఁడు; అతఁడే ధీమంతుఁడు. దుర్బ లహృదయులగు మూఢులు సాధారణకార్యముల నసావధాన

చిత్తులయి సక్రమపద్ధతి నాచరించుచు ఘనకార్యములకయి యాతురపడుచుందురు. వారు స్వల్పకార్యముల నసావధానచిత్తతతో ననుచితపద్ధతి నాచరించి తమ యయోగ్యతను, నపరిపక్వబుద్ధిని బాహ్యప్రపంచమునకుఁ దెల్లమొనరించుకొని యుంటిమి గదా యని గ్రహింపలేనంతటి యజ్ఞానాంధకారమయస్థితియం దుండు చుందురు. తనపై నధికారమును నెఱపుకొనఁ జాలని మనుష్యుఁ డితరుల శాసించుటకును, మహత్తరములగు బాధ్యతల శిరమున ధరించుటకును లోభించుచుండును. "తన కర్తవ్యమును దుచ్ఛముగ భావించి తన్నిర్వహణమునకుఁ గడంగని వ్యక్తి ఆత్మవంచకుఁ డనఁబడుచున్నాఁడు. సామాన్య కర్తవ్యము నధమముగఁ దలపోసి దాని నాచరింపకుండుటకంటె భయంకరమగు నాత్మద్రోహము మఱొండు లేదు." అని మహాత్ము లనేకులు తమస్వానుభవసిద్ధమగు జ్ఞానముచే సిద్ధాంతీకరించి యున్నారు.

కార్యమును శక్తిమూలమున నాచరించుటచే మానవుని శక్తి విశేషముగ వర్ధిల్లువిధముననే దుర్బలత్వముచేఁ గార్యమాచరింపఁ బడినచో దౌర్బల్యమే వృద్ధి నందఁగలదు. మనుష్యుఁడు మహాకార్యముల నాచరించురీతిగనే సామాన్యకర్తవ్యములనునయితె మాచరింపు చున్నాఁడు. పాపాచరణముచే సంప్రాప్తమగు దుఃఖమే దుర్బలత్వము చేతను మనుజులకు

లభ్య మగుచున్నది. కావున దుర్బలత్వము పాపములలో నొకటిగ లెక్కింపఁ బడుచున్నది. మానవునియందుఁ జారిత్ర బలము నెలకొనక యున్నంతపర్యంతము వాని కెట్టియానంద మును గలుగనేరదు. దుర్బలమనుష్యుఁడయినను సామాన్య కార్యముల మహాకార్యము లని భావించి యాచరింపఁ గడంగి నచో బలాఢ్యుఁడు కాఁగలుగుచున్నాఁడు. బలవంతుఁడగు మనుజుఁడు తన సామాన్య కర్తవ్యముల నాచరించుటయం దసావధానతను, నిర్లక్ష్యమును గలిగియున్నచో వాని సామాన్యమగు వివేకమును, బురుషకారమును నష్టమయిపోవ వాఁడును దుర్బలుఁడే యగును. ఈదిగువ నుదహరింపఁబడు శబ్దములలో పఠింపఁబడియున్న యున్నతియొక్క నియమము పైని ప్రసంగమును సమర్థింపుచున్నయది:— "తొలుదొలుత నుండియు బల మెవ్వనియందుండునో వానికే నిత్యము నూతనముగ బలము లభింపుచుండఁగలదు; ప్రప్రథమమునుండి బల మెవ్వనియందు లేకుండునో వానికిఁ గల స్వల్పమగు బలము సయితము ప్రకృతిచేఁ గబళించి వేయఁబడఁగలదు." మనుష్యుఁ డూహించుటను బట్టియుఁ, గర్మ మొనరించుటను బట్టియు, వచించుట ననుసరించియు వానికి లాభనష్టములు కలుగుచుండును. మానవునిచారిత్ర మనుక్షణము వృద్ధిక్షయ ములకుఁ లోఁబడుచునే యుండుచున్నయది. మానవజీవితము నం దొకక్షణమునఁ గల్యాణాంశము వృద్ధియగుచుండ మఱొ

క్షణక్షణమునం దహితాంశము హెచ్చుపెరుగు చుండును. అనగా నేత్రమునందు మానవుని మనోవాక్కర్మ లేరీతిగ నుండునో, ఆవిధముగనే వానిచారిత్రమును హెచ్చుచుఁ దగ్గుచు నుండ, లాభనష్టములును నదియే చందమునఁ బ్రాప్తింపు చుండును.

లఘుత్వమును శాసింపనేర్చిన వ్యక్తి గురుత్వముపై నయితము న్యాయసంగత మగు నధికారమును నెఱపఁగలుగు చున్నాఁడు. లఘుత్వమునకు స్వయముగా వశీభూతుఁడయి, తద్దాస్యమునకుఁ గడంగుచుండు మనుష్యుఁడు విజయుఁడు కానేరఁడు. పరాభూతుఁడగు నతఁడు జీవితమందును గురుత్వమును సమీపింపఁ జాలఁడు.

మూర్ఖుఁడు క్షుద్రదోషములును, నల్పములగు నధర్మములును, క్షుద్రములగు పాపములును మహత్త్వమును గలిగి యుండవనియుఁ గావున నిరంతర క్షంతవ్యములనియు దూరదృష్టిలేమిచే భావింపుచుండును. వాఁడు తానేదేని భయంకర మగు పాపమునుగాని, వ్యభిచారమునుగాని చేయనంత పర్యంతమును దాను పుణ్యాత్ముఁడనే యనియు, నల్పములగు పాపములచేఁ జారిత్రము దూషితము కానేరదనియు భావింపుచుఁ దన్ను స్వయముగా మోసగించుకొను చున్నాఁడు. మూర్ఖుఁడీరీతి భావించుటచేఁ దనకుఁగల సామాన్యపుణ్యమును నయి

తము నష్టమొనరించుకొని దురాత్ముఁ డగుచున్నాఁడు. అట్టి దురాత్ముఁడు తనజీవితమునం దెపుడు నాత్మపరిశోధనపాఠము నభ్యసింప నేరక స్వల్పకాలమునందే యథఃపతితుఁడు కాఁగలఁడు. అట్టి పతితుఁడగు పామరుని లోకము సన్మానింపఁజాలదు. వాని నొక నిర్జీవప్రతిమగ భావించి సదా ధిక్కరింపుచుండఁగలదు. అట్టి హీనుఁడు మానవసంఘమును సంస్కరింప యత్నించినను దన సహచరులకు విషయాదిపాపములనుండి విడివడ నుద్బోధించినను వాని ప్రయత్నములును సదుపదేశములును నిష్ఫలములు కావలసినచ్చును. వాఁడు తన దోషముల క్షుద్రములని భావింపుచున్నకొలఁదియు వాని చారిత్రమును మనుష్యత్వమును హైన్యమునకు గురియగుచుండఁగలవు. వాఁ డేరీతి ననియమితమును, నిరంకుశమును నగు స్వాతంత్ర్యముచే దూషితకార్యముల నాచరింపుచు నిజదుర్బలత్వమును బ్రకటింపుచుండునో ఆ నిరంకుశస్వాతంత్ర్యమును, నసావధానతయు మానభంగకరముగ రూపాంతరితములయి వానిని జేరుచుండును అట్టి మందభాగ్యునిగూర్చి విచారించువా రుండఁబోరు. కారణమేమన నింద్యచారితుఁడని లోకము ప్రేమింపఁజాలదు. వాఁడు నిత్యము దుర్బలుఁ డగుచుఁ దనకార్యముల సాధించుకొననేరక నిరుద్యోగము యొక్క దుష్టఫలితమగు ఘోరదారిద్ర్యదుఃఖమును విధిలేక యనుభవింపవలసినవాఁ డగుచుండును. కర్మయోగ సాధనబలమునుండియు, వివేకమునుండియు, లోకాను

భవమునుండియు శూన్యుఁడగునట్టివానియుపదేశము నాలించునా రీభూమండలమున నుండఁబోరు. ప్రతిధ్వనిని వెంటాడిన ఫల మేమి కలుగు?

సామాన్యమానవులు సదా యసావధానచిత్తులయి సేయునట్టి యపరాధములకయి యెట్టిదండనము ననుభవింపకుండనుండుచుండ, బుద్ధిమంతు లట్టిసామాన్యములగు దోషముల యందే యంతిరాగ్రస్తమయి యుండు భయము ననుభవించుచున్నారు. వారు దోషముల పరిత్యజించుటచేతను, విశుద్ధభావములఁ జింతించు కారణమునను, పవిత్రకార్యముల నాచరించుటచేతను లభించు మోక్షమును సయితము వీక్షింపఁగలుగుచున్నారు. కాని యిట్టి పవిత్రచారిత్రసంప్రాప్తమగు ముక్తినే సామాన్యులు తుచ్ఛముగఁ దలపోయుచుండుట శోచనీయము. బుద్ధిమంతుఁడు సామాన్యమనుష్యులు స్వప్నమందును జూడ నభిలషింపనట్టియు, దైనికకార్యములలో నవలంబింపఁబడుచున్నట్టియుఁ బ్రశాంతమగు నాంతరికాల్పదమనమును గుర్తింపఁ గలుగుచున్నాఁడు.

తమ సామాన్యదోషములను, సాధారణపాపములను మహాభయంకరములుగ గుర్తించి పరిత్యజింప నాయత్తపడు మనుష్యులే సాధుసత్తములగు మహాపురుషులు. వారు తమ ప్రతిభావమందును, గార్యమందును సువిశాలమగు ప్రభావ

ముదయింపుచుండుటను వీక్షింపఁ గలుగుచున్నారు. వారు తమ జీవితాభ్యుదయమునకును, పతనమునకును హేతుభూతములగుచుండు సామాన్యములగు చరిత్రాంశములయొక్క న్యూనాధిక్యములను సావధానచిత్తులయి విలోకింపుచున్నారు. బుద్ధిమంతు లిట్టి యాత్మపరిశోధనమందును, సత్యాన్వేషణమందును జతురమతులయి యుండుటవలననే క్రమక్రమముగాఁ దమ్ము తామే యుద్ధరించుకొన సమర్థులగుచున్నారు. నిరంతరము తమచారిత్రమును, జీవితచర్యలను ధ్యానపూర్వకముగఁ బరిశీలించుకొనుచుండు వ్యక్తి పవిత్రుఁడును, భవ్యుఁడును నగుటయం దాశ్చర్యము లేదు. పరిశోధనము పాపపరిహారమునకు మూలసాధనము.

సముద్రము బిందువులచేతను, వసుంధర కణములయాలమునను, నక్షత్రములు ప్రకాశరేణువులవలనను నిర్మింపఁబడినట్లే మానవజీవితము సామాన్యములగు భావములవలనను, కార్యములచేతను విరచితమయి యున్నది. భావములు, కార్యములు లేనిచో జీవితాస్తిక్యమే మిథ్యయగుట తటస్థించును. కావున ప్రతిమనుష్యుఁడును వానిజీవితమును వానిభిన్నములగు భావముల ననుసరించియుఁ, గార్యముల ననుసరించియు నేర్పడుచుండును. ఆ వివిధములగు భావములయొక్కయుఁ, గార్యములయొక్కయు సంఘటన (కూర్పు)మే మనుష్యుఁడు.

సంవత్సరము క్రమబద్ధములగు క్షణములయొక్క సమూహమే యయినచందమున మానవజీవితమును, దచ్చారిత్రమును గ్రమబద్ధములగు భావములయొక్కయు, గార్యములయొక్కయు సమ్మేళనమే యని నుడువఁ బనియుండదు. వివిధములగు సంగప్రత్యంగముల సమ్మేళనముచే దేహముయొక్క బాహ్యాకృతి నిర్మింపఁబడుచున్న విధముగనే వివిధోపకరణములచే మానవజీవితము సిద్ధమగుచున్నది. వర్షము (సంవత్సరము) సకలఋతువులచేఁగూర్పబడినది. భూమండలము సమవిధ పదార్థములయొక్క విరాట్స్వరూపము.

సామాన్యములగు నుపకారములవలనను, నౌదార్యములకారణమునను, నాత్మసమర్పణముచేతను సహజ దయార్ద్రమునను, నుపకారపరతంత్రమును నగు సత్స్వభావము సృష్టింపఁబడుచున్నది. సాధారణములగు నాత్మోత్సర్గములు, సహనశీలతలు, ఆత్మవిజయములు మానవుల శక్తిసంపన్నులుగను, సమున్నతచారిత్రులుగను సిద్ధమొనరింపుచున్నవి. జీవితముయొక్క సామాన్యవ్యవహారములందుఁ బౌరుష్యమును వహించు మానవుఁడే వజ్రసమాన కఠినచిత్తుడు. తన క్షుద్రములగు పనులందును, నుడువులందును యోగ్యతను, సుబుద్ధిని వెల్లడించు మనుష్యుఁడే యోగ్యుఁడు; వందనీయుఁడగు సజ్జనుఁడు.

మనుష్యుఁడు లోకమందనేకసందర్భముల మోసగింపఁబడుచు జీవితము క్షణికములగు భావములనుండియుఁ,

గార్యములనుండియు భిన్నముగా నున్నదని గ్రహింపఁ గలుగుచున్నాఁడు. నాఁడు సామాన్యములగు భావములును, గార్యములును జీవితముయొక్క సారభూతములగు మూలసులని గ్రహింపఁ జాలకున్నాఁడు. ఈరహస్యమును గుర్తించిన మనుష్యునకు సమస్తపదార్థములును బవిత్రితములుగ గోచరింప నారంభించును; సమస్తకార్యములు, కర్తవ్యములు ధర్మయుక్తములుగఁ దోప మొదలిడును. సామాన్యములగు వ్యవహారములందు సత్యము గర్భితమయి యున్నది. సంపూర్ణత్వమే నిష్ప్రాణత్వము.

"అధికారములు, సంపాదనములు, ఉపలబ్ధులు నశింపుచున్నవి, ఆజ్ఞలు మార్పునొందుచున్నవి, మానసముయొక్క యుద్వేగములును బరివర్తనశీలములే, కాని కర్తవ్యము కబళింపఁబడఁజాలదు; క్షీణింప నొల్లదు; మంచి చెడ్డ ఘటనలను తుపానులచేతను విచలితము కానేరదు."

జీవితముయొక్క భాగములు క్రమముగాఁ గడచిపోవుచున్నవి. సమగ్రజీవిత మొక్కనాఁటిక నతిక్రమించి పోవుచున్నది. మానవుఁడా! నిద్రింపుచుంటి వేమి? అయ్యో! నీ వింతటి మందభాగ్యుఁడవు లే!! లెమ్ము!! మేల్కొనుము! నీజీవితము ముగియకమునుపే పవిత్రములగు కర్తవ్యములనన్నింటి నిర్వహింపుము. నీ కభిలాషయున్నచో నీ జీవితము

యొక్క ప్రతిభాగమును యోగ్యతచేఁ బరిపూర్ణము కాఁగ
లదు. ఇట్లొనరించుటచే సంపూర్ణజీవితమం దెచ్చోటను దృటి
యుదయింపనేరదు. "రాగిడబ్బులనుగూర్చి జాగ్రత్తపడువాని
వెండినాణెములు వానికవియే జాగ్రత్తపడఁగలవు" అనుసిద్ధాం
తవాక్యము సార్థకమాయినది. ఈసిద్ధాంతము ప్రాపంచికవ్యవ
హారములందు యుక్తియుక్తమును, జనితార్థమును నగుచుండ
మున నేసుజ్ఞాన జ్యోతిర్విభాసితమగు సూక్ష్మప్రపంచ . సంము
ను విశేషప్రయోజనదాయక మగుచున్నది. వర్తమానమం దాచ
రింపఁబడు ప్రతికార్యమును ధ్యానపూర్వకముగఁ బరీక్షించు
చున్నచో మానవుని భావిజీవితముయొక్కయుఁ, జారిత్రము
యొక్కయు సమస్తవిషయములు చక్కఁబడఁగలవు భావికాల
మును దృష్టియం దిడుకొని వర్తమానమును సంస్కరించుకొన
సన్నద్ధుఁడయియుండు మనుష్యుఁడే సావధానుఁడును, సప్రయత్నుఁ
డును, నిపుణుఁడును నగుచున్నాఁడు. ప్రతిమనుష్యుఁడు మహాత్వ
మును గలిగియుండునట్టియుఁ, బ్రశంసకుఁ బాత్రమగునట్టియు
విషయముల నుడువ నాకాంక్షితుఁడయి యుండరాదు. వర్తమా
నమందుఁ దనసమ్ముఖమున సిద్ధముగా నున్న కర్తవ్యముల నుచి
తరీతి మనుష్యుఁడు నిర్వహించినచోఁ బ్రశంసనీయములగు
విషయములు తమంతట తామే సిద్ధింపఁగలవు. మానవుఁడు
తన యాధునిక కర్తవ్యపథమునఁ గల ప్రతిబంధకములను,
నభ్యంతరములను విలోకించి భీతచిత్తుఁడు కారాదు. నిస్స్వార్థ

భావములతో, నిర్భయహృదయముతోఁ గర్తవ్యముల సాధింపఁగడంగుటచే విఘ్నభయబాధలన్నియు నంతర్హితములయి పోఁగలవు. అసంతోషము, సోమరితనము, గొప్పపనుల నొక్కసారిగఁ జక్కబెట్ట వలయునను పేరాస, సత్వర త్యాజ్యములు. ఇట్లాచరించుటచే మనుష్యుఁ డేమహాత్మ్యమును బడయుటకయి ఘోరమగు తప మొనరించుచుండునో, ఆమహాత్మ్యమే తానుగా వచ్చి వానిచరణరాజీవముల మ్రోల వ్రాలఁ గలదు. తొట్రుపాటునకును, బౌమముడికిని సమానమగు దుర్బలత్వము వేఱొండు లేదు. ఆంతరిక ప్రతిష్ఠను, ఆధ్యాత్మిక గౌరవమును బడయ నుద్యోగ మొనరించుట మానవుని విధి. తృణాభంగురమును, నింద్యమును, దుఃఖదాయకమును నగు బాహ్యప్రశంసను బడయ యత్నించ నగత్యము లేదు. కృత్రిమమగు నీప్రశంస యాధ్యాత్మికప్రతిష్ఠయొక్క యడుగులకు మడుగులొత్తుచుండును.

కర్తవ్యముల నాచరించుటయందుఁ గలుగు కష్టనష్టములును, భయబాధలు నాకార్యమందు లేవు. అవి మానవుని మానసమునందే నెలకొని యుండుచున్నవి. మనుష్యుఁ డాకార్యమువైపునకుఁ దనమనోభావమును ద్రిప్పుచో వక్రపథము ఋజుమార్గమగును, అసౌఖ్య మానందముగఁ బరిణమించును.

మానవుఁడా! నీవు నీప్రతిక్షణమును బవిత్రముగను, నుపయోగకరముగను జేసికొన నుద్యమింపుము. ప్రతికార్య

ము ననురాగముతోడను, నిస్స్వార్థభావముతోడను నాచరింపుము. ప్రతిభావమును, వచనమును, కార్యమును ధర్మయుతముగను, మృదుమధురముగను చేసికొనుము. ఈరీతి నీవు నీజీవితముయొక్క క్షుద్రాతిక్షుద్రములగు విషయముల యసామాన్యమహాత్త్వమును నభ్యాసానుభవములన్ గ్రహించి యపారమగు నక్షయానందము స్వేచ్ఛగ ననుభవింపుము



## తృతీయ ప్రకరణము.



## కాఠిన్యము - వ్యాకులత.

మనుష్యత్వమును బడయ నభిలషించు ప్రతివాఁడును స్వీయహృదయమును శాసించుపద్ధతి నభ్యసించవలయును. విషయవాసనలను నిర్మూలించి వానిస్థానమున నిగ్రహమును మహోన్నతమగు సువిశాలపీఠమును సుస్థాపిత మొనరించి దానిపై నుపవసింపఁదగును. ఆశాభయములను రాజద్రోహులఁ జీల్చి చెండాడి స్వతంత్రమగు నాత్మసామ్రాజ్యమును స్థాపించి స్వచ్ఛందపరిపాలనముచే సుస్థిర యశస్సౌఖ్యముల ననుభవించుటకదు లెస్స. —శేలీ.

మానవదేహధారీ! నీవు నీలక్ష్యమునుండి విచలితుఁడవయితివా? ఒకతూరి లక్ష్యమునుండి తప్పిపోయినంతనె భీతిచే మహావసాదాక్రాంతుఁడవయితివేమి? భీరువువలె విగతసాహసుఁడవగుట తగునా? అల్లదిగో! నీ జీవితలక్ష్య మిప్పటికి నేఁటికి దళతళలాడుచున్నదో నేత్రములఁ విప్పి యొకసారి విలోకింపుమా!

వీక్షించితివేని యాశాలత తిరిగి వికసింపఁగలదు. అపుడు నీవు ప్రయత్నశీలుఁడవగుదువు. సోదరుఁడా! పర్యాత్తుచుఁ బతితుఁడవయితివా? అయినచో నష్టమేమి? సేదఁదీర్చుకొని తిరిగి పరుగిడుము.

—ఇలావ్హీలరువిలకాక్సు.

'శ్రేయాంసి బహువిఘ్నాని' అను గురుజనోక్తి సామాన్యమానవుల పరిహాసమునకుఁ బాత్రముకాఁగలదు. విపత్పరంపరవలనను, దుఃఖభారముననను నపారమగు దివ్యానందము లభించుననుటలో జనసామాన్యమున కావంతయు విశ్వాసము కలుగ నేరదు. కష్టసహిష్ణుత సౌఖ్యప్రాప్తికి మూలసాధన మను విజ్ఞానసిద్ధాంతము సాధారణ మానవకోటి కసంగతముగఁ దోఁపవచ్చును. కాని యీసిద్ధాంతమందుఁ గల పరమసత్యము నను బ్రాజ్ఞలోకము మహాపురుషుల పుణ్యచారిత్రములఁ బరిశీలింపుచుండుటచే సులభముగా గ్రహింపఁగలదు. సత్యమే బాహ్యమున కసత్యముగ గోచరింపుచుండవచ్చును. మాధవప్రపంచముయొక్క దృష్టికి దుఃఖములుగ నున్నవే ధీమంతుల విశాలదృష్టియందు సుఖములుగ నుండుచున్నవి. విపత్పరంపరలు తొలుత నజ్ఞానమునుండియు, దుర్బలత్వము నుండియు జనించి యనంతరము జ్ఞానమును, శక్తిని మానవునకుఁ గలిగింపుచున్నవి. సంకటము సదుపదేశదాయకము. సదుపదేశము సంస్కరణ సాధనము. సంస్కరణ మాత్మవిజయమునకు మూలము. ఆత్మవిజయ మమందానందకందము

సత్యపరతంత్రమగు జీవితముచే జ్ఞానము లభింపుచున్న కొలఁదియు సంకటములు క్షీణింపుచుండఁగలవు. జ్ఞానప్రాప్తిచే దుఃఖములు, విపత్తులు, చిక్కులు భానుప్రకాశమునఁ దొలఁగు తమఃపుంజములమాడ్కి క్రమముగా దూరమగుచుండఁగలవు. కాఠిన్యమును, సంకటములును గర్తవ్యమునం దుండనేరవు. అవి కార్యాచరణమునకు ముఖ్యసాధనములగు మనోభావమునుండియుఁ, బౌరుషమునుండియు నుదయమగుచుండును. బాలుని కాచరణసాధ్యముకాని కఠినకార్యమే ప్రౌఢవయస్కుని పరిపక్వమగు మస్తిష్కమునకుఁ గఠినముగ నుండజాలదు. ఇదియే చందమున జ్ఞానశూన్యునకుఁ గఠినముగఁ బ్రతీతమగు ప్రతివిషయము వివేకవంతునకు సులభముగ నుండుచున్నది.

అశిక్షితుఁడును నపరిపక్వ మస్తిష్కయుతుఁడును నగు నర్భకున కొక సరళమగు పాఠము నభ్యసించుటయందు చిక్కటమును, దుర్దమనీయమును నగు కాఠిన్యము కలుగఁగలదు. సులభమగు నాపారవిషయమునఁ బారంగతుఁడగుట కా బాలకుఁడు దీర్ఘకాలపర్యంత మెంతయో వ్యాకులతను, గష్టమును ననుభవింపవలసియే యుండుచుండును. కాఠిన్యముయొక్క మహోన్నతమగు ప్రాకారము నుల్లంఘించి విజయదుర్గమునఁ బ్రవేశించుటయం దా బాలుఁ డనేకపర్యాయములు విఫల

మనోరథుఁడయి నిరాశచే నశ్రుధారల వర్షింపఁజేయుచుండఁ గలఁడు. కాని ధ్యానపూర్వకముగఁ బరిశోధించినచో నశ్రుపాతమునకు హేతుభూతమయిన కాఠిన్యము బాలకుఁడు చద్వ దొడంగిన పాఠమందు లేదనియు, వాని యదూరదర్శిత్వమునందును, వివేకరాహిత్యమునందును గలదనియుఁ దెలియఁదగును. ఆకాఠిన్యమును సౌలభ్యముగఁ బరిణత మొనరించుటకును, బాలకుని స్వాస్థ్యము, సౌఖ్యము, కల్యాణము నిమిత్తమును జ్ఞానమును వృద్ధిగావించు కొనుటత్యంతావశ్యకము.

పైనుదహరించిన బాలకుని దృష్టాంతమునుబట్టి మానవుఁడభ్యుదయమును, శ్రేయస్సును బడయుటనిమిత్తము జీవితసమస్యలయొక్క పరమత్వమును జయించుటయందును, విపత్పరంపరల డీకొనుటయందును బారంగముఁడు కావలసియున్నది. అగణితములగు విఘ్నములను, గష్టములను సాహసముచే నెదుర్కొని జయించుచుండుటచే మానవుని లోకానుభవమును, జ్ఞానమును, వివేకమును వృద్ధిపొందుచుండఁగలవు. ఇట్లాచరించుటచే నవీనపాఠాభ్యాసమునను, నూతనసత్కార్యాచరణమునను సంప్రాప్తమగు దివ్యమగు సౌఖ్యము మానవునకు లభింపఁగలదు.

**సంకటముయొక్క యథార్థమగు రూప మెట్టిది?**

సంపూర్ణత్వము ననుగ్రహింప సాధ్యపడనిస్థితికే సంకట మని

పేరు. కావున మానవుఁ డీవిపత్తును దూరమొనరించుకొన నధికమగు జ్ఞానమును, గంభీరమును, విశాలమును నగుబుద్ధిని సముపార్జింపఁగడంగు టెల్లరితుల శ్రేయోదాయకము. ఈ యవసరమందు మానవుఁడు తనయనభ్యస్తమగు పురుషకారమును, నాంతరికబలమును, గుప్తశక్తిని వినియోగింపవలసియుండును. అట్టిస్థితియందు వాని కిష్టార్థములన్నియు సులభముగ సిద్ధింపఁగలవు. కావునఁ గాఠిన్య మొక ఛద్మవేషమును ధరించియున్న స్వర్గదూత యని తెలియఁదగును. కాఠిన్యము మానవుని కాదర్శగురువు; పరమమిత్రము. కారణ మేమన దానినీతిశిక్షను మానవుఁడు ప్రశాంతహృదయముతో నాలకించి, యథోచితముగ గ్రహించినచో నదియే వానికి మహోత్తరానందమును, సమున్నతజ్ఞానమును బ్రసాదింపఁగలదు.

కఠినత్వము లేనిచో యేవిధమగు నభ్యున్నతియు, వికసనమును, బరివర్తనమును గలుగనేరవు. ప్రతిరోధమును, బ్రతిఘాతమును, ఆటంకములును సృజింపఁబడియుండనిచో సకల ప్రపంచము స్థాణువు వలె నొక్కస్థలమందే నిలిచిపోవుట తటస్థించును. మానవజాతి పరిశ్రాంతి, ప్రమాదములచే వ్యథఁజెంది నష్టమయిపోవుట కలుగఁగలదు.

కర్తవ్యపథమునం దేదేనివిఘ్న మొందు తటస్థించినచో మనుష్యుఁడు హర్షోత్ఫుల్లముఖారవిందుఁడు కావలయును.

కారణమేమన విఘ్నములును, కష్టనష్టములును దటస్థించి నపుడు మనుష్యుడు మౌఢ్యమునందును, దుర్బలత్వమునందును దాసుఁడయి యున్నాఁడనియుఁ గర్తవ్యపథమందలి ప్రతిబంధకములఁ దొలఁగింప సముచితసాధనమును బడయునిమిత్తము విశేషమగు పురుషకారమును, సుస్థిరమగు బుద్ధిని నుపయోగింప వలసియుండు ననుభావమును దెల్లమొనరించు వాక్యము లతనికి సూక్ష్మప్రపంచమునుండియు, నాత్మాంతరాళమునుండియుఁ గర్ణగోచరము లగుచుండఁగలవు. మానవుఁడు వివేకమును, నాభ్యంతరిక శక్తులను, నాత్మస్వాతంత్ర్యమును, సాధనబలమును సంపాదింప బాధ్యుఁడయి యున్నాఁడను హెచ్చరికను నిరంతర మొసంగుచుండున దీ పరమపవిత్రమగు 'విఘ్నమే.'

ప్రత్యేకముగాఁ గాఠిన్యమనుస్థితి వేఱొండులేదు. మానవుఁడు తనయాస్తిక్యముయొక్క సమగ్రత్వమును గ్రహింపలేకుండుటకే న్యూనతయనియుఁ, గాఠిన్యమనియు, విఘ్నమనియుఁ, బ్రతిఘాతమనియు, సంకటమనియు వివిధములగు నామములు కలవు. ఈకారణముననే కాఠిన్యముచే ననంఖ్యాకములగు ప్రయోజనములు కలుగఁగలవని నుడువవలసి వచ్చుచున్నది.

కష్టములు, బాధలు స్వచ్ఛందముగను, హఠాత్తుగను నుదయింపఁజాలవు. వాని యావిర్భావమునకు బహుకారణము

లుండుచుండును. మానవదేహముయొక్క యవయవములు పెంపొందుచుండిన కొలఁదియు వికాససిద్ధాంతము (law of evolution) ననుసరించి విఘ్నములు కలుగుచుండును. ఈవిఘ్నములే మానవునకు విజయమందిరము నారోహించుటకు బలవత్తరములగు సోపానములు కాఁగలవు.

మనుష్యులను విఘ్నభయబాధలకుఁ బాత్రులఁ జేయునట్టియు, వానినుండి వారల విముక్తులఁ గావించునట్టియు భిన్నములగు మార్గముల నాచరణము కలిగియున్నది. మనుష్యుఁ డెంతగా ప్రయత్నించి చతుర్దిశలనుండి తన్ను దృఢతమములగు పాశముల బంధించుకొనియుండినను వాఁ డాచరణముచే స్వయముగా బంధనవిముక్తుఁడు కాఁగలుగుచున్నాఁడు. మానవుఁ డజ్ఞానాంధకార బంధురమగు జీవితనిర్వాహమున కలవడి ఘోర దుఃఖములఁ జిక్కియున్నను, మార్గశూన్యమగు భయంకరారణ్య మధ్యమునఁ దగుల్కొని మార్గముగానక వ్యర్థముగా సంచరించుచున్నను స్వయంకృషిచే సత్యముయొక్క విశాలమగు మార్గము నన్వేషించి, బ్రహ్మానంద వివేకయుక్తమగు కర్తవ్య మను పరమోజ్జ్వలనగరమును జేరు నిష్కంటకమగు యీమార్గము ననుగమింప సమర్థుఁడగుచున్నాఁడు. కాని కాలుపైఁ గాలు వైచుకొని కూర్చుండుటవలనను, హతాశుఁడయి రోదించుటవలనను, విచారభరమునఁ జీత్కారమైన

రింపుచుండుటచేతను మానవుఁ డభ్యుదయమును బడయఁ జాలఁడు, [illegible]యాత్మశక్తిని సదా నశింపఁజేయుచుండునట్టి సంకోచమును, మనశ్చాంచల్యమును—నిరంతరోద్యోగమును, న్యాయసంగతమగు చింతనమును, నాత్మసంశోధనమును నిర్మూలించి వేయఁగలదు. పతితుండగు మానవుఁడు నిరంతరము తన యధమస్థితినిగూర్చి విచారించుకొనుచుఁ, దద్దుర్దశనుండి విడివడుట కాతురపడుచుఁ, దనచితమునందు సంపూర్ణాధికారములను నెఱప యత్నించుచు, మానసోచితమగు నవ్యమైన స్థానమును జేరుట కనుగుణ్యమును, గ్రహబద్ధమును, ధార్మికమును నగునుద్యోగ మొనరించుచుండుట శ్రేయస్కరము. ఉద్యోగశూన్యమగు పశ్చాత్తాపమును, జింతనమును మానవునికర్తవ్యముయొక్క కష్టపరిమాణమును వృద్ధిగావింపఁగలదు. పతితుఁడు స్వయంకృతాపరాధనివృత్తి కొఱకు పశ్చాత్తాపముతోఁ బాటు ధీరహృదయుఁడయి కార్యసాధనమునకుఁ గడఁగుట సత్యము. అధమస్థితికిఁ బ్రాపించిన వ్యక్తి యొకింత తడవు ప్రశాంతహృదయుఁడయి, తా నేయే కర్కశపథముల ననుసరించుటచే నిట్టి దుర్దశ కలిగినదియుఁ, దా నేయే సందర్భములందుఁ బొరఁబడినదియుఁ దనయంతరాత్మను బ్రశ్నించుకొనినచోఁ దనలోపముల నన్నింటి స్పష్టముగా గ్రహింపఁగలఁడు. సత్యముయొక్క జిజ్ఞాసతో మానవుఁడు తనపతితావస్థకు హేతువు నారయుచో రహస్యము వెల్లడి కాక మానదు. అతఁడు

నిరంతర మీరీతి విచారింపుచుండుటచేఁ దనకర్తవ్య నిర్వహణ మునకే మేలోపములు వాటిల్లినదియు గ్రహింపఁగలఁడు. సామాన్యమగు నపజయమును దూరమొనరించుటకువిశేషమగు నాలోచనాశక్తియు, బుద్ధివికాసమును, ధృతవ్యయమును, స్వార్థశూన్యతయు నత్యావశ్యకములనియు, వీనిచేఁ గార్యముయొక్క కాఠిన్యమును, క్లేశములును దూరమయి పోఁగలవనియు, నాత్మపరిశోధనా తత్పరుఁడగు ప్రతిమనుజుఁడును గ్రహింపఁగలుగుచున్నాఁడు. ఆత్మపరిశోధకుఁడు తా రీతి దుర్వ్యసనములకు వశుఁడయి క్రమక్రమముగ భవభయదుఃఖతాపబంధనములఁ దగుల్కొనినదియు, జ్ఞానమువలనను, వివేకముచేతను సన్మార్గము రీతి ననుసరింపవలసి యుండునదియు స్పష్టముగా గ్రహింపఁగలఁడు. ఆతఁ డీరీతి వర్తించి తన భూతకాల జీవితచారిత్రముచే సువర్ణసమానమగు వివేకానుభవముయొక్క మూల్యవంతములగు కణముల నొక్కచోఁ బ్రోవుచేసినచో వాని విపత్పరంపరలయొక్క పరిమాణము చాల క్షీణించిపోఁగలదు. అనంతర మతఁడు తన యుద్వేగశూన్యమగు భావముయొక్క తీవ్రప్రకాశమును విపత్పరంపరలఁ బరీక్షించుటకును, వాని సమగ్రస్థితిని గుర్తించుటకును, వానిలోపలియొక్కయుఁ, దనయందలియుఁ గార్యబుద్ధిని గ్రహించుటకును వినియోగించివేయు నని స్పష్టపడుచున్నది. ఇట్లాచరించుటచే విపత్పరంపరలు దూరమయిపోవ ఋజుమార్గము

దృష్టిగోచరము కాఁగలదు. అపు డామనుష్యుఁడు తన యావజ్జీవితమునకుఁ దగు ప్రయోజనకరమగు నీతిశిక్షను నేర్చుకొనఁ గలుగుచున్నాఁడు. ఇంతియేకాక వాని స్థితియందును విడిచిపుచ్చనొల్లని వివేకముయొక్క కొంతభాగమును, బ్రహ్మానందముయొక్క యొకింత పరిమాణమును బడయఁ గలుగుచున్నాఁడు. అజ్ఞానము, స్వార్థము, మౌఢ్యము, హ్రస్వదృష్టి మొదలగువాని మార్గములన్నియుఁ దొట్రుపాటు, వ్యాకులతలయందు సమాప్తములగుచున్నవి, అదియే చందమున సుప్రసన్నతగను, శాంతముగను బరిణమించు జ్ఞానమునకును, ఆత్మత్యాగమునకును, వివేకమునకును గూడ మార్గములు కలవు. ఈసిద్ధాంతమును బాగుగా గ్రహింపనేర్చినవ్యక్తి భయంకర కష్టముల నెదుర్కొని, సాహసపూర్వకముగ వానినన్నింటిఁ బరాభవించి దోషములనుండి సుగుణములను, దుఃఖసముదాయములనుండి సుఖములను, నిరంతరోపద్రవములనుండి చిరశాంతిని సంపాదింప సమర్థుఁ డగుచున్నాఁడు.

మానవుఁడు తనకుఁగల మహాశక్తితోడ నెదుర్కొనినను జయింపఁబడని కార్యముయొక్క కష్టము లీ భూమండలమున లేవనియే చెప్పవచ్చును. తొందర నిష్ప్రయోజన మగుటయే కాక హానికరమును నయియున్నది. త్వరపడుట మూర్ఖునిలక్షణము. త్వరపడువాని కార్యకరణ శక్తియు, వివేకమును ధరా

నాతురతయు మానవహృదయమందుఁ గలిగిన దినము వాని జీవితమందు పరమపవిత్రముగ పుణ్యవాసరముగఁ బరిగణింపఁబడఁ గలదు. ఆపర్వదినముయొక్క మహత్త్వమును మానవుఁడు తత్కాలమున గ్రహింపఁజాలక పోయినను, తదనంతరము స్పష్టముగా గ్రహించి తన్ను ధన్యునిగ భావించుకొనఁ గడంగును. నాటినుండియే మానవుని స్థూలసౌఖ్యముయొక్కయుఁ, బాహ్యవికసప్రవృత్తి యొక్కయు, జడసామాన్యమగు నౌదాసీన్యము యొక్క మూఢజీవితము సమాప్తమయినదనియు మానవుఁడిక ధీరుఁడైనాఁడనియు, అప్రమత్తుఁడయి, యున్నతశీలుఁడయి సత్యాన్వేషణాసక్తుఁడయి సాధకజీవనుఁడు కాఁగలఁడనియుఁ దెలియవచ్చును. నేటినుండి వాఁడు ద్విపాదపశువుగ నుండఁజాలఁడనియు, జీవితమందలి సమస్యలనన్నింటి మానసిక బలాధిక్యముచేఁ బరిష్కరింప నాతఁడుద్యుక్తుఁడయి యున్నాఁడనియుఁ, బాహ్యమందిర ప్రాంగణమున నిరీక్షకులుగ నిలువఁబడియున్న సంశయాత్ములఁ గను జాగరూకతతో నన్వేషించుచున్నాఁడనియు బాహ్యప్రపంచము గ్రహింపవలసి యున్నది.

"ఆపత్కాలమునఁ గర్మభూమినుండి విముఖత్వమును వహింపక, వ్యాకులత నందక సుస్థిర చిత్తుఁడయియుండు వ్యక్తియే సంస్తవపాత్రుఁడగు బుద్ధిమంతుఁడు."

జీవితతత్త్వ రహస్యమును గ్రహింప నాతురతను గలిగియుండు వ్యక్తి స్వార్థ యుక్తమగు విశ్రాంతిని, అసావధాన

పరతంత్రునిగ నజ్ఞానమును సంస్మరించుటకేని సమ్మతింప నొల్లఁడు. అతఁ డింద్రియములయొక్క నిత్యసౌఖ్యముల సంభోగింప నంగీకరింపఁడు. నిత్యము తనహృదయము యొక్క మందప్రకాశ భాసురములును, నపరిభాషితములును నగు ప్రశ్నలకు సముచిత ప్రత్యుత్తరము నొసంగుట నుండి విముఖుఁడయి యుండఁజాలఁడు. అతనిహృదయాంతరాళముయొక్క స్వర్గీయ చేతనశక్తి మేల్కాంచినది. నిద్రింపుచున్న దేవతాపురుషుఁడు నిశాకాలమందలి యనంగతస్వప్న సందర్శనముచే నిద్రావిముక్తుఁడయి నేనిఁక సత్యముయొక్క పరమోజ్జ్వలమగు పవిత్రదినమును వీక్షించుచుసంగాక నిద్రింపఁజాల నని ప్రతిజ్ఞ సేయుచున్నాఁడో యన్నరీతి నాత్మతత్త్వ పరిశీలనాయత్త చిత్తుఁడు సత్యాన్వేషణమున కయి తహతహపడుచుండఁ గలఁడు. అతఁడు తనహృదయాంతరాళము నుండి ప్రతిధ్వనింపుచున్న యాత్మప్రబోధ రవము నాలించి, తదాత్మయొక్క సర్వోన్నతోద్దేశ్యములను, సదాచారకార్యములను నిర్వహించుటయం దేమాత్రము కాలవిలంబ మొనరింప నొప్పఁడు. ఆలస్య మతనికి విషప్రాయముగ నుండుచుండును. కారణ మేమన వాని జాగరితములగు మానసిక శక్తులు కర్తవ్యములయొక్క కఠినబంధనములఁ ద్రెంచివేయుటకయి చీటికి మాటికిఁ బ్రేరేపించుచుండును. అతనికి సత్యమువలనను వివేకముచేతను లభించునట్టి యాత్మశాంతి పాపదోషములచే

ప్రాప్తింపఁ జాలదు. ఏనాఁడు మనుష్యుఁడు గాఢాజ్ఞానజన్య
ములగు దోషములను, సందేహములను, బాధనములను విచ్ఛే
మొనరింప నవిరామమగు కృషి సలుపుచు, నిత్యము సందే
హాంధకారమును దూరమొనరించు నట్టియు, జీవితముయొక్క
మహత్తరములగు ప్రశ్నములకు యోగ్యమగు నుత్తరము నొ
సంగగలట్టియు దివ్యప్రకాశభాసురమగు మార్గము నన్వేషిం
చునో, ఆదినమే యామానవుని యానందము సకలలోక వ్యా
పకము కాఁగలదు.

కఠినమగు పాఠమును గంఠస్థ మొనరింపఁగలుగుటచే
బాలకునిహృదయ మానందతరంగములచేఁ బొంగిపొరలఁ
గలదు. అదిమేచందమునఁ బ్రాపంచిక సంకటములఁ దరిం
చినపిమ్మట మానవునిహృదయము ప్రశాంతమయి సౌఖ్యా
నందముల ననుభవింపఁగలదు. దీర్ఘకాలమునుండి యతిగంభీర
మగు తత్త్వరహస్యమును గుర్తింప నుద్యోగ మొనరించుచున్న
మానవుని సందేహాంధకారమంతయు నొక్కసారిగ దూరమ
గునట్లు రహస్యోద్ఘాటన సాధనమగు బ్రహ్మజ్ఞాన ముదయిం
చుచో వాని దీర్ఘకాలభవతాపతప్తమగు హృదయమున కెట్టి
శాంతి చేకూరఁగలదో వర్ణింప శక్యముగాదు.

మానవుఁడా! నీవు దూరదృష్టిలేనివాఁడవయి నీకర్త
వ్యసాధన మార్గమునఁదోఁచు విఘ్నములను, విపత్తులను, విఘా

తములను, విషాదభయములను నశుభకరములగు పిశాచము లుగ భావింపకుము. ఇట్లు భ్రాంతిపడుటచే సా[illegible]గా సామాన్య వస్తువులగునవియే మహాభయంకర రాక్షసులుగ నీమ్రోల నవతరించి నిన్ను సంహరించివేయఁగలవు. కావున నీవు వివేకవంతుఁడవయి వానిని శుభఫలదాయకములగు సత్పదార్థములుగనే భావింపుము. అట్లొనరించుటచే యథార్థములుగ నవియే దేవతాపురుషులయి నీసన్నిధిని సాక్షాత్కరించి నీయభీష్టములఁ బ్రసాదింపఁగలవు. కర్తవ్యపథమందలి ప్రతిబంధకములను, వ్యాంతరములను నవుల్లంఘనీయములగుటచే వానినుండి పరాఙ్ముఖుఁడగు మానవుఁడు ఘోరవిపద్దశకు గురికాఁగలఁడు. కార్యప్రతిబంధకములు భీరుని గాంచి పలాయనమొనరించును. అవి పిరికిపందను సత్వరము వెంటాడుచుండును. అతఁ డెచ్చోటకేగినను నవి వాని కెదుట వచ్చి సమున్నతభూధరములవలె నిలువఁబడి లోకమువైపునకుఁ బ్రసరించునున్న వానిదృష్టి నడ్డగించివేయును. కావున వీరుఁడా! నీవు విఘ్నములకు — విపత్తులకు భీతిల్లక స్థైర్యముతోడను, ఓరిమితోడను వాని నెదుర్కొనుము. వాని గురుత్వమును, వ్యాప్తిని సరిగాఁ దూయుము. వానిని వేరుపఱచి యొక్కొక్కదానిని బాగుగాఁ బరీక్షింపుము, వానియంగప్రత్యంగములఁబట్టి వానిశక్తియుక్తాలతను గ్రహించి తన్నిర్మూలోపాయము నారయుము. ఈచందమున వానిరహస్యముల నన్నింటి స్పష్టము

గా గ్రహించి వాని నాక్రమించుటచే నీ వవశ్యము విజయుఁడవు కాగలవు. ఈచందమున సామాన్యదృష్టికిని, శక్తికిని సాధ్యపడనట్టి యాత్మవిజయమును సంపాదించి నీ వానందపదవిని బడసి ధన్యుఁడవు కాఁగలవు.

---

# చతుర్థప్రకరణము.



## భారము తగ్గించుకొనుటెట్లు?

మనము బరువు నెత్తుకొనుటనుగూర్చి పెద్దలవలన వినుచున్నారము; గ్రంథములందుఁ బఠించుచున్నారము, కాని భారమును తగ్గించుకొనుటనుగూర్చి విచారించుటయే మఱచి పోయితిమి. మానవుఁడా! నీవు వహించియున్న యీభారము నయిన నిజహృదయమునుండి తొలఁగించుకొని సాటిసహృదయులలో స్వతంత్రహృదయుఁడవయి, ప్రఫుల్లచిత్తుఁడవయి సంచరింప సమర్థుఁడవయి యుండియు వ్యర్థముగా నేల దుర్భరమగు భారమును వహించి [illegible] గాడుచున్నాఁడవు? ఒకవస్తువు నొకస్థానమునుండి మఱియొకస్థానమునకుఁ గొనిపోవ వలసివచ్చినపుడే మనుష్యులా బరువును భుజములనిడుకొని మోయుచున్నారేగాని, యితరసమయముల దానిని స్పృశించుటకేని సమ్మతింపరు. ఏదేని యొకబరువును సదా తనభుజములపై నిడుకొని సంచరించువ్యక్తి స్వధర్మానుష్ఠాననిమిత్తమాత్మసమర్పణ మొనరించినవానిగఁ బ్రాజ్ఞలోకముచే భావింపఁబడఁజాలఁడు.

"పతంగము రక్తవర్ణమును గలిగియుండు నగ్నిగోళమును గాంచి భ్రాంతిచే దానిలోఁబడి భస్మమగుచున్నది. మతిహీనులు వ్యర్థముగా లేనిపోనిపనులను గల్పించుకొని, ఆయాసపడుచుందురు. మూఢునియొక్కయుఁ, బతంగముయొక్కయు ననావశ్యకములగు నీచర్యలు భారమును హెచ్చించి జీవితనౌకను భవసాగరనిమగ్నమొనరించి వేయుచున్నవి. నౌకయందు బరువు మిక్కుటమగుచో మున్గిపోవుట సత్యము. మనుష్యజీవితము సయితమిట్టిదేయని గ్రహింపఁదగును."

మానవుఁడా, నీ వేల మూర్ఖుఁడవయి నిరర్థకమగు భారమును మార్దవమగు మానసముపై వైచి ఆత్మశోకము యొక్కయు, నాత్మదయయొక్కయు వ్యాకులతచే నాభారమును మఱింత గురుతరముగా భావించుచున్నాఁడవు? నిరుపయోగమగు నాభారమును తగ్గించుకొని, దుఃఖమును విసర్జించి ప్రముదితస్వాంతుఁడవయి నీ వేల విశ్వానందమును వృద్ధిగావింపకున్నాఁడవు? దుఃఖదాయకమగు నేదేనియొక భారమును విరామము లేకుండ భుజములపై వహించి తిరుగుట కెట్టి న్యాయ యుక్తమగు ప్రమాణమును, సముచితమగు కారణమును లేదు. ఒకస్థూలపదార్థము నొకస్థానమునుండి మఱొక్క స్థానమునకుఁ గొనిపోవు నిమిత్తము మోయవలసి వచ్చినపు డది దుఃఖదాయకముగ భావింపఁబడనేరదు. అదియేచంద

మున సూక్ష్మప్రపంచమందు సయితము భావవ్యాధులయొక్క భారమును గేవల మేదేని శుభఫలప్రాప్తి నిమిత్తమే వహింప వలయును. మనోభీష్టము సిద్ధించినంతనే తద్భావ చింతనము యొక్క భారమును మానసముపైనుండి సంపూర్ణముగాఁ దొలఁగించివేయుట శ్రేయస్కరము. ఇవ్విధమగు భారమును వహించుచున్నను మానవునకెట్టిఖేదము నొదవఁజాలదు. అవశ్యము హర్షమే కలుగుచుండఁగలదు.

తాపసోత్తములు సమాధిలోపములచేఁ దమదేహములకొసంగుచుండు కష్టమనావశ్యకమును, వ్యర్థమును నయియున్నదని మేము వచించుచుందుము. కాని తమమానసములకు నపారమును, ననావశ్యకమును, వ్యర్థమునునగు కష్టమును గలిగించునట్టి సహస్ర సహస్ర సంఖ్యాకులగు మనుష్యుల యవివేకమునుగూర్చి యింతవఱకు నుడువకలోకమున కెంతయు ద్రోహ మొనరించితిమి. వ్యర్థమగు శరీరకష్టముకంటె మానసిక ప్రయాసము శతగుణాధికముగ హానికరమయినది.

అసౌఖ్యమును, క్లేశమును గలిగించునట్టి భార మెట్టిది ? ఇట్టి భారము వాస్తవముగ విచారించిన దైవసృష్టియందు లేదనియే నుడువవచ్చును. నీ వేదేని యొకవాక్యమును సంభాషింపవలసి వచ్చినపుడు ప్రసన్నచిత్తుఁడవయి భాషింపుము, విలపించుచు ననాథునివలె, దీనుని పగిది మాట్లాడకుము. అవ

శ్యకతను స్వీయమిత్రునిగను, నాయకునిగను భావించి సన్మానించుట బుద్ధిమంతుని లక్షణము, దానినే శత్రువుగ భావించి వక్రభ్రూకుటితోఁ దిరస్కరించి స్వాధీన మొనర్చుకొన యత్నించుట పామరలక్షణము.

మన కీ భూమండలమునం దడుగడుగునకు నావశ్యకములగు కార్యము లాచరింపవలసి యుండుచున్నది. మన మవ్వాని యాస్తిక్యముచే యంగీకరింపక, వాని నాచరింపనపుడే యవి మనకు భారముగఁ దోఁచుచున్నవి. ఆవశ్యకమగు కార్యమును ఖేదభావముతో నాచరింపుచుఁ దోడ్తోడ ననావశ్యకమగు నానందోపలబ్ధికయి యన్వేషణ మొనరించు వ్యక్తి దురంత దుఃఖవారిధి నిమగ్నుఁడయి నిరంతరము వ్యాకులజీవితమును గడుపుచుండఁ గలఁడు.

ఓ యంతఃకరణమా! సత్కార్యాచరణమునకయి మే
ల్కొనుము.

నీవు యౌన్నత్యము నధిరోహింప నీపక్షముల విప్పుము.

జీవిత గీతముల నూతన పద్ధతిలో గానమొనరింపుము.

సత్యము యొక్కయుఁ, గల్యాణము యొక్కయు రాగ
ములఁ బాడుము

అనత్య విజయగీతమును గానముసేయుము.

నీవు నీగీతమును మహత్తరమును, మృదుమధురమును గావించుకొనుము.

నీవు నీసందేహములను, చింతలను, దుఃఖములను బ్రహ్మానంద సాధనములుగ భావించుకొనుము.

నీమార్గముయొక్క కంటకముల నానందమకుటమును రచించుకొని దానిని కీర్తించుము.

ఆచరణయోగ్యములగు పవిత్రకర్తవ్యములను సానంద హృదయముతోడను, నిస్స్వార్థబుద్ధితోడను, నఖండధ్యానపూర్వకముగను సాధించుటావశ్యకము. మనము మహత్తరమగు కర్తవ్యబాధ్యతను శిరమున వహించి వర్తింపవలసినవారల మయియున్నను దాని నొకదుఃఖదాయకమును, ఖేదోత్పాదకమును నగు భారముగ భావింపఁజనదు,

మనుష్యుఁ డొకకార్యమునుగాని, కర్తవ్యమునుగాని యాచరింపనెంచి పరిగ్రహించి, 'అబ్బా యీకార్యమెంత కఠినమయినది? భారముగలది?' యని భావించినచో నిక్కముగా నతని కాకార్యము భారముగనే గోచరింపఁగలదు. ఒక కార్యమును నిర్వహింపఁబూని దానిని సంపూర్ణముగ సాధింప సంకల్పించిన బుద్ధిమంతుఁడు తత్కార్యమును సౌఖ్యదాయకమగు వస్తువుగనే భావింపవలయునుగాని, విషాదకరమగు పదార్థముగఁ దలంపరాదు.

యథార్థమాలోచించినచో విశ్వమందలి యే కార్యమును భారదాయకము కాదనియు, మానవుని స్వార్థముచేఁ బ్రతి కార్యమందు భారమున్నట్లు కానవచ్చుచున్న దనియు బుద్ధిమంతులు గ్రహింపఁగలరు. మానవుఁడా! నిన్నేది బంధించు సంకటమని భావించుచున్నాఁడవో, అదియే నీముక్తిమందిరము యొక్క ప్రథమద్వారమని విశ్వసింపుము. దేనిని నీవు భయంకర శాపముగ భావించుచున్నాఁడవో, తత్కార్యమే నీకువాస్తవికానందసంధాయకము కాఁగలదు. యథార్థమగు నానందము ప్రత్యేకమగు నొకదూర దేశమందు లభించునని భ్రాంతిపడవలదు. నీచేఁ గావింపఁబడిన కార్యములు విశుద్ధములగు దర్పణముల వంటివి. ఆయద్దములందు నీప్రతిబింబమే స్పష్టముగ గోచరింపుచుండఁగలదు. నీ కార్యములందుఁ గానవచ్చు ప్రకాశమాంద్యము, న్యూనత కార్యాచరణ సందర్భమున నీయం దుండియున్న మానసికస్థితియొక్క ప్రతిబింబములు. ఏవస్తువునందయిన నీవు నీ హృదయమును సత్యమును, స్వార్థశూన్యమునునగు భావముతో సంలగ్నమొనరించినచో నావస్తువు తత్క్షణము రూపాంతరమును జెంది దివ్యమగుశక్తిని, భవ్యమగు నానందమును బ్రసాదించునట్టి సాధనముగ నేర్పడఁగలదు. కుటిల భృకుటితోఁ గ్రోధాయమాన నేత్రములతో నీముఖబింబమును దర్పణమునందుఁ జూచుకొనుచో నొక భయంకరమును, నేహ్యమును నగు వికటదృశ్యము గోచరింపఁగలదు, నీ వేరీతి ముఖలావణ్య

మును తెలిసికొంటివో, యట్టిదృశ్యమే దృష్టిపథమునఁ బడఁ గలదు. వదనమండలమును సుందరముగఁ జేసికొని దర్పణ మును వీక్షింతువేని మనోహరమగు నాకృతి దృగ్గోచరమ గును.

నీ వేదేని యొకకార్యము నాచరించుట యుచితమని యు, నావశ్యకమనియు భావింతువేని, తత్సంపాదనమున విలం బమొనరింపకుము. తత్కార్యసంపాదనమునుండి విముఖుఁడ వగుదువేని నిశ్చయముగా నాకార్యము నీకు మిక్కుటమగు భారముగఁ దోఁచఁగలదు. స్వార్థాంధమగు నభిలాష వస్తువును మానవునిదృష్టియందు నీచమొనరించుచున్నది. అనావశ్యక మును, ననుచితమును నగు కార్యము నీప్సితసౌఖ్యము నిమి త్తమును, నింద్రియభోగార్థమును నిర్వహింపఁబూనుట పరమ మూర్ఖ్యము. ఇట్టియుద్యోగముచేఁ దీరని హాని కలుగఁగలదు.

నిన్ను సత్యపథమున నడిపించు స్వర్గదూతనుండి వేరుప అచునట్టియు, సత్కర్తవ్యమునుండి విముఖు నొనరించునట్టియు, నింద్రియాదులచే క్షణికాహ్లాదమును, సౌఖ్యమును గూర్చున ట్టియు, మిథ్యాప్రశంసను నీకుఁ గలిగించునట్టియు వాంఛయే నీబద్ధవైరి. నీవు సర్వదా యప్రమత్తుఁడవయియుండి నీతివిరు ద్ధములగు వాంఛలఁ దగులొక్కనక దూషితమార్గములనుండి విముఖుఁడవయి సుబుద్ధిని సంపాదింపుచుండుటయం దేమఱ యుండవలదు.

ప్రకృతియొక్క పరమదయాళుత్వముచే దానిపరిణామములన్నియు సత్యావలంబితములయి సర్వకాల సర్వావస్థలయందును సకలజీవరాసుల బుద్ధియుతకార్యాచరణము వైపునకుఁ బ్రోత్సహింపుచుండును. మౌఢ్యముచేతను, స్వార్థమువలనను తీవ్రమగు క్లేశ మావిర్భవించుట సహజము, కారణ మేమనఁ గ్లేశ మౌదాసీన్యమునకు శత్రువును, సమృద్ధికి ద్వారపాలకుఁడును నయియున్నది. విపత్పరంపరలును, విషాదభయములును మిక్కుటముగా మనుష్యు నాక్రమించినపుడే యతఁ డుదాసీన భావమును బరిత్యజించి కష్టస్థితినుండి విమోచనము నంద నుద్యోగింప నారంభించు చున్నాఁడు. ఇందువలననే మానవజీవితాంతరాళమున బుద్ధిసంచారము కలుగుచున్నది.

బాధయన నేమి? ఖేదమన నెట్టిది? భారమన నేమి? ఉద్వేగమే బాధ. అజ్ఞానమే దుఃఖము. స్వార్థమే భారము.

స్వార్థదేవతారాధనము మానవుని భావములును, కర్తవ్యములును సమాప్తములయిన పిమ్మట వానిని విశేషముగ దుఃఖితు నొనరించును. స్వార్థపూజ తొలుత సుఖకరముగ నున్నట్లుండినను తుదకు నరకబాధ నొసంగఁగలదు.

మానవుఁడా! ఉద్వేగమును, నజ్ఞానమును, స్వార్థమును నీచిత్తసీమనుండియు, వర్తనమునుండియు దూరమొనరించి వేయుము. అట్లొనరింతువేని నీజీవితము క్లేశములనుండి

స్వయముగ విముక్తినిఁ బడయఁగలదు. ఆంతరిక స్వార్థమును హృదయక్షేత్రమునుండి పెకలించివైచి తత్ప్రదేశమున నిష్కపటమగు విశుద్ధ విశ్వసోదరప్రేమను సుస్థాపిత మొనరించుటచే నీజీవితభారము హాయిగఁ బరిణమింపఁగలదు. హృదయమునందు నిర్మలమగు ప్రేమను గలిగియుండి కార్యము నాచరింపుచుండుటచే నది సుకరముగను, ప్రమోదకరముగను గానరాఁగలదు.

మానస మజ్ఞానముచె తనకయి దుఃఖము నావిర్భవింపఁ జేసికొనుచున్నది. మానసమే తన్నుఁ దాను దండించుకొనుచున్నది. ఈసృష్టియందు జీవునికిని వ్యర్థముగా నెత్తిపై మిక్కుటమగు బరువు నిడికొని తిరుగుచుండవలసినదిగాఁ గరుణాసింధువగు జగన్నియంత దండనము విధించియుండలేదు. నేఁడు మానవప్రపంచమునఁ గాననగుచున్న భారమును, తత్పరిణామమగు వ్యాకులతయుఁ గేవల మానవేచ్ఛాసంభూతములే. మస్తిష్కమునకు యథార్థమగు శాసనకర్త బుద్ధి. క్రోధోద్వేగములు బుద్ధిరాజుయొక్క సింహాసనము నాక్రమించినంతనే వాని మానసికసామ్రాజ్యమందు రాష్ట్రవిప్లవము కలుగ నారంభింపుచున్నది. ప్రాపంచికవిలాసవినోదములును, నింద్యభౌతికవాంఛలును ముందునడచుచుండ వానిపిఱుందనే భారమును, విషాదభయములును బ్రయాణము సాగింపుచున్నవి.

మానవుఁడా! నీవు కోరినదాని నిపుడు గ్రహించుము. నీవు క్రోధాది భయంకరోద్వేగములచే బంధీకృతుఁడవయియుండి నిన్ను నీ వొక నిస్సహాయునిగను, ననాథునిగను భావించుచున్నను కానిలేవు. నీ విప్పటికిని బంధవిమోచనము నంద యోగ్యుఁడవే. ఈ నీయాధునిక దుర్దశ క్రమక్రమముగ సంఘటితమయియున్నది.

నెమ్మదినెమ్మదిగా నీవు మంచిస్థితికిఁ బ్రాపింపనేర్చి బుద్ధిని సుస్థాపితమొనర్చి, క్రోధమును సింహాసనమునుండి తలక్రిందుగఁ బడఁద్రోయవచ్చును భోగవిలాసముల గాఢాలింగన మొనరించుకొనుటకుఁబూర్వమే మనుష్యుఁడు కీడునుండి తప్పించుకొనఁ గలుగుచున్నాఁడు. ఒకతూరి భోగవిలాసములయం దనురక్తుఁడయి వానిదాస్యమునకుఁ గడంగినవ్యక్తి వానిదుష్పరిణామము ననుభవించి, గ్రహించినపిదపనే వానినుండి విమోచనము నందఁగలుగుచున్నాఁడు. కర్తవ్యపరాయణత్వమున కియ్యకొనక పూర్వమే కీడునుండి తప్పించుకొనవలయు నను సంకల్పము నిశ్చితమగుచున్నది. కారణమేమనఁ గర్తవ్యపరాయణతను ధరించుటతోడనే స్వార్థసంబంధములగు సమస్తభావములును, రోదనములును, పదరుబోతుతనమును హృదయమునుండి దూరమయిపోవుచున్నవి. కర్తవ్యపరాయణత్వమును, బాధ్యతను వివేకపూర్వకముగను,

విశుద్ధప్రేమపురస్సరంబుగను స్వీకరించుటచే వానిభారము బొత్తిగాఁ దగ్గిపోవుచున్నది.

మనుష్యునిభారము కుత్సితభావములవలనను, నింద్య సంకల్పములవలనను, స్వార్థపూర్ణములగు లాలసలచేతను ద్విగుణముగ గురుతరమును, నసహనీయమును నగుచున్నది. సంకటము నెదుర్కొనుటచేతనే మానవునిశక్తి వర్ధిల్లుచుండును, గావుననే స్నేహమయి యగు ప్రకృతి మానవుని యవసరములలో విపత్తు నొకదానిగా సృజించియున్నది. మానవుని యందు దుర్బలత్వము కాపురము సేయుచుండు కారణముననే వానికిఁ బ్రతికార్యమును భారమయముగను, గష్టతరముగను నున్నట్లు బోధయగుచుండును. మానవుని దైహిక మానసికదుర్బలత్వము నశింపనిదే వాని యీదుస్థితి దూరము కానేరదు. మానవుఁడా! కార్యములు కఠినములుగను, భారములుగను గాననగునట్టి దుస్థితి నీకుఁ దటస్థించినంత మాత్రమున విచారపరీతచిత్తుఁడవు కావలదు, నిరంతరము హర్షింపుచునే యుండుము. అట్టుంటివేని నీవు శీఘ్రకాలమందే భారమునుండి విముక్తినందుటకును, స్వశక్తిని, స్వబుద్ధిని వికసింపఁ జేసికొనుటకును దగిన మంచితరుణము లభింపఁగలదు. బుద్ధిబలముచే సాధింపఁబడని మహాకార్య మీశ్వరసృష్టి యందు లేదు. ప్రేమతత్త్వమును బరిశ్రాంతమొనరింప సమర్థ

మఱుశక్తియు నీభూమండలమున గానరాదు. కష్టములను గూర్చి చింతించుట విడిచివేయుము. నీ సమీపమందుఁగల భద్రమానవుల జీవితములఁగూర్చి నిత్యము విచారించుచుండుము.

ఒక విశాలమగు కుటుంబముగల స్త్రీ తన 15రూప్యముల మాసికవేతనముచే మిక్కిలి కష్టముతో నా పరివారమునంతయు నెటులో పోషించుచున్నది. ఆయమ్మ తనయింటి మలిన వస్త్రములనన్నింటి దానే స్వయముగ నుతుకుకొనుచున్నది. ఆమెయే వ్యాధిగ్రస్తులగు నిరుగుపొరుగువారి సేవాశుశ్రూషయు సలుపుచున్నది. ఇట్లుండియు నామె ఋణమను పెను భూతమునుండియు, నిరాశయను భయంకరపిశాచమునుండియు సురక్షితముగనే యుండుచున్నయది. ఆతల్లి సూర్యోదయ మాదిగ సూర్యాస్తమయము దనుక ప్రఫుల్లచిత్తయయి తన సమస్తకార్యముల నిర్వహించుకొనుచుఁ బరులకు మొఱవెట్టుకొనుటను నీచముగఁ దలంచుచుండును. ఆమె స్వార్థశూన్యయగుటచే సదా భయవిషాదములనుండి దూరముగనే యుండుచున్నయది. నేను పరులసౌఖ్యమునకుఁ గారణభూతమయి యుంటినిగదా యని తలపోయుచు నామె నిత్యము హర్షించుచుండును. ఆమె గృహకృత్యములనుండి స్వల్పమగు నవకాశమును బడసినను నిరుద్యోగముగఁ గూర్చుండ నొల్లదు.

లోకమందలి మూఢులవలె సెలవులయందు వ్యర్థముగాఁ గాలమును గడపుటకును, నాటకములను, వినోదములను, వింతలను జూచుటకును సమ్మతించుట కామె సిద్ధపడదు. గృహకృత్యములనుండియు, వ్యవహారములనుండియు నేమాత్ర మవకాశము లభించినను జ్ఞానవతి యగు నామె విలాసవతులతో స్నేహ మొనరించుటకును, క్రొత్తక్రొత్త దుస్తులను వెలకుఁ దీసికొని సోల్లాసముగ ధరించుటకును, విద్యావివేకములులేని స్త్రీలు లోకాభిరామాయణము పేరిట నిత్యము సలుపుచుండు ప్రసంగములఁ బాల్గొనుటకును, సంగీతసభల కేగుటకును మానసమందయిన సంగీతకాపనొల్లదు. ఆవిదుషీమణి యిట్టి వ్యర్థవినోదములచే గృహస్థజీవితమునకు వాటిల్లు కష్టనష్టములను, గౌరవహానిని బాగుగా గుర్తించియున్నది. ఆయమ్మ నిజపరివారముయొక్క సామాన్యకార్యమునయిన నాచరింపవలసి వచ్చినపుడు మిక్కిలి శ్రద్ధను, దృఢసంకల్పమును, తదేకధ్యానమును గలిగియుండుచుండును. ఆమె నిర్లక్ష్యమను శబ్దమును గాలసర్పముకంటెఁ గడు భయంకరమయినదానిగఁ జూచుచుండును. ఇన్ని యొనరింపుచు నామె స్వప్నమందును స్వార్థమును దరిఁజేరనీయ నొల్లదు. కావుననే నిరంతరము బ్రహ్మానందమున వెలయుచుండును. ఆనందమును, స్వార్థత్యాగమును జంద్రచంద్రికలవలె నవిచ్ఛిన్న బాంధవ్యమును

గలిగియున్నవి. సుస్నేహము ముందు మహోన్నతకర్తవ్యభారమేని తల వ్రాల్చుచుండుటయం దాశ్చర్యములేదు.

చదువరీ! భారమును తగ్గించుకొనుప్రక్రియయం దారితేరిన విదుషీమణిచారిత్రము నాలకించితివి. తన యవసరములన్నింటిఁ గడుపుకొనుట కావశ్యకమగు ధనముకంటె విపులైశ్వర్యమును గలిగియున్న మఱియొక వనితాచారిత్రము నాకర్ణింపుము. ఈమె విశేషమగు సంపదను గలిగియుండియు నిరంతరము విలాసపూర్వకముగ జీవయాత్రను సాగింపుచుండును, కాని సాంఘికములగు నవసరముల నిమిత్తమును, దేశహిత సంబంధములగు కర్తవ్యముల నిర్వహించుటకును, నీమెయొక్క కొంతసమయమును, ద్రవ్యమును, విలాసములును వ్యయమగుచుండును. లోకోపకార పరతంత్రములగు నిట్టి కార్యముల భక్తివిశ్వాసములతోడను, విశుద్ధప్రేమానురాగములతోడను నిర్వహింపవలసియుండ నీయమ్మ సదా వీనినుండి తప్పించుకొనుటకు యత్నింపుచు మనోభీష్టము సిద్ధింపనిహేతువుచే నిరంతరము డెందమునఁ బెద్దగఁ గుందుచుండును. ఈరీతి వ్యాకులతచే నీస్త్రీ సదా తనసౌఖ్యానందముల నశింపఁజేసికొనుచుఁ దన జీవితమును, గర్తవ్యములను గఠినతమములుగఁ జేసికొనుచుండును. హర్షమును, నిస్స్వార్థమును సమీపబాంధవ్యమును గలిగియున్నచందమున నె స్వార్థానంతోషములను బరస్పరమగు

నవినాభావసంబంధమును గలిగియున్నవి. ఆత్మస్నేహము కర్తవ్యము నానందమయముగఁ జేసివేయుచుండును. గృహిణుల సీ రెండు దృష్టాంతములను బోలునట్టి యుదాహరణము లెన్నియో జీవితకాలమందు లభింపఁగలవు.

పాఠకుఁడా! నేను నుడివియున్న స్త్రీలచారిత్రములందెయ్యది కష్టగ్రస్తమో నుడువఁగలవా? వారి యుభయుల యొక్క స్థితియు విపద్గ్రస్తమును, దుఃఖమయమును గాదనియే నుడువవచ్చును. స్వార్థమును, ప్రేమయు వారి జీవితకర్తవ్యములఁ బ్రవేశించుటనుబట్టియే వా రానందమయులుగను, దుఃఖమయులుగను నుండుచుండిరి. వారి సుఖదుఃఖములకు మూలకారణము వారి మనోభావమే కాని వ్యవస్థ యొంతమాత్రమును గానేరదు. ఎవఁడేని యొకమనుష్యుఁడు ధర్మశాస్త్రమునుగాని, మఱి యేదేని యొక తాంత్రికవిద్యనుగాని నేర్వఁగడంగుచు, “నామీఁద భార్యను, కుటుంబమును బోషింపవలసిన భారమే లేకున్న నే నొక మహత్తరకార్యమును నిర్వహించియుండెడివాఁడను. నా కిపుడు కల జ్ఞానమే తొలుత యుండియున్నచో వివాహమే చేసికొనియుండువాఁడను గాను.” అని వచింపుచుండును. అట్టిమనుష్యుఁడు నేటిపర్యంతము సుబుద్ధియొక్క బహు విశాలమగు ఋజుమార్గమును జూచియే యుండలేదనియు, మహత్తరమగు కార్యము నాచరింపఁదగు

యోగ్యత వానియం దేమాత్రమును లేదనియు మనము గ్ర
హింప వలసియున్నది. ఎవఁడేని యొకమనుష్యుని హృదయ
మందు మానవజాతియెడ విశేషమగు ప్రేమ యున్నచో,
వాఁడు మానవులనిమిత్తము కల్యాణదాయకమగు నొకమహా
కార్యము నాచరింప నభిలషించినచోఁ దనస్థితి యెట్లున్నను
నిస్సందేహచిత్తుఁడయి, తత్క్షణమే తన హృదయాంతరాళమునఁ
గల యపారమగు ప్రేమను గార్యరూపమునఁ బ్రకటించియే
తీరును. ఆప్రేమభావముచే వాని వాసస్థానమంతయు నిండి
నిబిడీకృతమయి యుండఁగలదు. వానిస్వార్థశూన్య మగు
ప్రేమయొక్క పవిత్రశుద్ధసుస్నిగ్ధ సౌందర్యకాంతియు, మాధుర్య
మును వారెట కరిగిన నట కేగుచు నచ్చటివారి హృదయము
లకు సౌఖ్యానందములఁ బ్రసాదింపుచుఁ బ్రతివస్తువును సం
స్కరింపఁగలవు. బాహ్యమునకు వెల్లడింపఁబడుచు గృహ
మందును, హృదయమందును లేనట్టి ప్రేమ కేవల మహంకార
మనఁ బడుచున్నది. కపటప్రేమనే బుద్ధిమంతులు గర్వ మను
చున్నారు. అనేకులగు మతప్రచారకుల గృహము లానంద
శూన్యములయి, బాల బాలికలకు సముచిత పోషణ
సంస్కరణముల నొసఁగలేనట్టి హీనస్థితియం దుండుచున్నవి.
ఆ ధర్మోపదేశకులు పరులకు గృహముల సౌఖ్యానందమయ
ములుగ నుంచుకొను విధానమును గూర్చి యుపదేశింపుచుం

దురు. కాని తమగృహముల హీనస్థితిని గుఱించి విచారింప నొల్లరు. కావున వారు ప్రపంచమును మోసగింపుచుఁ దుద కాత్మవంచకత్వమునకు సయిత మొడిగట్టుచున్నారు. వారు గృహములను విడిచి పర్యటనము సలుపు శ్రమను సహింపఁ గలిగినంత మాత్రమున ధర్మోపదేశమున కర్హత తమకుఁ గలిగినదని భావించుచున్నారు. ఆత్మద్రోహులగు నిట్టి మనుష్యులు స్వయంకృతాపరాధ కల్పితములగు కష్టములనే పవిత్రమగు ధార్మికభావముగ భావించి, ఆబరువును నెత్తిపై నిడుకొని ప్రపంచ మందంతట సంచరించుచున్నారు. మహాపురుషుఁడే మహాకార్యము నొనరింప సమర్థుఁడు. అతఁ డా కార్యము యొక్క తత్త్వమును సాంగముగ గ్రహించి, తద్రహస్యముల స్పష్టముగ వెల్లడింపఁగలిగి నపుడు తానే దేశమందున్నను, నెట్టి స్థితియందును దనసమున్నత కర్తవ్యము నవశ్యముగా సాధింపఁ గలుగుచున్నాఁడు.

మానవుఁడా! నీవు మానవజాతీయ కల్యాణార్థమును లోకోపకారము నిమిత్తమును విచారాయత్తచిత్తుఁడ వగుచుంటివేమి? తొలుత నీగృహమం దుపకారతత్త్వమును సార్థక మొనరింపుము. నీవు నీయొక్కయు, నీభార్యయొక్కయు, బాలబాలికలయొక్కయుఁ, దదితరకుటుంబ సభ్యులయొక్కయు, నిరుగు పొరుగువారియొక్కయు సాహాయ్య మొనరింపుము.

ప్రోత్సహింపఁబడకుము. ప్రోత్సహింపకుము. నీవు వాస్తవికమగు భక్తి పరిపూర్ణమగు హృదయముతో నీ సామీప్యమున నివసించువారియొక్కయు, నీకంటెఁ బిన్నలయొక్కయు మేలు గావింపనంతపర్యంతము దూరమున నివసించువారియొక్కయు, గురుజనులయొక్కయు హితమును గావింపఁ జాలవు. "Charity begins at home" దానము గృహము నుండి ప్రారంభమగు ననియెడి యీ యాంగ్లోక్తి పైసంగ్రహమున సార్థకమగుచున్నది.

ఒకానొక మనుష్యుఁడు తనజీవితముయొక్క విశేషకాలమును భోగవిలాసములందును, నింద్యమగు విషయసేవనమందును వినియోగించి యుండినచోఁ బ్రకృతిసిద్ధాంతము ననుసరించి కల్యాణమునిమిత్త మతఁడు విశేషమగుభారముచేతను, కష్టనష్టముల వలనను బాధింపఁ బడవలసియుండును. కారణమేమన విషయలోలుఁడు, ఇంద్రియదాసుఁడు తా నాచరించి యుండిన సమస్త దుష్కృతములయొక్క వేదనలచే వ్యథనొంది, వేసారి పాపము భయంకరదుఃఖదాయకమయినదని గ్రహించినగాని విషయవికారపరతంత్రమగు దుష్టవాతావరణమును విసర్జించి, పరిష్కృత జీవితోత్తమమార్గము ననుసరించుటకు సంసిద్ధుఁడు కాఁజాలఁడు. వాఁడు స్వయంకృతాపరాధ సముద్భవములగు కష్టముల నీశ్వరదత్తము లనియుఁ,

గర్హదండనమనియుఁ, బుణ్యపదార్థమనియుఁ, బరజనకల్పితమనియు భావింపుచున్నంత పర్యంతము తనమాధ్యమును విస్తరింపఁ జేసికొనుచు, భారమును వృద్ధిగావించుకొనుచుఁ, దన కష్టములను, దుఃఖములను బెంపొందింపఁ జేసికొనుచునే యుండఁగలఁడు. వాఁడు తా ననుభవింపుచున్న దుఃఖము స్వయంకృతాపరాధఫలిత మని స్పష్టముగా గ్రహించునందాక యుద్ధరింపఁ బడఁజాలఁడు. దుఃఖోత్పత్తికి వాస్తవికమగు కారణము స్వయంకల్పితపాప మని గుర్తించు మనుజుఁ డాత్మదోషముల యెడ దయార్ద్రహృదయుఁడయి, నమ్రస్వభావియయి వర్తింపక స్వయంకృత దుష్టకార్యమునకుఁ దనకుఁ దానే దండనము విధించుకొనుచుఁ బాపవిమోచనోపాయము నన్వేషింపుచుండఁ గలఁడు. ఆత్మదోషములఁ బరిశోధించుకొన్న మనుష్యుఁడు జ్ఞాననేత్రమును విప్పినంతనే వాని ప్రతిభావమును, గార్యమును దజ్జీవితమందిరనిర్మాణమున కావశ్యకములగు వివిధోపకరణములయి వాని యాధ్యాత్మికశక్తిని వర్ధిలఁ జేయఁగలవు. తన్మూలమున నతఁడు పూర్వకృతములగు పాపములకు నిష్కృతిని బడసి భవిష్యజ్జీవిత కర్తవ్యములఁ గడుసావధానతతో నిర్వహింప సన్నాహము లొనరించుకొను చుండఁగలఁడు.

దుఃఖదాయకమగు భారమును మనసు మనయందు విశుద్ధప్రేమ వివేకముల న్యూనత యున్నంతవఱకే ప్రశాంత హృదయములతో విధిగ ననుభవింప వలసియుండును.

ఆనందప్రాసాదము తీవ్రతర క్లేశములయొక్కయు, గాఢాభిమానములయొక్కయు బాహ్యప్రాకారములకు లోపల వెలయుచున్నది. ఆ యానందమందిరమునఁ బ్రవేశింప నభిలషించు యాత్రికుఁ డీయభిమాన క్లేశప్రాకారముల నతిక్రమించి చనవలసియుండును. ఆ బాహ్య ప్రాకారద్వారములందు యాత్రికుఁ డొకింతకాలము వేచియుండవలసి వచ్చును. ఆ ప్రయాణికుఁ డా ప్రాకారములనే యానందమందిరముగ భ్రమించునందాక యచటనే నిలిచిపోవలసియుండును. ఆ క్షణికమగు భ్రాంతి తొలంగినంతనే వాఁడు నిరాటంకముగ నానందనికేతనము నుద్దేశించి యొక్కప్రాకారమును దాటి యరుగ వచ్చును. మనుష్యుఁ డెంతపర్యంతము తన్ను దాను మక్కటముగఁ బ్రేమించుకొనుచు దయఁజూచుచునుండునో, ఎంతదాక గతజన్మకర్మయొక్క పవిత్రఫలముగ దుఃఖమును భావించుచుండునో, అంతవఱకు దుఃఖమునుండి విమోచనము నందలేఁడు. అతఁ డాత్మలాలనమును విడిచిపుచ్చి, దానియెడ నిరసనభావమును గలిగియుండి దుఃఖములు కేవలమార్గములయి యున్నదియు, మనోరథములు, ఫలితములునయి యున్నదియు గ్రహించినంతఁ దనమానసమును, భావములను బరిశుద్ధమొనరించుకొని యాబాహ్యప్రాకారద్వారములలోనుండి నిరాఘాటముగా శాంతినికేతనమును బ్రవేశింపఁ గలుగుచున్నాఁడు.

క్లేశ మపూర్ణత్వమునుండి కలుగుచున్నదా లేక పూర్ణత్వము నుండియా? ఇయ్యది యపరిపక్వతయొక్క చిహ్నమా లేక పరిపక్వతయొక్క లక్షణమా? యని దీర్ఘముగా విచారించుటచే దుఃఖవిమోచనోపాయము గోచరింపగలదు. దుఃఖ మపూర్ణత్వలక్షణము; అపరిపక్వతయొక్క ఫలితము. దుఃఖోదయమునకు ముఖ్యకారణ మన్వేషింపఁబడుటయే తదభావముగా దూరమొనరింపఁబడఁగలదు కావున మనము విశ్రాంతినిమిత్తము తీవ్రతరక్లేశములలోనుండియు, శాంతినిమిత్తము నిర్జనతయందుండియు నరుగవలసియున్నదనుట సత్యము. దుఃఖితుఁడగు వ్యక్తి, తాను కల్యాణార్థ.. దుఃఖపరంపరలలోనుండి ప్రయాణము సాగింపవలసియుండు. కాని నిలిచియుండరాదను హెచ్చరికను ముఖ్యముగా స్మృతియందిడికొనవలయును. క్లేశము ద్వారము. అది వాసస్థానము కాదు. నిర్జనత మార్గమే కాని నిర్దిష్టప్రదేశము కాదు. ఈవిధముగఁ దనయాత్రను సమాప్తము గావించు వ్యక్తి దుఃఖశూన్యమును, దివ్యానందమయమును నగు విశ్రాంతిని బడయఁగలుగుచున్నాఁడు.

భారము కొంచెముకొంచెముగా సంచితమయి వర్ధిల్లుచున్నది. ఇద్దాని గురుత్వము మానవునకు గోచరింపరానంతటి సూక్ష్మముగ నెమ్మదినెమ్మదిగా వృద్ధినందుచుండును. భావశూన్యమగు నుద్వేగము, ప్రగాఢమగు నాత్మస్నేహము, అంధవాస

నోత్పత్తి, చీటికిమాటికి నిష్టభోగములచేఁ దుష్టినందుట, అపవిత్రభావప్రాదుర్భావము, కటుభాషణము, మౌఢ్యము మొదలగు నగణ్యములగు దోషములయొక్క పాపసంచయభారము దుఃఖదాయకమును, దుర్భరమును నగుచుండును. ప్రారంభమునం దొకింతకాలము దనుక భారము కష్టము నొసంగఁజాలదు, కాని యది యనుదినము వృద్ధి నందుచుండును. ఒకానొకదినమున స్వార్థముయొక్క దుష్ఫలము లవశ్యభోక్తవ్యములయి జీవితమును నష్టపఱచి హృదయమునకుఁ దీరని దుఃఖము నొదవింపుచుఁ దద్భారము నసహనీయమైనరించివేయును. ఇట్టితరుణము సమీపించినపుడు దుఃఖితుఁడు తనస్థితిని గుర్తించి తనభారమును దూరమొనరించుకొనుటకు యథోచితమగు నుపాయము నన్వేషింపవలయును. వాని కట్టి యుపాయము లభించినచో సముచితరీతి జీవితమును గడుపుట కావశ్యకములగు వివేకమును, బారిశుద్ధ్యమును, బ్రేమయు నంప్రాప్తింపఁ గలవు.

తనపూర్వచారిత్రమును బరివర్తన మొనరించుకొనుటచే మానవునిజీవితభారమంతయు నశించిపోవ వాని సమయము శాంతియుతముగఁ గడవఁగలదు. వాఁడు సానందచిత్తుఁడయితనకర్తవ్యముల నిర్వహించుకొనుచుండఁగలఁడు. ఈరీతిగఁ

పాపభారమును దగ్గించుకొనుచుండు మనుష్యుఁ డాత్మవిజయ
మును సంపాదించి చిరశాంతి సౌఖ్యము ననుభవింపుచుండఁ
గలఁడు.

---

పంచమ ప్రకరణము.

---

# గుప్తాత్మసమర్పణము.

స్వర్గము మన నల్దెసలను, లోపలను విద్యమానమయి యుండ మూఢులమయి దానికయి స్థానస్థానములం దన్వేషించుచుంటి మేమి? సకలసద్గుణములకుఁ బునాది వినయము. పునాదిని సంపూర్ణధ్యానముతో దృఢతరముగ నిర్మించినచో భవననిర్మాణముయొక్క ప్రాశస్త్యాప్రాశస్త్యములను గూర్చి సందేహింపఁ బనియుండదు. — బేలీ.

నీ వేమతము నవలంబించినవాఁడ వయి యున్నను సత్యమునుండి దూరముగ నుండఁ జాలవు. సత్యముయొక్క దివ్యజ్యోతి ప్రతిమానవునియందు దేదీప్యమానముగ వెలుంగుచున్నది. అయ్యది బాహ్యవస్తువులందుఁ బ్రకటీభూతము కాఁజాలదు. ఇది నిశ్చయము. — బ్రౌనింగు.

త్యాగముచే నుపలబ్ధియు, లోభముచే హానియుఁ గలుగు నను విషయమును జనసామాన్యము సులభముగ విశ్వ

సింపఁజాలదు. సద్గుణమును సముపార్జించు నిమిత్తము దుర్గుణమునకు హానినిఁ గలుగఁజేయవలసి యుండును. ప్రతిసుకృతమును సంపాదించుటకు భోగవిలాసము నాహుతిఁ గావింపవలసి యుండును. మహాపురుషు లగుటకుఁ దొలుత మానవులు స్వార్థత్యాగమొనరించు టావశ్యకము. పరమసత్యముయొక్క విశాలమార్గమున ముం దడుగిడుచున్నకొలఁదియు, మనము సత్వర మసత్యమును, దోషపుంజములను విసర్జింపవలసిన వారల మగుచున్నారము.

నూతనవస్త్రధారణమునకుఁ బూర్వము జర్జరాంబర పరిత్యాగ మావశ్యక మగుచున్నది. అదియేరీతి సత్యాన్వేషణపరతంత్రుఁడు కాఁగోరు మనుష్యుఁ డసత్యమును సంపూర్ణముగ బహిష్కరించు టగత్యము. వనపాలకుఁడు (తోఁటమాలి) పుష్పవాటికయందు మొలచియున్న గడ్డిగాదరను ద్రవ్వి కుప్పఁబెట్టి ప్రయోజనకరములగు వృక్షముల కాహారము (ఎరువు) గ నొసంగుచున్నాఁడు. ఇదియేచందమున బుద్ధివృక్షము సయితము కలుపుగాఁ దీయఁబడుచున్న దుర్గుణములను ఎరువును స్వీయపోషణమునకయి స్వీకరించుచున్నది. ప్రయోజనమును బడయుట కాత్మసమర్పణ మవసరము. సత్యజీవితము — ఆనందమయజీవితము — శాంతిమయజీవితము — ఉద్వేగక్లేశశూన్యమగు జీవితము — కేవల మాత్మో

త్సర్గమువలననే సంప్రాప్తమగుచున్నది. మనుష్యజీవితధ్యేయమగు పవిత్రజీవితము మనకు బాహ్యపదార్థములయొక్క బలిదానముచే లభింపఁజాలదు. అయ్యది యాత్మదోషములను, వికారములను నుత్సర్గ మొనరించుటవలననే లభించుచున్నది; కారణ మేమన నీ యాంతరికవికారములే మానవజీవితమున మర్భరదుఃఖపరంపరల నావిర్భవింపఁ జేయుచున్నవి. కల్యాణప్రాప్తికి మేలున్న, సత్యమును, బలిదాన మొనరింప నవసరము లేదు. అసత్యమును, గీదును బరిత్యాగ మొనర్పవలసి యుండును. ఈ కారణముచే నాత్మోత్సర్గమువలన నపారమగు లాభమే ప్రాప్తించును గాని హాని కలుగనేరదు. ప్రారంభకాలమం దుత్సర్గము మిక్కిలిప్రయాసకరముగఁ గానవచ్చును. మనుష్యుఁడు స్వార్థకారణమున భ్రమాంధకారమునఁ బడి యుండుటయే దీనికి ముఖ్యహేతువు. ఒకమానవుని ప్రకృతియం దుండి స్వార్థాంశమునుఁ దొలఁగించుటచే స్వాభావికనియమముచే వాని కవశ్యము బాధ కలుగఁగలదు.

సురాపాయి మద్యపానమును విసర్జింప సంకల్పించినంతనే తీవ్రతరమగు క్లేశము ననుభవింపఁ గడంగుచున్నాఁడు. దుర్వ్యసనమున కభ్యస్తుఁ డయియున్న వ్యక్తి, దానిని విసర్జించుట కెంతయో కష్టము ననుభవింపవలసి యుండును. అతఁడు తనదుర్వృత్తిని బహిష్కరించుచు లోకోత్తరమగు

బ్రహ్మానందమును విసర్జింపుచుంటిని గదా యని విచారింపు చుండును. కాని యతఁడు దుర్వ్యసన బహిష్కారప్రయత్న మునందు విజయము నందినంతనే మద్యమును పానమొన రింపవలయు ననియెడి దాని ప్రగాఢాభిలాష నశించును; కాని మానసము ప్రశాంతమగును, నష్టమైత్రియును, సచేతనమును కాఁగలదు. అపు డతఁడు తనపాశవికవాంఛలను, స్వార్థాంధ విశ్వాసమును బహిష్కరించివేయుటచేఁ దన కపారమగు ప్రయోజనము కలిగినదని గ్రహించి యనుతాపమునకు దళిత హృదయుఁడు కాఁగలఁడు. అతఁ డా దుర్వ్యసన పరిత్యాగ ముచేఁ గోల్పోయిన దేదియు లేదు, తన ప్రాణాంతకమగు శత్రువును సంహరించినాఁడు. వ్యసనము మానవజీవితమున దాశ్రయమును సంపాదింప సమర్థమైనది కాదు. అది సత్వర పరిత్యాజ్యము. వ్యసనముచే మానవుని జీవితశాంతి తొలంగును; ఆధ్యాత్మికశక్తియు దివ్యానందమును నదృశ్యము లయిపోవును. సదాచారములవలనను, ఆత్మదమనముచేతను గలుగు సత్య మగు ప్రయోజనము మహత్తరమయినది. ఆమహత్తరమగు ప్రయోజనము జీవితాభ్యుదయమున కత్యంతాపేక్షణీయ మయినది. వ్యసనమును గాఢాలింగన మొనరించుకొను చున్నంత పర్యంతము తద్వియోగము మనుష్యున కసహనీయ మగు వేదనము నావిర్భూత మొనరించును. దృఢసంకల్పబల ముచే మహాపురుషుల హితోపదేశవాక్యముల నాలించి వ్యస

సమును బరిత్యజించివైచినపిమ్మట కలుగు నసాధరణమగు లాభమును జూచుకొని యెంతటిమూఢుఁడయిన వారింపఁ గలఁడు. కావున మానవులెల్లరు దూరదృష్టియుతులయి, దుర్వ్యసనములను గాలసర్పము కంటె భయంకరము లని గ్రహించి వెనువెంటనే శీఘ్రమే పరిత్యజించివైచినచోఁ దమ్ముఁ దాము సంరక్షించుకొనినవార లగుదురు. దుర్వ్యసన బహిష్కరణమే మోక్షప్రథమసోపానము.

సమస్తవిషయములగు వాస్తవికాల్పనమర్పణములయొక్క స్థితి యిదియే. సమస్తలాభములగు నాత్మోత్సర్గములు ప్రారంభమందున, బాహ్యమగు పర్యవసానమును దుఃఖదాయకములుగ గోచరించుచుండును. కావుననే మనుష్యులు వీనిని గాంచి భీతచిత్తులగుచుందురు. స్వార్థమయములగు నధమభోగములను విషయవాసనలను బహిష్కరించుటయందును, జయించుటయందును మానవుల కెట్టిహానియును గలుగఁజాల దన్నరీతి సామాన్యదృష్టికి గోచరించుచుండును. భోగవిలాసములను విసర్జింప నుపక్రమించు మనుష్యుఁడు చిరకాలసంపాదిత మగు మధురానందమును గోల్పోవుచున్నవానివలె నపారమగు వ్యాకులతను, నసంతోషమును బొందుచున్నాఁడు. కీడును బాయుటయందు మనుజునకు దుఃఖము కలుగు టనివార్యము. ఇదియు నత్యంతావశ్యకమే. కారణమేమన మనుష్యుఁడు స్వార్థ

మునయొక్క వివిధవిధానములఁ బరిత్యజించుటచే నత్యంత దుష్ప్రాప్యమగు నపరిమిత సౌఖ్యప్రయోజనము కలుగుచున్న దని గ్రహింపుచో సౌఖ్యోపలబ్ధి వానికిఁ గరము కష్టసాధ్యము కాఁగలదు, కారణ మేమన వాని యాయథార్థ లాభలాలస (స్వార్థాభిలాష) మత్యంతప్రబలము కాఁగలదు. విపులస్వార్థ మున కావాసమగు స్థానమున సౌఖ్య మెట్లుండనేర్చు ?

మనుష్యుఁడు స్వలాభముయొక్కయుఁ, బారితోషికము యొక్కయు నభిలాషచేఁగాక, నష్టము ననుభవింపఁ గటిబద్ధుఁడు కానంతపర్యంతము స్వార్థత్యాగియయి పరమానందమును బడయఁజాలఁడు. మానసముయొక్క యీవిధమగు స్థితియే మానవుని స్వార్థశూన్యునిఁ గావింపుచున్నయది. తన యిరుగు పొరుగువారి సౌఖ్యార్థ మాత్మలాభమును, స్వప్రయోజన మును నభిలషింపక మానవుఁడు వినయసంపన్నుఁడయి స్వార్థ పూర్ణములగు కార్యములను, స్వభావమును విసర్జించివేయవల యును. కారణ మేమన స్వార్థమునకు సంబంధించిన సమస్త కార్యములును, సత్యవిరుద్ధములును, నయోగ్యములును నయి యుండుచున్నవి. వీనిని సంపూర్ణముగా మానవజాతి నిషేధించుటచే విశ్వ మత్యధికముగ సుందరమును, సౌఖ్యవంతము ను గాఁగలదు. మనుష్యజాతి స్వార్థముతోఁ బాటు నిజవిలాస ములను, వికారములను వేయేల! తుచ్ఛమగు జీవితమునే విడిచి

వేయవలసియుండును. ఇట్లాచరించినను వాస్తవముగ నష్టము ననుభవించు మానవుఁడీభూమండలమునఁ గలఁడా? కృపణుఁడు విపులవైభవవాంఛను బరిత్యజించినచో హాని నొందునెట్లు? దస్యుఁడు చౌర్యమును విడినచోఁ బ్రయోజనము నందకుండునా? స్వార్థత్యాగముచే నపారమగు ప్రయోజనమే కలుగుచుండ, నష్టము కలుగుచున్న దని భావించు మూఢునకుఁ గష్టమేల కలుగకుండును? వానికిఁ దలస్ధించెడి యాకష్టమే యొకవేళ స్వార్థత్యాగముయొక్క దుష్ఫలితమగు హానియని దూరదృష్టిలేని మూఢులు భావింపవచ్చును, కాని వాస్తవమున కిది భిన్నము. సత్యమాలోచింప నీపద్ధతియందే యాత్మసమర్పణము కలదు. నష్టముచే లాభమీరీతిగనే వాటిల్లుచున్నది.

వాస్తవికమగు బలిదానము (ఉత్సర్గము) ఆంతరికమయినది. బాహ్యమునందద్దాని కునికి లేదు. అయ్యది హృదయముయొక్క గంభీరమగు వినీతభావమునుండి యుత్తేజితమగు నాధ్యాత్మికరహస్యము. ఆత్మోత్సర్గములేకయే మనుష్యుఁడేమియు సేయనేరఁడు. ఆధ్యాత్మికజ్ఞానప్రసార సమయమందు మానవుఁడీయాత్మసమర్పణము మీఁదనే సంపూర్ణముగా నవలంబితుఁడు కావలసి వచ్చుచున్నది. కాని 'యీయాత్మసమర్పణ మేపదార్థములచే నిర్మిత మయినది, ఎవ్విధముగఁ బ్రయోజన కరమగుచున్నది, ఎచ్చోట నన్వేషింపఁబడి లభిం

వుచున్నది?' అని విచారించుకొంటిమేని యీయాత్మసమర్పణము, స్వార్థమయ భావములందున, కార్యములందున కలుగుచుండు మానవుని దైహికప్రవృత్తిని జయించుటవలననే నిర్మిత మగుచున్న దని స్పష్టపడఁగలదు.

మానవునకుఁ బరులతోడఁ గలుగుచుండు సామాన్య వ్యవహారములం దీయాత్మసమర్పణము ప్రయోజనకర మగుచున్నది. ఇయ్యది కోలాహలముయొక్కయు, లోభముయొక్కయు గతియందుఁ శాంతిఁ జూపుచున్నయది. అంతఃకరణముయొక్క గుణములను, గంభీరతలను నగు నాత్మోత్సర్గములు బహువిధములు. దానిని బడయుటయందు మానవున కవశ్యము బాధ కలుగవచ్చును. కాని యీయాత్మసమర్పణము లెవ్వారినిమిత్తము గావింపఁబడుచున్నవో, వారికిని, గావించువారికిని విశేషమగు నిర్మలానందము నొడఁగూర్పఁ గలవు. మహోన్నతమగు బలిదానము నపేక్షించు మహోత్తరములగు కార్యముల నాచరింప సన్నద్ధులయి యుత్సాహితులయి యుండు మనుష్యులే, తమకు సులభముగ సాధ్యపడు నట్టియు, సామాన్యములును నగు నాత్మసమర్పణములను విస్మరింపుచు, వానివైపునకుఁ గన్నెత్తియయిన వీక్షింపకున్నారు. ఎచ్చోట నష్టదాయకమగు పాపము నెలకొనియుండుచుండునో, మానవుని దుర్బలత్వ మవశ్య మచ్చోట గలదని

తెలియఁ దగును. మానవుఁడా! ఎచ్చోట నిన్ను లోభ మధికముగా బాధింపు చుండునో, అచ్చోటనే నీవు తొలుతఁ బ్రేమ మాత్రోత్సర్గమును బ్రారంభింపుము. ఇట్లాచరించుటచే నీకు శాంతిమార్గము లభ్యము కాఁగలదు. నీయందు నెలకొని యుండు క్రోధమును, నిర్దయయుఁ బ్రధానమగు దోషములుఁ. సోదరుఁడా! నీ వేల నేటదనుక క్రోధోద్వేగమును, కటువచనములను, నిర్దయాత్మక భావములను, రాక్షసకర్మలను విడిచి యుండలేదు? నీవు కటువచనములను, నాకర్షణములను, దోషారోపణములను, కృపారాహిత్యమును నిశ్శబ్దముగ సహించుటకును, బ్రత్యపకార మొనరింప కుండుటకును సన్నద్ధుఁడవు కాఁజాలవా? పరమశాంత్యముయొక్క ముఖ్యలక్షణములగు వీని నన్నింటి బహిష్కరించివైచి వీనికి మాఱుగా దయాదాక్షిణ్యములను, ప్రేమానురాగములను లోకముయెడఁ బ్రకటింపఁజాలవా? ఇట్లొనరింపఁ జాలుదువేని పరమానంద పదవికిఁ బ్రాపింపఁ జేయు గుప్తాత్మసమర్పణముల నిమిత్తమును నీవు సునజ్జితుఁడవును, యోగ్యుఁడవును, సన్నద్ధుఁడవును గాఁ గలవు.

నీ స్వభావమందు క్రోధమును, నిర్దయయు నెలకొని యున్నచో సత్వర మవ్వానిని బహిష్కరించి వేయుము. మానసముయొక్క యిట్టి యనుచితమును, కఠోరమును, దయా

శూన్యమును నగు ప్రవృత్తులచే నీ కెట్టి లాభమును గలుగ నేరదు. ఇట్టి స్వభావము నీ కనారోగ్యమును, దుఃఖమును, నాధ్యాత్మికాంధకారమును దక్క, మఱెట్టి సౌఖ్యము నొసంగఁజాలదు. పరులకును వీనిని మించి నీ వేమియుఁ బ్రసాదింపఁజాలవు. నీవు నిరంతరము "వ న్నావ్యక్తి దూషించినాఁడు; లాఘవ పఱచినాఁడు, హింసించినాఁ" డని వచింపుచుందువు. ఇత్యాది నీయాత్మదుర్బలత్వమును వెల్లడించునట్టి యొక నీచమగు వ్యాజము; నింద్యమగు భీరుత్వము. ఒకవేళ నాఁడయొక్క దయాశూన్యత నీయెడ దూషితమును, నష్టదాయకమును నగుచో వానిపట్లను సయితము నీదయావిహీనత కలుషితమును, హానికరమును గాఁగలదు. ఎవఁడేని యొకమనుష్యుఁడు నీయెడఁ గరుణాశూన్యుఁడయి వర్తించి దుష్టనీతిని వెల్లడింపుచో నీవును వానివలె భ్రష్టుఁడవయి తిరిగి వానిపట్ల రాక్షసముగ నేల వర్తింపుచున్నాఁడవు? అపకార మొనరించిన వానియెడ విశేషమగు నుపకారమును వెల్లడించి నీ వేల నీతిమంతుఁడ వయి నీ యాధ్యాత్మికశక్తిని వృద్ధిగావించుకొనసిద్ధుఁడవు గాకున్నాఁడవు? జలప్రవాహము మఱికొంత జలభాగము తనతోఁ జేరుటచే వృద్ధినందునే కాని క్షీణింప నేరదు. రాక్షసత్వముచే దయాశూన్యతే న్యూనము కాఁజాలదు. అగ్నినే నగ్నిజల్లారు టెట్లు? క్రోధముచే గ్రోధ ముపశమింప నొల్లదు.

కరుణాశూన్యతను, క్రోధమును బరిత్యజింపుము. పర
స్పరశిలాసంఘర్షణముననే యగ్నిస్ఫులింగము లుదయింపుచు
న్నవి. కరతలద్వయ మేకీభవించుటవలననే చప్పటులధ్వని కలుగ
ఁజేర్చుచున్నది. అదియేరీతి క్రోధము క్రోధముతో నైక్యమొం
దినపుడే వర్ధిల్లునుగాని, కోపము ప్రేమచే ముట్టడింపఁబడినపుడు
వృద్ధినందనేరక యొక్కసారిగ నుపశమింపఁగలదు. కావున
నాయనా! నీయెడ నెవఁడేని క్రుద్ధుఁడగుచున్నచో నీవును మూ
ర్ఖుఁడవయి కోపమును పెంచక పరునికోపమునకుఁ నిన్నుఁ బాత్రు
నిఁ గావించిన దోషమేమి నీయందుఁగలదో ప్రశాంతహృదయ
ముతో నన్వేషించుకొనుము. క్రుద్ధుఁడు తనహృదయాంతరాళ
మున జనించిన క్రోధానలమున కాహుతి యగుచుండ నీ వేల
వానిని కోప మను మంటయందుఁ బడఁద్రోసి వానివలె నే మం
దభాగ్యుఁడవు కాఁగోరుచున్నాఁడవు? క్రోధమును దయార్ద్ర
హృదయుఁడవయి క్షమించుము. ఇట్టి యవసరములందు శాంత
మును, క్షాంతిని, దయాళుత్వమును గలిగియుండి నిన్ను దూషిం
పుచు నీయెడఁ గ్రోధమును బ్రకటించువారిని క్షమించి వారిపై
నకృత్రిమమగు కృపారసమును వెదజల్లుము. వారి కోపతా
పము తత్క్షణమే చల్లారిపోఁగలదు. నీవొకవేళ స్వభావముగా
నధీరుఁడవును, ముక్కోపివియు నయియున్నచో నధీరత్వమును,
బహిష్కరించునట్టి యాత్మసమర్పణపాఠము నభ్యసింపుము.
నీచిత్తము ధీరత్వమును గోల్పోవుచున్నపుడెల్ల శాంతస్వభావ

ముతో నాయకీరత్వము నణఁచివేయుము. అధైర్యముయొక్క నిర్దయాధికారమునకు వశుఁడవుగాక దానిని జయింప దృఢ సంకల్ప మొనరించుకొనుము. అధైర్యమును క్షణమాత్రకాలమైనను నీదేహమందిరమునఁ బ్రవేశింపనీయకుము. పరులమాధ్యమునుగూర్చియు, దోషములను గుఱించియు నీవు మోసగింపఁబడవలదు. పరులు నిన్ను నిందించినను, హింసించినను, గుపితునొనరింప యత్నించినను, రెచ్చగొట్టినను ధైర్యమును, శాంతమును విసర్జింపవలదు. ఏదోషమును దూర మొనరించుటకయి యధైర్య ముదయింపుచున్నదో, యాదోషమునే యది వృద్ధిగావింపుచుండును. అధైర్యమును, జడచిడ మనుటయు దుర్బలత్వముయొక్కయు నయోగ్యతయొక్కయు ముఖ్య లక్షణములు. వీనిచే నీకును, నీ పొరుగువారికిని విశ్రాంతియు, శాంతియు, సౌఖ్యమును లభింపఁజాలవు, మీదుమిక్కిలి దైన్యమును, దుర్భాగ్యమును దుఃఖమును లభింపఁగలవు. నీయొక్క యధైర్యముచేఁ బరుల కోమలహృదయముల సంక్షోభము కలుగుచున్నయది. నీకును దీరనిహాని సంభవింపుచున్నది.

సాహసములేని వ్యక్తి సత్యమగు బ్రహ్మానందమును బొత్తిగా ననుభవింపఁ జాలఁడు, కారణ మేమన వాఁడు సదా దుఃఖతుఁడయి, వ్యాకులహృదయుఁడయి యుండుచుండును. వాఁడు మానవజీవితాభ్యుదయమున కత్యంతావశ్యకమగు

స్థైర్యముయొక్క ప్రశస్త ప్రశాంత ప్రవిమల సౌందర్యము నుండియుఁ, దదనంతమాధుర్యమునుండియు ననభిజ్ఞుఁడయి యుండుచుండును. వాని మానసమునకు విశ్రాంతి నొసంగుటకయి శాంతి వానిదరిఁ జేరనొల్లదు.

అస్థైర్యము బలిదానమొనరింపఁబడునందాఁక మానవున కానంద మిసుమంతయు లభ్యము కానేరదు. ఈయాత్మ సమర్పణముచే సహిష్ణుత మిక్కిలి వర్ధిల్లును, క్షాంతి యలవడును. అపుడు నూతనమగు నమ్రస్వభావము నిర్మింపఁబడఁ గలదు. అస్థైర్యమును, క్రోధమును దూరమొనరింపఁ బడి స్వార్థత్యాగముయొక్క వేదికపైఁ బ్రజ్వరిల్లుచున్న బలిదానమను ప్రచండాగ్నిజ్వాలల కాహుతి గావింపఁబడుటచే మానవుఁడు సబలమును, సుస్థిరమును, ప్రశాంతమును నగు మానసముయొక్క యానందము ననుభవింపఁ గలుగుచున్నాఁడు.

బాహ్యమునకు దోషశూన్యములుగఁ గాననగుచు మానవులచే సేవింపఁబడుచున్న చిన్నిచిన్ని స్వార్థపూర్ణములగు విలాసము లెన్నియో కలవు. విలాస మెట్టిదయిన దానియందు స్వార్థము లవలేశము మిశ్రమమయియున్నను దప్పక హానికరమే కాఁగలదు. ఇట్టి భోగవిలాసములకుఁ జీటికిమాటికిఁ జిక్కుచుండుటచే నెట్టి భయంకరమగు నష్టము వాటిల్లుచున్నదియు జనసామాన్యము గ్రహింపకున్నది. మానవునియందు దైవి

కమును, బాశవికమును నగు రెండుశక్తు లుండుచున్నవి. పాశవికశక్తి నశించినపుడే మానవునియందుఁ గల దైవికశక్తి వృద్ధియగుచుండును. ఇంద్రియములకుఁ గల్పితసౌఖ్యము గలిగించునట్టి విలాసములు బాహ్యమున కెంత నిర్దోషములుగ నున్నను, అవి మానవుని సత్యమునుండియు, నానందమునుండియు దూరముగా నీడ్చివేయును. మనుష్యుఁడు పాశవికసౌఖ్యములచేఁ దన యింద్రియములకుఁ దుష్టిని గూర్చుచున్నకొలఁదియు వానియింద్రియములు చంచలములును, బ్రబలములును నగుచుండఁగలవు. మానవుఁ డీ సామాన్యములగు బాహ్యవిలాసములను విసర్జింపనంతపర్యంతము విలాసమయజీవితముచేఁ దా నెంతబలమును, హర్షమును, సదాచారమును, బవిత్రిభావమును నష్టమొనరించుకొని యుండినదియు స్పష్టముగా గుర్తింపఁజాలఁడు. స్వార్థమయములగు భోగవిలాసముల సంపూర్ణముగా బహిష్కరింపఁజాలని మనుష్యుఁడు పవిత్రానందమును ననుభవింపనేరఁడు.

ఈ యాత్మస్నేహము వలనను, నింద్రియలోలత్వముచేతను మానవుఁడు తన్ను దానే పతితుని గావించుకొనుచున్నాఁడు, మఱియు నాత్మగౌరవమును నష్టమొనరించుకొనుచు విశ్వమం దుత్తమకార్యముల నాచరించు శక్తిసామర్థ్యములఁ గోల్పోవు చున్నాఁడు. వాంఛలకు వశీభూతుఁడయి వాఁడు తన

యాంతరికాంధకారమును వృద్ధిగావించుకొని, తనస్వార్థమునఁ బదార్థమగ్నావలోకనశక్తిని, సత్యాన్వేషణాబలమును బోఁగొట్టుకొనుచున్నాఁడు. నీతివిహీనమగు పాశవిక విలాసము సత్యాన్వేషణమునకుఁ బ్రబలశత్రువు. విలాసముల బలిదాన మొనరించుటచే మానవుఁడస్థిరత్వమును, సందేహములను నణఁచివైచి సకలమును నిజస్థితియందు వీక్షింపఁగల యాంతర్దృష్టిని, దృఢవిశ్వాసమును సంపాదింప సమర్థుఁడగుచున్నాఁడు. నాయనా! నీవు బుద్ధిమంతుఁడవయి నీప్రేమకుఁ బాత్రములయిన దుష్టవాసనలను విసర్జింపుము. నింద్యమగు క్షణిక సౌఖ్యముకంటెఁ బవిత్రమగు శాశ్వతసౌఖ్యమును సముపార్జింప నాయత్తపడుము. ఇంద్రియలోలత్వమున కతీతుఁడవయి వర్తింపుచో నీజీవితము వ్యర్థమును, సందిగ్ధమును గాఁజాలదు.

మనుష్యులనేకులు తమవచనములనే ప్రమాణములుగ భావింపుచుందురు. ప్రమాదవశంబునఁ దమనోటినుండి జారిన నుడువునే బ్రహ్మవాక్యముగ సమర్థించుకొన వారు సదా పరులతో జగడమాడుచుందురు. ఇట్టి నీచప్రకృతిని గర్హింపుచు విడిచిపుచ్చుటచేఁ బరులపై విశేషప్రభావము ప్రసరింపఁగలదు. పరులజీవితమందును, ఉద్దేశ్యములందును, విశ్వాసములందును జోక్యమును గలిగించుకొను ప్రకృతిని మాన

వుఁడు విసర్జించివేయవలయును. పరులయెడ విశేషమగు సహానమును గలిగియుండు స్వభావము నభ్యసింపవలయును. తనవాక్యములే సమస్తజనులు ప్రమాణముగ భావింపవలయు ననియెడి తలంపు, విద్వాంసులయందును, వక్తలయందును విశేషముగా గానవచ్చుచుండు నొకవిధమగు స్వార్థము. ఇట్టి స్వార్థము దయాశూన్యమగు కేవలాంధకారము. ప్రారంభమం దీవాక్యహాత మను దురభ్యాసము విశేషమగు కష్టముచే దూరమొనరింపఁబడుచున్నది. కాని మానవుని హృదయమందు సౌశీల్యమును, ప్రేమయు నావిర్భవించినచో దుఃఖదాయకమును, ప్రమాదమును నగు నీహాతబుద్ధి సులభముగా లోపించిపోవుచున్నది. సౌజన్యమును, సత్యజిజ్ఞాసయు నేమానవునకు స్వాభావికాలంకారములయి యొప్పుచుండునో వాని యందు స్వవచనహాత ముండ నేరదు.

హాతముగల మనుష్యుఁడు తన యభిప్రాయమునే సకల లోకాదర్శప్రాయముగ భావింపుచుఁ దనమతమునకు విరుద్ధములుగనున్న పరుల యాచార వ్యవహారోద్దేశ్యముల సదా దూషింపుచుండును. వాఁడు బుద్ధిపూర్వకముగఁ బరుల సన్మార్గము ననుసరింపఁజేయ నభిలషించియు మిథ్యాభిమానముచేఁ దానుమాత్ర ముచితమార్గము ననుసరింపు చుండ నేరఁడు. పరులు వానిదోషములఁ జూపించుచు వాని నుద్ధరింప సమ

కట్టుచో వాఁడెంతయుఁ బరాభవింపఁబడినవానివలెఁ గ్రోధ మును, విషాదమును, సిగ్గును జెందుచుండును. తనదోషమున కయి లోకము తనతో శత్రుత్వమును వహించి విశేషాఘాత మును గలిగించినచో దుఃఖవారిధి మునుంగుచుండఁగలఁడు. దీనికి ఫలముగా వాఁడు సదా యప్రసన్నుఁడయి, క్రోధోన్మ త్తములును, నిర్దయాత్మకములును నగు వివిధభావములయొక్క విషమజ్వరతాపముచేఁ బరితపించు చుండఁగలఁడు. ఎంత పర్యంత మిట్టి మనుష్యుఁడు పరులను దనయుద్దేశ్యానుసార ముగ నడిపించవలయునను వాంఛను విసర్జింపనేరఁడో, అంత దనుక శాంతిని, జ్ఞానమును, నభివృద్ధిని సంపాదింపఁజాలఁడు. వాఁడు ఎన్నిప్రయత్నము లొనరించినను బరుల హృదయ మును గ్రహింపనేరఁడు.

అట్టి వ్యక్తి పరులకార్యములయందును, గాంక్షల యందును సహానుభూతిని బ్రకటింపఁ జాలఁడు. వాని చిత్త గతి సదా మిథ్యాభిమానముచేతను, గర్వముచేతను, గాఠి న్యమువలనను నిరోధింపఁబడి యుండుచుండఁగలదు. కావున వానియందు మధురమగు సహానుభూతియొక్కయు, నాధ్యా త్మిక ధ్యానము యొక్కయుఁ బ్రవేశము కలుగఁజాలదు.

ఈ హఠమును విసర్జించు మనుష్యుఁడు పరులతోడ నలు వు దైనిక వ్యవహారమందు నిజోద్దేశ్యాధిక్యమును, బక్షపాత

ములను దూరమొనరించి పరుల స్వానుభవసిద్ధమగు నీతి నభ్య
సించుటకును, బరుల నానావిధమగు మానసిక స్థితిని గ్రహిం
చుటకును బ్రయత్న మొనరింపఁ గలఁడు. అతఁడు తనయుద్దే
శ్యమును బ్రకటించుట కెంత స్వాతంత్ర్యమును బరులనుండి
స్వీకరింపుచుండునో, అంతియే స్వేచ్ఛను బరులకును వారి యుద్దే
శ్యములను బ్రకటించుకొనుటకయి యొసంగుచుండును. పూర్వము
కంటె వాని కత్యధికమగు జ్ఞానము, ననుకంపయు, నానం
దమును ననుభూత మగుచుండఁగలవు. పూర్వము తనదృష్టికి
గోచరింపనట్టి బ్రహ్మానందపథము వానికి దృగ్గోచరము కాఁ
గలదు.

దీనికిఁబిదప మనుష్యుఁడు లోభము, లోభబహుళము
లగు భావములను బలిదాన మొనరించు టావశ్యకము. మనకుఁ
గాకుండఁ బరులకు సంపదలు లభించినను మనము స్వలాభ
మును బడసినరీతిగనే సుప్రసన్నులముగా కావలసియుండును.
పరాభ్యుదయమును గాంచి హర్షింపవలయును. పరులు శ్రేష్ఠ
ములగు కార్యములయందు విజయలక్ష్మిని బడయుచున్నను,
బ్రశస్తములగు వస్తువుల భోగింపుచున్నను మత్సరమును గలి
గియుండక సంతోషింపుచుండవలయును. స్వలాభమును బరుల
ప్రయోజనమునిమిత్తము నిస్స్వార్థభావముతోడను, విశుద్ధ
హృదయముతోడను త్యజించివైచుట మిక్కిలి ప్రశంసనీ

యమగు విషయము. ఈవిధములగు సద్భావములను బరిగ్రహింపుచుండుటచే మానవునకు గంభీరమగు శాంతియు నాధ్యాత్మికశక్తియు లభించును. స్వార్థముయొక్క యథార్థమగు సమర్పణ మిదియే.

ఆర్థికవైభవములు క్షణభంగురములు, అవి చిరస్థాయిగ నుండనేరవు. కావున వానిని మన వని నుడువ వలను పడదు. అవి స్వల్పకాలమువరకే మనయొద్ద నుండగలవు. కాని యాధ్యాత్మికసంపద లజరామరములు. అవి సదాప్రతిబింబములవలె మనల వెంటనంటియుండుచుండును. ఆర్థిక సంపదలను త్యాగమొనరించుటవలనను, భౌతికసౌఖ్యములను విసర్జింపఁగలుగుటవలనను, సృష్టియందలి సమస్తపదార్థములు మన సౌఖ్యమునకై సృజింపఁబడియుండలేదనియు, లోకకళ్యాణమునిమిత్తమే మనకుఁ బ్రాప్తించియున్నవనియు గ్రహించుటచేతను సులభముగా మనకు స్వార్థత్యాగముయొక్క సకలలోకాదర్శప్రాయమగు నాధ్యాత్మికశక్తి సంప్రాప్తమగుచున్నది.

స్వార్థశూన్యుఁడగు మనుష్యుఁడు ధనాఢ్యుఁడయియున్నను స్వప్నమందును వైభవగర్వమును గలిగియుండఁబాలఁడు. ఈకారణముననే వాఁడు లుబ్ధులను సంపదలకారణమున ముట్టడించియుండు కాఠిన్యము, కార్పణ్యము, భయము, విషాదము

మొదలగు దుష్ప్రవృత్తులనుండి సురక్షితముగా నుండఁగలుగుచున్నాఁడు. నశించుటచేఁ దనమానసమునకుఁ గష్టము గలిగించునంతటి మహాత్తరమగు పదార్థముగ ధనోపలబ్ధి నతఁడు భావింపనొల్లఁడు. అతఁడు కేవలము స్వార్థత్యాగమునే విశ్వమండలమందలి సమస్తమనుష్యులకు విశేషప్రయోజనకరమగు నిత్యసంపత్తిగ విశ్వసింపుచుండును.

చదువరీ! ఆనందమయమానవుఁ డెవఁడో యిప్పటికి యున నుడువఁగలవా? తనసౌఖ్యమునిమిత్తము సంపదల నభివృద్ధిగావించుకొనుచు హర్షించుచుండు మానవుఁడు శ్రేష్ఠుఁడా లేక పరులసౌఖ్యమునిమిత్తమును, విశ్వకళ్యాణముకొఱకును దనకుఁగల సర్వస్వమును సమర్పణ మొనరింపఁ గటిబద్ధుఁడయి యుండు వ్యక్తి యుత్తముఁడా? లోభముచే సౌఖ్యము నశింపుచున్నది. నిర్లోభముచే సౌఖ్యోదయమగుచున్నది. మనుష్యజాతియొక్క దుర్భరదుఃఖదారిద్ర్యమును, ఘోరవిపత్పరంపరలను దూరమొనరించుటయందు సమర్థమగు మహత్తరశక్తి యీర్ష్యాపరిత్యాగము, అనఁగాఁ బరులయెడఁ గటుభావములను, మత్సరమును, ఘృణను, క్రోధమును గలిగియుండకుండుటయే. అంధకారప్రకాశము లొక్కచో నేకీభవించి యుండఁజాలని విధంబున నీర్ష్యయు, నానందమును గలిసియుండ నేరవు. ఈర్ష్య మానవహృదయమం దుదయించి వానిశాంతి

సౌఖ్యకోమల కుసుమముల భస్మమొనరించివైచి, మానసమును నరకసదృశముగఁ జేసివేయునట్టి ప్రచండాగ్ని.

ఈర్ష్య బహునామముల, బహుభేదముల నొప్పారుచుండును, కాని యన్నింటితాత్పర్య మొక్కటియే. ఈర్ష్య యొక్క వివిధాంగములును మానవహృదయమందుఁ బరుల యెడ ద్వేషభావమును బ్రజ్వలిత మొనరించును. ఈర్ష్య యొక్క యంధవిశ్వాస పూరితులగు ననుచరులు స్వధర్మ మందుఁగల ప్రగాఢాభిమానోన్మాదముచే నన్యధర్మావలంబుల దూషింపుచు వారితో యుద్ధమొనరింప సన్నద్ధులగుచు రక్తపాతముచే భూమాతను దడిపివైచుచున్నారు.

పరులయెడఁ జూపఁబడు ప్రతివిధమగు వైమనస్యమును, నసంతోషమును, నశుభచింతనమును, కటుభాషణమును మొదలగు దుష్ప్రవృత్తులన్నియు నీర్ష్య యనఁబడుచున్నవి. ఈర్ష్యయే దుఃఖోత్పత్తికి మూలస్థానము. పరులయెడఁ గ్రోధాసూయాభావములఁ గలిగియుండు మనుష్యుఁ డెంతగాఁ బ్రయత్నించినను దుష్టప్రవృత్తియగు నీర్ష్యను జయింపఁజాలఁడు. సమస్తమానవులయెడ దయార్ద్రహృదయుఁడయి వర్తించు పద్ధతి నభ్యసింపనంతపర్యంతరము మనుష్యుఁడు మత్సరమును బలిదానమొనరించుటయందు సాఫల్యమును సముపార్జింపఁ జాలఁడు. పరులవిషయమునఁ గీడుఁదలంచువాఁడును, నుడువు

వాఁడును, సేయువాఁడును మత్సరు యొక్క భయంకర జాలమునుండి విమోచన మొందఁ గోరుము. మానవుఁడా! నీవు యథార్థమగు బ్రహ్మానందము ననుభవింప నభిలషింతువేని సత్వరముగ మత్సరమును నీహృదయక్షేత్రమునుండి దూర మొనరించివేయుము. మత్సరగ్రస్తుఁడు సకలైశ్వర్యములు గలిగియుండియు దీనునివలె, హీనునివలె, గర్భదరిద్రునివలె నిరంతరము దుఃఖించుచుండఁగలఁడు. ఈర్ష్యయొక్క కరుణాశూన్యములగు కఠినహస్తములు ఉచ్చైఃస్మృతమయిన పవిత్రాంతరాళమున బ్రేమయొక్క విశుద్ధ దేవతామూర్తి యుపవసించి, వజ్రసమాన కఠోరములగు నీర్ష్యాకవాటముల భేదించుకొని నికేతనములోపల కేతెంచు మానవునకు మోక్షఫలితమగు నిత్యసత్యమగు శాంతిని బ్రసాదింప సదా నిరీక్షించుచుండును.

నాయనా! పరులు నీయెడ నెంతనీచముగా వర్తించినను నీవుమాత్రము వారల దూరకుము; ప్రతిక్రియ యొనరింపఁ బూనకుము. కీడు సేయువానికి మేలు సేయుము. నీ కంతటి యాత్మబలము లేకున్నచో మౌనము వహింపుము. ఈర్ష్య నీర్ష్యచేఁ బరాభవింప నెంచకుము. ఎవఁడేని నిన్ను ద్వేషించుచున్న నీవు త్వరపడి కుపితుఁడవయి తాల్మిని వీడకుము. ఒక వేళ నీ వేదేని దోషమొనరించియుండుటవలననె వాఁడు

నిన్ను దూషించి యుండవచ్చును. ఇదియే నిజమగుచో నీవు పశ్చాత్తాపమును జెంది నీచారిత్రమును సంస్కరించుకొని నిన్ను ద్వేషించినవానిపట్ల సౌజన్యమును వెల్లడింపుము, 'గోళ్లచే గిల్లివేయఁదగినవానిని గొడ్డళ్లఁ గొట్టుటేల' యను లోకోక్తి ననుసరించి నామమాత్రముగు సౌజన్యముచేఁ బరిష్కృతము కావలసినసమస్యను ద్వేషముచే బహుళమొనరించు టేమి వివేకము? క్షమాకవచమును ధరించు మానవుని విశ్వమందెట్టి భయంకరాస్త్రములును హింసింపఁజాలవు. క్షమయే మహత్తరములగు నస్త్రములలోనికెల్ల దివ్యాస్త్రము. ఈర్ష్య నింద్యమయినది. హీనమయినది. విషముకంటెఁ బ్రాణహానికరమయినది. ప్రేమ దివ్యమును, ధీయుతమును, కల్యాణదాయకమును నగు శ్రేష్ఠసాధనము.

పరుల కపకార మొనరింపకుండుటయే సకలలోకాదర్శప్రాయమును, సర్వోన్నతము నగు నాగరికత. పవిత్రమగు సౌందర్యమును, లోకసంపూజ్యమగు యోగ్యతను సానందముగ వీక్షింపఁగలుగు నేత్రములఁ గలిగియున్నట్టియు, నిజాదర్శ జీవితోదాహరణములచే భ్రష్టుల సన్మార్గానువర్తులుగఁ జేయుచుండునట్టియు మనుష్యుఁడే యథార్థమగు సంస్కర్త. మానవుఁడా! నీవు నా హితోపదేశము నాలకించి సత్వరము సమస్తవిధములగు నీర్ష్యను విసర్జించివేయుము.

విశ్వజీవ ప్రేమయొక్క పవిత్రవేదికపై భయంకర పిశాచమగు నీర్ష్యను బలిదాన మొనరించి వేయుము. దీనియందే నీయనంతమగు కల్యాణము దాగియున్న దని విశ్వసింపుము. దీనిచే నీజీవిత మనంతసౌఖ్యమున కాకరము కాఁగలదు. నీహృదయ సరోవరముయొక్క ద్వారమును దెఱచి వైచి దానిలోనుండి దివ్యమధుర మనోహర ప్రేమరసమును నిరాటంకముగాఁ బ్రవహింపనిమ్ము. ప్రతిప్రాణియొక్క జీవిత శాంతిని గూర్చియు, రక్షణమును గుఱించియు విశేష ధ్యానమును గలిగియుండుము. నీ కపకార మొనరించు ప్రాణికేని ప్రమాదవశంబున నయిన కీడును దలంపకుము.

అపవిత్ర వాసనలును, ఆత్మదయయు, నాత్మప్రశంసయు, నాత్మగౌరవమును సత్వరత్యాజ్యములు. ఆత్మగౌరవమన నాత్మతత్త్వమును సన్మానించుట కాదు. తన్ను దాను ఘనునిగ భావించుకొని సన్మానించుకొనుటనే యాత్మగౌరవమందురు. ఇట్టి వాసనలన్నియు హృదయముయొక్క జాడ్యములు. ఇవియే మస్తిష్కముయొక్క యానందశూన్యములగు వికారములు. మానవుఁడు క్రమక్రమముగ వీనిలో నొక్కొక్క దానిని బరిత్యజించుకొలఁదియు వాని దుర్బలత్వమును, భేదమును దూరమయి పోవఁగలవు. వాని కంతట సంపూర్ణమును, శాశ్వతమును నగు స్వర్గీయానందము సిద్ధింపఁగలదు.

ఇంతవఱకు వ్రాయఁబడిన గుప్తములగు బలిదానము లన్నియు హృదయాంతరాళముననే కలుగుచున్నవి. హృదయముయొక్క పవిత్రమును, గుప్తమును, నదృష్టమును నగు వేదికమీఁదనే సమస్తవాసనలు బలి యొసంగఁబడు చున్నవి. మనుష్యుఁడు "ఇది నాయపరాధము, ఇది నాదోషము" అని యంగీకరించు నంత పర్యంతము దోషములనుండి విమోచనము నందనేరఁడు. వాఁడు దోషమును విడిచిపుచ్చఁ గలిగినపుడే దోషాచ్ఛాదితమయి యుండిన పరమసత్యముయొక్క జ్ఞానమును బడయఁ గలుగుచున్నాఁడు.

స్వర్గీయమగు నానంద మను ధనము లభింపుచుండియు నేత్రముల గోచరింపఁజాలదు. పరమార్థమునిమిత్తము కావింపఁబడు మౌనయుతమగు బలిదానమును, నహంకారసమన్వితమగు ప్రకృతియొక్క క్రమబద్ధమగు దైనికోత్సర్గమును దృగ్గోచరము కానేరవు. ఇట్టి యాత్మసమర్పణమున కెట్టి కృత్రిమ పారితోషికమును, జనసామాన్యమందుఁ గరతలధ్వనులచేఁ బ్రశంసయు లభింపనేరవు. ఇయ్యది ప్రపంచముయొక్క దృష్టికిఁ జాలసమీపముగ నుండువారి దృష్టికింటె గుప్తముగా నుండుచుండును. కారణ మేమన చర్మచక్షువు లహంకారసంహారముయొక్క యాధ్యాత్మిక సమరదృశ్య సౌందర్యమును విలోకింపఁజాలవు.

ఈయాత్మసమర్పణము పరులచేఁ జూడఁబడనపుడు దీని నాచరించుటచేఁ గలుగు ప్రయోజనము నయితము శూన్యమే యని భావింపరాదు. ఏతదాత్మసమర్పణముయొక్క విశుద్ధానందమయప్రకాశకిరణములు సమస్తమానవకోటికి హర్షము నొసంగుచుండును. దీని పరోపకారశక్తి సువిశాలమయి యెంతదూరమయినఁ జేరఁగలదు. మనుష్యులిద్దానిని వీక్షింపలేకున్నను గ్రహింపలేకున్నను దీనియొక్క నైసర్గిక ప్రభావము సమస్తమానవులపైఁ బ్రతిబింబితమగుచుండును. అహంకారమును నిర్మూలించుటకు హృదయాంతరాళమున నీ వెట్టి ఘోరయుద్ధముల నొనరింపుచున్నదియు, శాశ్వతమగు నాత్మవిజయము నిమిత్త మెంతగాఁ బ్రయత్నింపుచున్నదియు మనుష్యులు గ్రహింపఁజాలరు. కాని వారు నూతన పరివర్తనమునఁ బడసిన నీస్వభావమును స్నేహార్ద్రహృదయమును బవిత్రాశయములను సులభముగా గ్రహింపఁ గలుగుదురు. నీహృదయక్షేత్రమం దెట్టి భయంకరసంగ్రామము జరుగుచున్నదియు నాయుద్ధభూమియందు నీ కెన్నియాఘాతములు కలిగియున్నదియు, నాగాయములపై నీ వేమి యౌషధము నుపయోగింపుచుండునదియు, నాయౌషధముచే నీ కెట్టి విశ్రాంతి లభించినదియు గుర్తింపఁజాలరు; కాని తొల్లింటికంటె నీవు విశేష సౌఖ్యానందదాయకములగు శక్తిసామర్థ్యములను, శాంతమును, ధైర్యమును, బవిత్రమగు నాధ్యాత్మిక

శక్తిని మాత్రము సంపాదించి యున్నాఁడని స్పష్టముగా గ్రహింపఁగలరు. ఇంతకంటె శ్రేష్ఠమును, ప్రేమపాత్రమును నగు పారితోషికము మఱి నీకెచ్చోట లభింపఁగలదు ? ప్రేమయొక్క సౌరభపూర్ణములగు కార్యములు మానవుని కృత్రిమ ప్రశంసా సువాసనలేనిదిగ నాచరింపఁగలదు. అహంకార శూన్యమగు హృదయముయొక్క పవిత్రాగ్నిజ్వాలలలోఁ బ్రపంచముయొక్క కల్పితప్రశంసలు దగ్ధమయి భస్మావశేషములు కాఁగలవు. ప్రేమ తనకుఁ దానే పారితోషికము తనకుఁదానే యానందము. ఇంద్రియాదుల దుష్టచాంచల్యముచే బాధింపఁబడిన మనుష్యులకు విశ్రామస్థానమును, రక్షణమును విశ్వమునఁ గేవలమొక్క ప్రేమనుండియే లభించుచున్నవి.

అహంకార పరిత్యాగమును, సంపూర్ణజ్ఞానానంద ప్రాప్తియు నేదేని యొకవిశాలమగు మహత్తరకార్యాచరణముచే లభింపనేరవు. అవి విశ్వముయొక్క సామాన్యజీవితమందలి యల్పోత్సర్గములఁ జిటికి మాటికిఁ గావించుచుండుటచేతనే లభ్యములగుచున్నవి. నెమ్మదినెమ్మదిగాఁ గావింపఁబడునట్టి యాత్మోత్సర్గములమూలముననే సత్య మహంకారమును జయింపఁగలుగుచున్నది. ఈరీతిఁ బ్రతిదిన మహంకారమును జయించుచు దుష్టభావములను, నపవిత్రవాసనలను, భావప్రవృత్తులను దమన మొనరించునట్టి మనుష్యునిశక్తియు శౌచ

మును బుద్ధియు ననుదినప్రవర్ధమానములయి వానిని గ్రమముగా సత్యానందమును సమీపింపఁ జేయఁగలవు.

మానవుఁడా! నిత్యమును, సత్యమును నగు బ్రహ్మానందమును, తత్ప్రకాశమును, నీవు నీబాహ్యమందుఁగాని, దూరమందుఁ గాని భ్రాంతికి వశుఁడవయి యన్వేషింపకుము. దీనిని నీవు నీలోపలనే యన్వేషింపుము. నీవు నీకర్తవ్యపాలనము యొక్క సామాన్యములును, గుప్తములును నగు బలిదానములచే నీనిత్య సత్యమగు దివ్యానందమయమార్గమును బడయఁ గలవు. అప్పుడు నీవాత్మవిజేత వను ప్రతిష్ఠ నంది శాశ్వతానంద మూర్తివయి వెలయుచుండఁ గలవు.



## సప్తమ పరిచ్ఛేదము.



# సహానుభూతి.

నీ వెపుడేని నీ యాత్మను వీక్షింపఁదలంతువేని కఠినమును దీవ్రమును నగు దృష్టితో నవలోకింపుము; కాని పరులను జూచునపుడు విశేషమగు దయార్ద్రహృదయముతో నవలోకింపుము. ఊటనేలనుండి గడ్డి వెలువడునట్లు సామాన్యమానవుల ముఖమునుండి సదా దూషణవాక్యములును, నీతిశూన్యము లగు నుడువులును వెలువడుచుండును. సత్యభాషణమునకయి సర్వేశ్వరునిచేఁ బ్రసాదింపఁబడిన నీ శ్రీ ముఖమును బరుల దోష సంకీర్తనముచేతను, దుష్టభాషణమునను మలినముఁ గావించుకొనకుము. —ఇలాహ్వీలరు విలకాక్సు.

దుఃఖితులగు మనుష్యులను నీబాధ యెట్లున్నదని ప్రశ్నించుట నాపద్ధతి కాదు, నేను స్వయముగా దుఃఖితులను గాంచి దుఃఖితుఁడ నయి దుఃఖము ననుభవించుచుందును.

— వాలుహ్విటుమేను.

మన మాత్మదమనశక్తిని బడసిన కొలఁదియుఁ బరుల యెడ సహానుభూతిని గలిగియుండ సమర్థుల మగుదుము. నిరంతరః మనము మనయందే దయను గలిగియుండుచు మన హృదయములయెడనే సహానుభూతిని బ్రకటించుకొనుచు నుండినచోఁ బరులయెడ నేవిధమగు సహానుభూతిని వెల్లడింపఁ జాలము. మనము సదా మనప్రశంసను గుఱించియు, రక్షణమును గుఱించియు, నభిప్రాయమును గూర్చియు విచారించుకొనుచున్నచో నన్యులతోడఁ బ్రేమపూర్వకముగ వ్యవహరింప నేరము. పరులను గూర్చి ధ్యానమును గలిగియుండి నిజసౌఖ్యమును గూర్చి యంతగా ధ్యానమును గలిగియుండకుండుటనే మహాత్ములు సహానుభూతి యని వచించుచున్నారు. సహానుభూతి స్వసౌఖ్యమునకంటెఁ బరసౌఖ్యమునే మానవుని దృష్టిపథమున నెలకొనఁ జేయుచుండును.

పరులయెడ సహానుభూతిని గలిగియుండుటకుఁ దొలుత మన మవ్వారిస్థితిని గ్రహింపవలసి యుండును. మనము వారి వాస్తవికమగుదశను గుర్తించునిమిత్తము వారివిషయమునఁ దొలుతనుండియు దురభిప్రాయమును గలిగి యుండరాదు. మనము సదా నిష్పక్షపాతముతో వాని యథార్థమగు స్థితిని గ్రహింపవలసియుండును. మనము పరులయొక్క యాంతరికస్థితిలోపలకుఁ బ్రవేశింపవలయును. మనము వారి

వాస్తవికస్థితిని వారినేత్రములతోడనే వీక్షించి, వారియను భవమును సాంగముగా బరిశోధించి, గ్రహించి వారివలె నయిపోవు టావశ్యకము. నిస్సందేహముగ మనకంటె విశేష మగు బుద్ధిని, జ్ఞానమును సంపాదించి యున్నవారియెడ మన మీరీతి వర్తింపజాలము. మనకంటె నధమస్థితియం దున్న వారితో సయితము మన మీరీతి వర్తింపనేరము. కారణ మే మన సహానుభూతియు, స్వార్థమును నాకేస్థానమునం దుండ నేరవు. మన మేపాపములనుండియు, దుఃఖములనుండియు నవి రామమగు కృషిచే సాఫల్యమును సంపాదించియుంటిమో, అట్టి పాపవిషాదభరమునఁ గ్రుంగి కృశించుచుండు మానవుల యెడ విశేషమగు సహానుభూతిని వెల్లడింప సమర్థులమయి యున్నారము. ఏపురుషుని జ్ఞానానుభవము మనబుద్ధిబలమును మించియుండునో, అట్టి మహనీయుని మనము సహానుభూతి యొక్క మాటునఁ గప్పుచుచ్చి యుండఁజాలము, కాని మన యొక్క సహానుభూతి సేటికిని మనల బాధించుచున్న విషాద భయములనుండి విమోచనమును సంపాదించుటలో మహా పురుషులకును సహాయభూతము కాఁగలదు.

పక్షపాతమును, దురభిలాషలును సహానుభూతియొక్క విశాలమార్గమునఁ బ్రతిబంధకము లగుచున్నవి. అహంకారము సహానుభూతిపరిగ్రహణమునుండి సదా హృదయమును నిరో

ధింపుచుందును. పూర్వమునుండియు నెవ్వానియెడ నీహృదయమందు ద్వేషముకలదో వానియెడ నీవు సహానుభూతిని గలిగియుండఁజాలవు. ఏ మానవునియందయినఁ దొలుతనుండి నీహృదయమునం దీర్ష్య నెలకొనియున్నచో ఘోరవిపద్గ్రస్తుఁడవయియుండియు నీ వట్టివాని సహానుభూతి నపేక్షింపఁజాలవు. నీ వేమానవునియందుఁ దొలుతనుండియు జుగుప్స (ఏవగింపు) ను గలిగియుందువో వాని జీవితముయొక్క యథార్థతను స్పష్టముగా గ్రహింపఁజాలవు. పాశవికబుద్ధిచే నొక మానవునియం దీర్ష్యను గలిగియుందువేని నీవు వాని నెట్టిదీనదశయందుండగాఁ జూచినను విచారింపనొల్లవు. నీవు వానియెడ నీహృదయమం దెట్టిదుర్భావములను, దురభిప్రాయములను గలిగియుందువో వాని ననుసరించియే నీచే ద్వేషింపఁబడుచున్న వానియొక్క జీవితసత్యమును నిశ్చయింపఁ గలుగుదువు. నీవు నీయొక్క యశుద్ధమును, గారణశూన్యమును నగు నభిప్రాయము ననుసరించియే వానియందలి కీడును గ్రహింపఁ గలుగుదువు, కాని మేలు నావంతయు గుర్తింపనేరవు.

నీవు పరులయొక్క యథార్థతను గ్రహింప నభిలషింతువేని నీకును, బరులకును మధ్యగల వైమనస్యమును, స్వార్థమయభావములనుఁ, బక్షపాతమును విసర్జించివేయుము.

పరుల కార్యములకు నవాంతరములఁ గల్పింపకుము. వారి యభిప్రాయములను, విశ్వాసములను దూషితములని సిద్ధాంతీకరింపఁగడంగకుము. కొంతసేపు సమయమునకయినను నిన్ను నీవు దూరముగా నుంచుకొని పరులస్థితి నవలోకింపుము. కేవల మీరీతి నీవు సదా పరుల సహచరుఁడవయి వారిజీవిత చారిత్రమును, జ్ఞానానుభవమును సంపూర్ణముగా గ్రహింతువేని పరులను గాంచి యెప్పుడును దూషింపఁజాలవు. అన్యులను బాగుగా గ్రహించియుండకుండుటవలననే నీవు వారియుద్దేశ్యములనతిక్రమింపుచు, వారిని దూషించుటకేని సందేహింపకున్నాఁడవు. మనుష్యుఁడు విశుద్ధచారిత్రుఁడయి, ఆత్మవిజయమును బడయునందాక, పరులవాస్తవికస్థితిని గ్రహించుటయందు సమర్థుఁడగుటయు సంభవింపనేరదు.

వృద్ధియుఁ, బరిపక్వస్థితియు, వ్యాపనమును జీవిత మనఁబడుచున్నవి. ఒకవిధముగాఁ జూచినచో దురాత్మునందును, సదాత్మునందును—పాపియందును, పుణ్యాత్మునందును గేవలము శ్రేణియొక్కయుఁ, గ్రమముయొక్కయు భేదము తక్క విశేషమగు తారతమ్య మేమియుఁ గానరాకున్నది. పుణ్యాత్ముఁ డొకప్పుడు పాపాత్ముఁడే. పాపియు భవిష్యత్తునందుఁ బుణ్యాత్ముఁడు కావచ్చును. పాపాత్ముఁడు బాలుఁడు. పుణ్యాత్ముఁడు వృద్ధుఁడు. సదా యాటవస్తువులచేఁ గ్రీడింపు

చుండు వారనియు, జ్ఞానశూన్యులనియు, గురుజనాజ్ఞలను తిరస్కరించువారనియు భావించి, బాలకులనుండిదూరముగా నుండుచుండుపురుషునకును, పాపాత్ములను దుష్టులనిభావించి వారినుండి భేద మావంతయుఁ విముఖుఁడయి యుండు మనుష్యునకును గానరాదు.

జీవితము సమానమయినది. కాని చూచుటకు దీనికిని భేదము లనేకములు కలవు. పుష్పము వృక్షమునుండి భిన్నమగు పదార్థముకాదు. ఇది వృక్షముయొక్క విశేషాంగము; దళముయొక్క రూపాంతరము. బాష్పము జలమునుండి భిన్నమగు పదార్థముకాదు. అదియు సలిలముయొక్క మఱియొకరూపము. పుణ్యాత్ముఁడు సుపరిపక్వమయినట్టియుఁ, బరిణతుఁడయినట్టియుఁ బాపాత్ముఁడే.

అజ్ఞానకారణమున సశుద్ధకార్యప్రణాళికయం దభిరుచిని గలిగియుండు యపరిపక్వబుద్ధిసంపన్నుఁడే పాపాత్ముఁడు. విశుద్ధమును, సత్యమును, నిత్యమును నగు కార్యవిధానమునం దాసక్తుఁడయియుండు పరిపక్వధీయుతుఁడే పుణ్యాత్ముఁడు. ఒకపాపాత్ముఁడు మఱియొకపాపాత్ముని దూషితు నొనరించుచుండును. కారణమేమన దోషముల నెన్నుటయే కార్యముయొక్క యపరిశుద్ధవిధాన మనఁబడుచున్నది. పుణ్యాత్ముఁడు పాపాత్ముని దూషింపనొల్లఁడు. కతమేమన తానునయిత మొకప్పు

దట్టి నీచస్థితియందే యుంటినను స్మృతిని గలిగియుండుచుండును. కావున నతఁడా పాపాత్మునిఁ దనయనుజునిగను, ప్రియమిత్రునిగను భావించి వానియెడ గంభీరమగు సహానుభూతిని గలిగియుండుచుండును. కతమేమన సహానుభూతిని గలిగియుండుటయే కార్యముయొక్క విశుద్ధమును, బరమోజ్జ్వలమును నగు ప్రణాళికయయియున్నది.

సమస్తమానవులయెడ సదా విశాలమగు సహానుభూతిని గలిగియుండుచుండు పరిపక్వ బుద్ధియుతుఁడగు మహాత్మునకుఁ బరుల సహానుభూతితో నిమిత్తమేమియు నుండఁజాలదు. హేతువెద్దియన బాపసంతాపములను, దుర్భరవిషాదభయములను సంపూర్ణముగా జయించి నిరంతర బ్రహ్మానందనిమగ్నుఁడయి యుండుచుండును. దుఃఖితులకుఁ బరుల సహానుభూతి యత్యంతాపేక్షణీయమయి యున్నది. పాపములఁ గావించువారలవశ్యము క్లేశముల ననుభవింపఁగలరు. మానసికమును దైహికమును నగు ప్రతిపాపమునకు మారుగా దుఃఖము నవశ్యము ననుభవింపవలసియుండునని విశ్వసించు మనుష్యుఁడు పరులదోషముల నెన్నుటను విసర్జించివైచి, పాపసంభూతములగు దుఃఖములకు గురియగుచున్నవారలఁ గాంచి, మహోదారమగు సహానుభూతిని వెల్లడింప నారంభించును. మనుష్యుఁడు తన్ను విశుద్ధునిగను, బవిత్రచారిత్రునిగను జేసికొనఁగలిగినపుడే తా నీరీతి భావింప నారంభించును.

మనుష్యుఁడు తనస్వాంతముయొక్క సమస్తవికారములను సంస్కరించుకొని, స్వార్థమయవాంఛలఁ బరిమార్చి, క్రూరాహంకారముల పాదదళిత మొనరించివైచినంతనే సమస్తవిధములగు మానవానుభవములను ననగా సకల పాపదుఃఖశోకభయోద్వేగ్యములను సంపూర్ణముగాఁ గెలువనేర్చి పవిత్రమగు ధర్మనీతిని స్పష్టముగా, సాకల్యముగా గ్రహింప సమర్థుఁడగుచున్నాఁడు. తన పవిత్ర్యాదయముయొక్క విశుద్ధమగు దృష్టితోఁ బరులఁ జూడనేర్చిన వ్యక్తి, వారల నవశ్యము కరుణాపాంగముల వీక్షింపఁ సమర్థుఁడగుచున్నాఁడు. అతఁడు పరులను దనదేహముయొక్క భాగముగనే భావింపుచుండును. ఆకరుణామూర్తి స్వప్నమందేని పరులను బ్రతేకదృష్టితో నవలోకింపనొల్లక పతితులుగ భావింపక వారి విషయమం దీరీతిఁ దలపోయుచుండును. "నే నేరీతిఁ దొలుతఁ బాపాచరణమున కియ్యకొంటినో, ఆచందముననే వీరును బాప మాచరింపుచున్నారు, క్లేశముల చే నేపగిది ననుభవించియుంటినో, ఆవడువుననే వీరు నయిత మనుభవింపుచున్నారు, నే నేభాతి నంతమునకు శాంతి సౌఖ్యమును సంపాప్తింపఁ జేసికొనియుంటినో, వీరును నట్టి చిరశాంతి సంపాదింపఁ గలరు."

అజ్ఞానమునకుఁ గారణభూతమయి, కలుగనున్న దుఃఖమును రహస్యముగఁ గప్పివుచ్చియుంచి పాపాత్మునిఁ దారాక్క

లికముగ సుప్రసన్న చిత్తుని గావింపుచుండు పతితుని చారిత్ర్య మందలి నిగూఢ పాపమును గ్రహించునట్టియుఁ బరులదోష ములలెక్కింప నట్టియు, సమస్త జనులయెడ సహానుభూతిని గలిగి వర్తింపుచుండు నట్టియుఁ, బ్రబలమగు పక్షపాతమును గలిగి యుండనట్టియు మనుజుఁడే యథార్థమగు సజ్జనుఁడు; ధీమంతుఁడు.

మానవుని బుద్ధి యెంతవఱకు వ్యాపింపఁగలదో, అంత దనుక మనుష్యుఁడు తన సహానుభూతిని విస్తరింపఁజేసికొన కలుగుచున్నాఁడు. అతఁడెన్ని ప్రయత్నము లొనర్చినను బుద్ధిని మించిన సహానుభూతిని, సంపాదింప నేరఁడు. మనుష్యుఁడు దయార్ద్రహృదయుఁడును, వినయశీలుఁడును నగుచున్న కొలఁదియుఁ దనబుద్ధి నభివృద్ధి గావించుకొన సమర్థుఁ డగును. సహానుభూతి సంకుచితమగుటచే మానవహృదయ మును సంకుచిత మగుచున్నది. సంకీర్ణమగు నంతఃకరణముచే జీవనజ్యోతి దూషితమయి మానవుని సౌఖ్యమును నశింపఁజేసి వేయఁగలుగు చున్నది. సహానుభూతిని విస్తృత మొనరించు కొనుటయందే మానవుని జీవితము ప్రతిభాసముపేత మయి, ప్రకాశవంత మయి హర్షాబ్ధి నోలలాడఁగలదు. అట్టి యుత్త మజీవిత సంపన్నుఁడగు వ్యక్తియే జనసామాన్యమున కానంద మయమును, బ్రకాశభాసురమును నగు భవసంతరణ మార్గ మును బ్రదర్శింపఁ గలుగుచున్నాఁడు.

పరులయెడ సహానుభూతిని గలిగియుండుట పరుల దేహములను దన దేహముతో నేకీభవింపఁ జేసికొనుటవంటిది. సమస్త జీవకోటియెడ యథాశక్తి సమానభావమును గలిగి యుండుటయే శ్రేయస్కరము, కారణమేమన స్వార్థశూన్యమగు ప్రేమచే నతిశీఘ్రముగ నైకమత్యమందయింపుచున్నది. సమస్త జీవరాసులయెడ స్వార్థశూన్యమగు ప్రేమను గలిగి యుండి వానియన్నింటియందుఁ దన్మయుఁడయి యుండు మనుష్యుఁడు ప్రపంచముయొక్క సర్వవ్యాపకమగు ప్రేమను, నీతిని, బుద్ధిని గ్రహింపఁ గలుగుచున్నాఁడు.

పరులను దన సహానుభూతినుండి దూరముగా నుంచు చున్నంతపర్యంతము స్వర్గము, శాంతి, సత్యము మానవుని సమీపించనేరవు. అతని సహానుభూతి సమాప్తమయిన సీమ యందే ఘోరాంధకారము ను దుఃఖమును, భయంకరోపద్రవ ములును బ్రారంభము లగుచున్నవి. కారణమేమనఁ బరులను దనప్రేమనుండి దూరముగా నుంచుట యన మనుష్యుఁడు తన్నుదా నిర్మల ప్రేమానందమునుండి దూరమొనరించు కొనినవాఁడయి స్వార్థముయొక్క ఘోరాంధకారమయమగు కారాగారమునఁబడి క్షీణించుటయే యని గ్రహింపఁదగును.

మానవుని సహానుభూతి యపారమయినపుడే వానికి సత్యముయొక్క యనంతమగు ప్రకాశము దృగ్గోచరము

కాఁగలదు. అసీమమగు ప్రేమయందే పాగములేని నిర్మలానందము నెలకొనియున్నది.

సహానుభూతియే ఆనందము. ఇందు సర్వోత్తమంబగు నిర్మలానందము దృష్టిగోచరమగుచున్నది. సహానుభూతి నర్జీయము, కలిమేమన నిద్దాని ప్రకాశమందు సమస్తవిధములగు స్వార్థమయభావములు నష్టమయిపోవ నెల్లరతోడ నైక్య భావము ననగా నాధ్యాత్మికసమత్వముయొక్క సుదృఢ సాంగత్యమును గలిగియుండుటచే నత్యంతపవిత్రమగు బ్రహ్మానందము లభించుచున్నది. మనుష్యుఁడు సహానుభూతిని గలిగియుండుటను విసర్జించినంతనే వానిజీవితము, దృష్టి, జ్ఞానము వృథా యగుచున్నవి.

మానవుఁడు పరులయెడ స్వార్థమయ భావములను గలిగియున్నంత దనుక వారియెడ యథార్థమగు సహానుభూతిని గలిగియుండఁజాలఁడు. వాస్తవికమగు సహానుభూతిని గలిగియుండు వ్యక్తి పరులను వారి నిజస్థితియందున్నరీతి నవలోకింపఁ బ్రయత్నమొనరించుచు, వారి విశేషములగు పాపములను, వాసనలను, దుఃఖములను, విశ్వాసములను, బక్షపాతములను గ్రహింపఁ జూచుచుండును. అతఁడంతియునకుఁ బరులాధ్యాత్మికాభివృద్ధియం దెంతవరకు సఫలత నందినదియు, వారియనుభవ మెంతవరకున్నదియు, వారు తమదశ నిర్ధు

పరివర్తన మొనరించుకొనఁగలుగు నదియు, లేనిదియు స్పష్టముగా గ్రహింపఁ గలుగుచున్నాఁడు. జనులు తమకుఁగల జ్ఞానము ననుసరించియే విచారింపుచుఁ గార్య మొనరింపుచుందు రని యాతఁడు గ్రహించును. వారి హీనబుద్ధియు, జ్ఞానమును బ్రశస్తములగు నుదాహరణముల మూలమున సాహాయ్యమును, నభివృద్ధిని బడయుచుందు రనియుఁ, గాని తత్క్షణము వారు సంపూర్ణమగు పరివర్తనమునకుఁ బాల్పడఁ జాల రనియు నతఁడు గుర్తింపుచుండును. వివేకము, ప్రేమ, దయ, శ్రద్ధ, సహానుభూతి యను గుణములు వృద్ధియగుటకును, వికసించుటకును సమయ మావశ్యకమయి యున్నది. కాలవ్యవధితోఁ బాటు తత్సద్గుణ సుమనోవికాసమున కయి యార్ద్ర్యమాధుర్యములను వంధ్యశాఖలను దత్క్షణమే ఖండింప వలనపడదు.

ఇట్టి దయామయుండగు సత్పురుషుఁడు తనతోఁ బరిచయమును గలిగియున్నట్టి సమస్తమానవుల యాభ్యంతరిక జగత్తుయొక్క ద్వారము నన్వేషింపుచున్నాఁడు, అతఁడు ఆద్వారమును గనిపెట్టి దానిని దెఱచి, లోనఁ బ్రవేశించి వారి జీవిత మందిరమున నివసింపుచు వారెల్లరతోడ నైక్యమును బొందుచున్నాఁడు. అపు డతనికి ధిక్కరించుటకును, గ్రోధించుటకును, నీర్ష్యనువహించుటకును నెట్టిస్థానమును లభింపకపోవుటచే వాని హృదయమందు విశేషమగు ననుకంపయు, ధైర్యమును, బ్రేమయు నుదయింప నారంభింపుచున్నవి.

అప్పుడతఁడు తన్ను సర్వమయునిగఁ జూడ నారంభించుచు సకలమానవులను ఇతర దేహములనియుఁ, వారిప్రకృతులు తన స్వభావమున కనుగుణ్యము లయినవనియుఁ, కేవల మవ్యాప్తియందు న్యూనాధికభావముయొక్క తారతమ్యము మాత్రమే కలదనియు భావింపఁజొచ్చును. అతనికి ఇతరుల హృదయములందుఁ బాపప్రవృత్తులు పనిసేయుచున్నట్లు గోచరించినచోఁ దత్క్షణమే యతఁడు తన హృదయమును నామానసమందునఁగూడ నట్టి దుష్ప్రవృత్తులు లేవుకదా యని నిత్యము పరీక్షించుకొనుచుండును. అట్టిపరీక్షయందు దలచి పవిత్రాంతఃకరణము 'మహాత్మా! నీ వెట్టిపాపము నాచరించియుండలేదు. కావున భీతిల్లకుము' అని గంభీరముగఁ బ్రత్యుత్తరము నొసంగుచుండును. ఆ సత్పురుషుఁడు పరులయందుఁ బుణ్యప్రవృత్తిని వీక్షించిన డ హర్షితస్వాంతుఁడయి యిప్పటికిని విశేషమగు శక్తిని బడసి పరిపక్వస్థితిని సముపార్జించియుండునట్టి తన మానసమందట్టి పుణ్యప్రవృత్తి కలిగినదా లేదా యని దీర్ఘముగ విచారించుచు [illegible]దిన మద్దాని ప్రాప్తికయి కృషిసలుపుచుండును. ఒకనిపాపము సమస్తజనులపాపము. ఒకరిపుణ్యమెల్లరసుకృతము. ఒక మనుష్యుఁ డితరమనుష్యులనుండి భిన్నముగా సృజింపఁబడి యుండలేదు. ప్రకృతియొక్క భేదమేమియులేదు, కేవలము స్థితియొక్క తారతమ్యమే కానవచ్చుచున్నది. మానవుఁ డెవఁడయినఁ దనకంటెఁ బవిత్రుఁడుగఁ

నున్న యొకవ్యక్తినుండి తన్ను భిన్నముగా భావించినచోఁ గేవల మది యతని యజ్ఞానమే యగును. వాస్తవమాలోచింప గర్భదరిద్రుఁడును సార్వభౌమునినుండి భిన్నమగు పదార్థము కాడు. మనుష్యత్వమంతయు నభేదమయినది. సహానుభూతియొక్క పవిత్రమందిరమందుఁ బుణ్యాత్ములును, పాపాత్ములును సమావేశమయి సంక్షుభితవించుచున్నారు.

మహాప్రభువగు జీసనునుగూర్చి బైబిలువంటి పవిత్రమతగ్రంథ మీరీతి నుడువుచున్నది. "ఆమహానుభావుఁడు సకల ప్రపంచముయొక్క పాపభారమును దన భుజస్కంధములపై వహించెను. అతఁడు సోదరమానవులగు పాపాత్ముల నెల్లర నుండి తన్ను బ్రత్యేకవ్యక్తిగ భావించియుండలేదు. దయానిధి యగు నతఁడు పాపులలోఁ దన్నొకనిగ భావించుకొనియెను. సకలజీవరాసులతోడ నతనికిఁగల యిట్టిసమభావ మతని జీవితమందు సమస్తమానవులకు స్పష్టముగ గోచరించెను. భయంకరపాపములయొక్క కారణముచే జనసామాన్యముచే విసర్జింపఁబడిన మహాపాపుల నెల్లర దయామయుండగు జీసను గాఢాలింగన మొనరించుకొని, వారి యవనతికయి దుఃఖాశ్రువుల రాల్చుచు వారియెడ బ్రగాఢమగు సహానుభూతిని వెల్లడించెను. ఆ మహనీయుఁడు లోకకల్యాణము నిమిత్తము దుర్భరకష్టముల ననుభవించి తుదకుఁ దనప్రాణములను సయితము బలిదానముఁ గావించెను"

ఎల్లరికంటె సహానుభూతి యెవ్వానికి విశేష మావశ్యక మయి యున్నది? పుణ్యాచారితుండును, ధీరుండును, జ్ఞానియు, మహాత్ముండును నగు వ్యక్తి ప్రత్యేకముగా సహానుభూతిని సంపాదింప వలసిన యవసరము లేదు. జ్ఞానశూన్యుండును, ఫలింప నట్టి పాపమును గలిగియున్నట్టి మనుష్యుండును ముఖ్యముగా సహానుభూతిని సంపాదింప వలసియున్నది. మానవుండు పాపాత్ముండయిన కొలంది యము దుఃఖితుండు కావలసివచ్చుచుండును. పాపవిషాద విమోచనమునకు సహానుభూతియే దివ్యమగు సాధనము. జీసను ప్రభువు ఈ విషయమయి యొక్కచో నీరీతి వచించియున్నాడు:—"నేను పుణ్యాత్ములకొఱకు భువి నవతరించి యుండ లేదు. పాపులను వారి పాపాచరణమునకయి పశ్చాత్తాపతప్తులంగావించు నిమిత్తమే యిహమున కేతెంచి యున్నాడను." జీసను ప్రభువుయొక్క శుభవచనములచే సహానుభూతి పుణ్యాత్ముల కనావశ్యకమనియు, పాపుల కత్యంతావశ్యకమనియు స్పష్టపడుచున్నది. దీర్ఘకాలపర్యంతము దూషిత కార్యములచే భయవిషాదముల ననుభవింపం బాపసంచయ మొనరించునట్టి మానవునకే ముఖ్యముగా సహానుభూతి యపేక్షణీయ మయియున్నది.

ఒకవిధమగు పాపకర్మ నాచరించు మనుష్యుండు మఱొకవిధముగనున్న పాపము ననుష్ఠించువ్యక్తిని నీచునిగను, ఘోరాపరాధిగను భావించుచున్నాండు. వాండు తనయొక్క యు,

మతియొకనియొక్కయుఁ పాపములు భిన్నవిధము లయి యున్నను దుద కన్నియు నొక్కటియేఁ యని గ్రహింపజాలఁడు. వాఁడు సమస్తవిధములగు పాప లోకమే యనియు, కేవలము వానియొక్క రూపములందే భేదము కలదనియు విచారింప కుండును. మానవుఁడు తా నెంత పాపాత్ముఁడో, పరులు నయిత మట్టి పాపాత్ములే యని నిర్ణయించుచుండును. వానికి సత్యజ్ఞానము కలిగినంతనే పాపమునుండి విముఖత్వమును బడయ యత్నించుచున్నాఁడు వాఁ డెట్లానరించి పరులను సయితము పాపాత్ములని నుడువనొల్లక యుండు సమస్తజనులయెడ సంపూర్ణమగు సహానుభూతిని వెలిడింప నారంభించుచున్నాఁడు. ఇంద్రియదాసులును, పాపాత్ములును నగు మనుష్యులు పరస్పరము దూషించుకొను చుండుటయు, గర్హించుకొనుచుండుటయు సృష్టియొక్క స్వాభావికనియమ మయినది. సమస్త జనులచే దూషింపఁబడుచు, గర్హింపఁబడుచు నున్న భ్రష్ట మానవుఁడు లోకమునొక్క ధిక్కారమును మంచిగ భావించి నా యపరాధముల వలననే లోకము నన్ను నిందించుచున్నది కదా యని విచారించుచున్నచో నవశ్య మతని కత్యద్భుతమగు నున్నతమార్గము లభింపఁగలదు. వాఁ డంత బరులదోషముల లెక్కించుటను విసర్జించివేయుచున్నాఁడు.

యథార్థముగ సజ్జనుఁడగు మనుష్యుఁడు పరనిందకుఁ గడంగ నొల్లఁడు. ఇట్టిమనుష్యుఁడు స్వార్థపరత్వమును, నంధ

ప్రియమగు నుద్వేగమును దూరమొనరించివైచి, ప్రేమను, శాంతిని, గలిగియుండి సమస్తవిధములగు పాపములను, దత్సంభూతములగు దుఃఖక్లేశములను స్పష్టముగా గ్రహింపఁగలుగుచున్నాఁడు. వాఁడు నిద్రనుండి మేల్కాంచి, జ్ఞానప్రకాశమును బడసి, స్వార్థమును విసర్జించి సమస్తమానవలోకముయెడ నిర్మలమగుసహానుభూతిని గలిగియుండుచున్నాఁడు. ఇట్టి మానవోత్తముని మూర్ఖులు దూషించినను, ద్వేషిగ నిశ్చయించినను, నసహ్యించుకొనినను వాఁడు కోపమును జెందక కీడునకు మాఱుగా నెల్ల నుపకారమొనరించుచు వారియెడ సంపూర్ణమగు సహానుభూతిని బ్రకటించుచున్నాఁడు. అతఁడట్లు తనకపకారమొనరించువారికిని మేలుసేయుచు "ఈమానవులు తమహృదయమందిరముల వ్యాపించియున్న గాఢాజ్ఞానాంధకారముయొక్క కారణమున నన్ను ద్వేషించుచున్నారు, ఇందుచే నా కేమియు నష్టము లేదు. వీర లవశ్యము తమ దుష్కర్మలయొక్క ఫలితము ననుభవింపఁగలరు." అని భావించుచుండును.

ఆత్మదమనము, జ్ఞానవృద్ధి యను సద్గుణసాధనములచే ద్వేషించువారిని క్షమించువిధము నభ్యసింపఁదగును. మానసుఁడా! నీ వెపుడును బరులొనరించు కీడువైపునకు నీదృష్టిని బ్రసరింపఁ జేయకుము, సదా నీహృదయమునే పరిశీలించుకొనుచుండుము. అట్లు పరిశోధించుకొనుచుండుటచే నీ

స్థూలదృష్టికిఁ గానరానట్టి దోషములెన్నియో నీవిజ్ఞాననేత్రమునకు గోచరింపఁగలవు. నీవు నిజదోషములను, స్వీయాపరాధములను గ్రహింప నారంభింతువేని, పరులను నిందించు దురభ్యాసమును విసర్జించి నిన్ను నీవే ధిక్కరించుకొనుచుండఁగలవు. సామాన్యరీతిచేఁ జెప్పఁబడు సహానుభూతి వాస్తవికమగు సహానుభూతి కానేరదు, కాని యది యొక విధమగు దైహికస్నేహము. మనయందు స్నేహాతిశయమును వెల్లడించు వారిని మనముసయితము ప్రేమించుట మనుష్యునియొక్క స్వాభావిక ధర్మమయియున్నది. కాని మనయం దెట్టి స్నేహమును గలిగియుండక, ద్వేషింపుచుండునట్టి వారియెడఁ జూపఁబడు నిర్మలమగు స్నేహమునే పవిత్రమగు సహానుభూతి యని నుడువు టుచితము.

సహానుభూతియొక్క యావశ్యకతయే దుఃఖక్లేశములకు ముఖ్యకారణము. దుఃఖము ననుభవించియుండని ప్రాణియే భూతలమున లే దని చెప్పవచ్చును. దుఃఖమునుండియే సహానుభూతి యుదయించియున్నది. ఒక్కసంవత్సరమందుగాని లేక యొకజీవితకాలమందుగాని మానవహృదయము దుఃఖముల ననుభవించి పవిత్రమును, స్వచ్ఛమును గానేరదు, కాని చీటికి మాటికి భువిపై జన్మింపుచు దుఃఖమునందియే మనుష్యుఁడు తన స్వానుభవముయొక్క సువర్ణమయఫలితమును బడయు

చున్నాఁడు. అతఁడు తత్ఫలితముగఁ బ్రేమ, జ్ఞానము లను మహాజ్జ్వలరత్నములఁ బ్రాప్తింపఁజేసికొనుచున్నాఁడు. ఈ చందమున జన్మజన్మాంతరములకుఁబిదప రహస్యమును గుర్తించి మనుష్యుఁడు సహానుభూతిని దగ్గఱకుఁ జేరఁదీయుచున్నాఁడు. నియమోల్లంఘనమే మహాపాపము. మనుష్యుఁ డజ్ఞానముచే నియమముల నతిక్రమించుచున్నాఁడు. పాపమే క్లేశము. ఒక పాపమునే మాటి మాటి కొనరించుటచేఁ దత్ఫలితమగు క్లేశమును మానవుఁడు చీటికి మాటికి ననుభవింప బాధ్యుఁడగుచున్నాఁడు. వాఁడీరీతిఁ బదేపదే కష్టముల ననుభవించి, తన్నియమముయొక్క జ్ఞానమును బొందుచున్నాఁడు. వాఁడు జ్ఞానమును బడసినంతనే వానిహృదయసరోవరమునం దుదయించియున్న పవిత్రమును, సుందరమును నగు సహానుభూతి యను వారిజము వికసింపఁ గడంగుచున్నది.

దయయు, సహానుభూతియొక్క యొక యంశమే. ప్రపంచమందు దుఃఖితులయొక్కయు, విపద్గ్రస్తులయొక్కయు విషాదభయములఁ దూరమొనరించి వారికి ధైర్యమును గలిగింప దయయే యుత్తమోత్తమంబగు సాధనరాజముగ నున్నది. "దయ, శక్తిహీనులనిమిత్తము ప్రపంచమున శిరీషకుసుమకోమల మొనరించుచున్నది, శక్తిసంపన్నులకొఱకు విశ్వమును సమున్నతము గావించుచున్నయది."

క్రౌర్యమును, కృపారాహిత్యమును, ద్వేషారోపణమును, క్రోధమును, తొలఁగించుటచే దయ వర్ధిల్లుచున్నది. ఒకానొకపాపాత్ముని స్వయంకృతాపరాధముయొక్క భయంకర ఫలితము ననుభవించుచుండఁ గాంచి కఠినహృదయుఁడు "ఈ దుర్మార్గుఁడు తనపాపమున కుచితమగు ఫలము ననుభవించుచున్నాఁ" డని వచించు మనుష్యుఁడు దయార్ద్రహృదయుఁడై దయారసముచే దుఃఖితుల హృదయతాపము నుపశమింపఁ జేయనేరఁడు. మనుష్యుఁడు ప్రాణికోటిపైఁ గఠినమగు బుద్ధి వహించుచు యథోచితముగ నుండు సహానుభూతిని వెల్లడింపకుండ నుండుచున్నప్పుడు ఆ కఠినహృదయము సంకీర్ణమయి, వాని యానందమును క్షీణింపఁ జేయుచు వాని హృత్సీమయందు దుఃఖబీజముల నాటుచుండఁగలదు.

తనకంటెఁ బరులయొక్క ప్రశస్తతరమగు విజయమును గాంచి సంతోషింపుచు నాసాఫల్యమును స్వకీయముగనే భావించు పరోన్నతిని సహించుబుద్ధియే సహానుభూతియొక్క ద్వితీయాంగము. తనశత్రువులయొక్క కల్యాణసుస్థితిని గాంచి సంతోషించునట్టియు, ద్వేషమునుండియు, ఈర్ష్యనుండియు, జుగుప్సనుండియు విముక్తుఁడయినట్టియు మనుష్యుఁడు నిస్సందేహముగ సుస్వభావుల ధన్యుఁడు.

తనకంటె హీనతరములును, క్షుద్రములును నగు ప్రాణుల రక్షించుట వయితము సహానుభూతియొక్క యొక

యంగమయి యున్నది. నోరెఱుంగని జంతువులయొక్క సంరక్షణము నిమిత్తము విశేషముగ సహానుభూతి యపేక్షింపఁబడుచున్నది. దీనుల రక్షణమే శిక్షణము (దండనము) కంటె శక్తియొక్క శోభను వృద్ధిఁ గావించుట కుత్తమసాధనమయి యున్నది. క్షుద్రజీవసంరక్షణమున నే మానవజీవితము చరితార్థమగును గాని జీవహింసచే నెప్పటికిని గానేరదు.

జీవితములన్నియు నొకటియే. క్షుద్రాతిక్షుద్ర మగు ప్రాణిసయితము మహాప్రాణినుండి శక్తియొక్కయు, బుద్ధియొక్కయు న్యూనతాధిక్యములయందుమాత్రము భిన్నముగా నుండుచుండును. తదితరవిషయములన్నిటియందు జీవులన్నియు సమానములే. మానవుఁడు దయార్ద్రహృదయుఁడయి జీవసంరక్షణమునకుఁ గడంగినచో వాని సంపదలును, సౌఖ్యానందములును దినదినాభివృద్ధి నందఁగలవు. దీనికి విపరీతముగా మనుజుఁడు వివేకమును బాసి కఠినబుద్ధిచేఁ బ్రాణికోటికి దుఃఖక్లేశముల నొదవింపుచున్నచో వాని యైశ్వర్యమడుగంటి పోఁగలదు. వాని సౌఖ్యానందము లంతర్హితములయి పోఁగలవు. ఒకప్రాణి మఱొకప్రాణిని సంహరించి భుజింపుచున్నను, ఒకయుద్యోగము మఱొక యుద్యోగమును నష్టమొనరింపుచున్నను మానవుఁడు వానితో నిమిత్తము లేక సాత్త్వికప్రకృతిని సంపాదించిన హితమును బడయఁ

గలఁడు. సాత్వికస్వభావమును మనుష్యుఁడు దయ, దాక్షిణ్యము, ప్రేమ, సహానుభూతి, స్వార్థత్యాగము మొదలగు పవిత్ర కర్మలవలననే వృద్ధిగతమును, సురక్షితమును, బరిపక్వమును జేసికొనఁగలుగు చున్నాఁడు.

మనుష్యుఁడు తాను పరులయెడ సహానుభూతిని వృద్ధిఁ గావించుచుఁ దనయెడఁ బరులహృదయములందు నత్యధికమగు సహానుభూతిని గలిగింపఁ జేసికొనుచున్నాఁడు. పరులయెడ వెల్లడింపఁబడు సహానుభూతి వ్యర్థముగా నేరదు. అధమప్రాణి సయితము సహానుభూతియొక్క స్వర్గీయస్పర్శచేఁ గృతజ్ఞతను వెల్లడింప నారంభించుచున్నది, కారణ మేమన సహానుభూతి సకలప్రాణికోటిచే సులభముగా గ్రహింపఁబడు నొక విశ్వవ్యాపక మగు భాష. అమెరికాయందలి డారటమూరు నగరముయొక్క పరమ దుర్మార్గుఁడగు నేరస్థుఁడు తన యసంఖ్యాకములగు నపరాధములచే వివిధనగరములందు రమారమి నలుబదివత్సరములకాలము కారాగారబద్ధుఁడయి యుండెను. సమసజనులు వాని నొక ఘోరహంతకునిగను, భయంకర పిశాచముగను భావించుచుండిరి. చెరసాలలందుండు ప్రభుత్వోద్యోగియు లతని సంస్కరణమం దావంతవిశ్వాసమునయినఁ గలిగి యుండఁజాలకుండిరి. ఒకదివసమం దాధూర్తుఁడు బంధింపఁబడుచున్న చెరసాల

యొక్క గదియం దొకవ్యాధిపీడితమును, శల్యావశిష్టమును, క్షుధార్తమును నగు మూషికము వ్యాకులహృదయముతో నటు నిటుఁ బర్వెత్తెను. దానియొక్క యసహాయస్థితిని, దుర్బల దేహమును గాంచి యా పాపాత్ముని హృదయమందు సంవృతము దయయొక్క విద్యుచ్ఛక్తి సంచరింపఁ దొడంగెను. వాఁ డంతఁ దన స్థితియు, నా చిట్టెలుకయొక్క దశయు నొక్కరీతిగనే యున్న దని గ్రహించి దానియందు విశేష మగు సహానుభూతిని వెల్లడింప నారంభించెను. వాఁ డా చిట్టెలుకకుఁ దన బూట్సు (పాదరక్షలు) నందు నివాసస్థాన మొసంగి దాని కనుదినము తన భోజనపానములనుండి కొంతభాగము నొసంగుచు వచ్చెను. ఏ యత్యంతనీచమును, కఠోరమును, మానవభయంకరమును నగు రాక్షసహృదయమందు మానవలోకము యెడ దయాదాక్షిణ్యములకు స్థానము లేకుండెనో, ఆ దుష్టహీనహృదయమందే క్షుద్రజీవ మగు మూషికమువలన సహానుభూతియొక్క స్వర్గీయజ్యోతి దేదీప్యమానముగఁ బ్రజ్వరిల్లెను. తనకంటె శక్తిహీనులయెడ వానిహృదయమందు దయయు, ప్రేమయు వర్ధిల్ల నారంభించెను. తనకంటె నధికమగు శక్తిసంపన్నులయెడ వాని హృదయమం దుండిన ద్వేషాగ్ని యుపశమింపఁ జొచ్చెను. వాఁడంతఁ గారాగార నిరీక్షకులయొక్క యాజ్ఞాపాలనమందు సంపూర్ణముగా దక్షుఁ డయ్యెను. అమెరికా ప్రజాసామాన్య మవ్వాని కఠిన మగు

హృదయ మెట్లు దయార్ద్రమయ్యెనా యని యబ్బురపడ నారంభించెను. అంత వానియాకృతియు మార్పునందెను. నేత్రములయొక్కయు, నధరములయొక్కయు భయంకరస్థితి క్రమముగాఁ దొలంగిపోవ నాస్థానమందు మార్దవమును, ప్రేమయుఁ బ్రకాశింపఁ దొడంగెను. ఇపు డతఁడు పరమదుర్మార్గుఁడగు నేరస్థుఁడుగ నుండలేదు. అతనికి సంపూర్ణమగు ప్రాయశ్చిత్తమగుడు వానిమానసము పుణ్యమందు సంలగ్న మయ్యెను. అంతమున కీసమ స్తవృత్తాంతము ప్రభుత్వకర్మచారుల కెల్లరకు స్పష్టపడియెను. వా రంత వానిని స్వతంత్రుని గావించివైచిరి. వాఁడు కారాగారమునుండి వెడలిపోవునపుడు తనవెంట నా మూషికమును సయితము తీసికొనిపోయెను.

ఈచందమునఁ బరులయెడ సహానుభూతిని వెల్లడింపుచుండుటచే స్వయముగాఁ దద్భండారము మన హృదయములయందు వృద్ధినంద మన జీవితములు సఫలములు కాఁగలవు. సహానుభూతియొక్క దానముచే నానంద పారితోషికము లభింపుచున్నది. సహానుభూతియొక్క దానము నొసంగకుండుటచే మన యానందము నష్టమయిపోవుచున్నది. మనుష్యుఁడు అధికమగు సహానుభూతిని గలిగియుండుకొలఁదియు వానిజీవితమాదర్శప్రాయమయి సత్యానందమయస్థితికిఁ బ్రాపింపఁ గలదు. మానవుని హృదయము తనయందు నిర్దయాభావము

లకును, గటువిచారములకునుస్థానమొసంగక కోమలత్వ
మును, మాధుర్యమును పెంపొందింపఁజేసికొనుచున్నకాలఁ
దియు, వాఁడు సులభముగా నాత్మవిజేత కాఁగలిగి బ్రహ్మా
నందసాగరమున నీదులాడచుండఁగలఁడు.

---

# సప్తమ ప్రకరణము.

---

## సహనము.

సహన మనఁగా నోర్పు. ఓర్పు మానవజీవితమునం దొక ప్రశస్తమగు సద్గుణము. జీవితాభ్యుదయమం దోరిమిచేఁగలుగు ప్రయోజనము లనంతములు. గతించిన ప్రహారములనుగూర్చి సంస్మరించుటచే మానసికాంధకార మేర్పడుచున్నది ప్రహారములకు హేతుభూతులయినవారిపైఁ గక్ష వహించి పగఁదీర్చుకొన విచారించుటకంటె నాత్మఘాతము వేఱొండులేదు. ఓర్పు నవలంబించుటనుగూర్చి విచారించుటయే మానసికప్రకాశమున కారంభము. క్షమావలంబన చింతనమే శాంతిని, సౌఖ్యమును సంపాదించుట కుత్తమమగు సాధనము. పరజనకృతములగు నపకారములను, విఘాతములను, బ్రహాస్తములను, ననుగ్రహములను, గటాక్షములను సదా చింతించుచుండునట్టి మనుష్యునిచిత్తమందు శాంతి నెల కొనియుండఁజాలదు. తనతోడఁ బరు లనుచితముఁగ వర్తించి నా రని భావించునట్టియుఁ, దన శాత్రవులఁ బరాభూతులఁ

గావింప వివిధములగు కృత్రిమప్రయోగముల నన్వేషించుచుండు నట్టియు మానవునిచిత్తమున కెట్టివిశ్రాంతియు లభింపనేరదు. ఎవ్వాని హృదయమందు ద్వేషముయొక్కయుఁ బ్రత్యపకారముయొక్కయు నుపద్రవములు చెలరేగియుండునో, వాని హృదయమందు సౌఖ్యాధివాసము గగనపుష్పమువంటి దగును. అగ్నిచే భగభగమండుచున్న వృక్షశాఖపై విహంగ మధిష్టించి గాన మొనరించు టెట్లు? ప్రత్యపకార మను ప్రచండాగ్నిచే దగ్ధమగుచున్న హృదయమందు సౌఖ్య మనుభవింప నేర్చునా? ఇట్టి మౌఢ్యమునకు నివాసమగు స్థానమందు బుద్ధి ప్రవేశించుట కరము కష్టసాధ్యము.

పరమపవిత్రమగు క్షమయొక్క తత్త్వమును గుర్తించియుండని వ్యక్తికే ప్రత్యపకారము మధురముగ నుండుచుండును. పావనమగు క్షమయొక్క దివ్యతత్త్వ మాధుర్యరసము నాస్వాదించిన మనుష్యునకుఁ బ్రత్యపకారముయొక్క రుచి మిక్కిలి వెగటుగను, గటువుగను, దీక్ష్ణముగను నుండఁగలదు. తమోగుణాంధకార పరిపూర్ణహృదయులగు మనుష్యులకే ప్రత్యపకారము సౌఖ్యదాయకముగ నుండుచున్నది. కాని క్రోధాది దుర్గుణముల యుద్వేగము క్షీణించుకాలమందియు మానవునకు సహనముయొక్క కోమలత్వము సంప్రాప్తమగుచున్నది. తత్క్షణమే వానికిఁ బ్రత్యపకారము కేవలము

దుఃఖోత్పాదనమునకు ముఖ్యసాధన మను జ్ఞానమును గలుగుట తలస్థింపుచున్నది.

ప్రత్యపకార మొక భయంకరమగు తీవ్ర విషము. ఇయ్యది మానవుని మస్తిష్కమున దొలుతఁ జేరి దానిశక్తుల నెల్ల హరించి, క్రమముగా దేహమందలి రక్తమంతటను వ్యాపించి, మానవుని సమగ్ర సాత్త్వికశరీరమును విషాక్తమొనరించి వేయుచున్నది. క్రోధ మొక భయంకరమగు మానసికతాపజ్వరము. ఇయ్యది మానవుని మస్తిష్కముయొక్క ప్రయోజనకరములగు సమస్తశక్తుల దగ్ధమొనరించి వేయుచున్నది. కీడును దలంచుటయు నొకభయంకరమగు మానసిక జాడ్యమే యనఁబడుచున్నది. ఈ దుష్టరోగముచే మానవుని దయయొక్కయు, మంగళమయాభిలాషలయొక్కయు స్వాస్థ్యము ఖండింపఁబడుచున్నది. మానవుఁ డిట్టి భయంకర రోగములనుండి సావధానచిత్తుఁడయి యుండుటావశ్యకము. సహనమును నేర్వకుండుటయొక్కయుఁ, బరులకుఁ గీడుసలుప నెంచుటయొక్కయుఁ బ్రకృతి దుఃఖము నుదయింపఁ జేయుచున్నది. ఇట్టిహీన మగు ప్రకృతిని గలిగియుండు మానవుని విషయవికార దమనశక్తి నశించిపోవ, వాఁడు జడబుద్ధియయి దుస్స్వప్నములకుఁ బాల్పడి, జీవితపరిణామశాంతులఁ గోల్పోయి సౌఖ్యానందములనుండి వంచితుఁడగుచున్నాఁడు. పాపా

ణాతుల్యమగు హృదయమును గలిగియుండుటచే మానవుని దుఃఖ మభివృద్ధిచెంది, అది వానిజీవితప్రకాశమును, విశ్రాంతిని నష్ట మొనరించి వేయుచున్నది. కోమలహృదయమును గలిగియుం డుటవలనను, సుప్రసన్నుఁడయి యుండుటవలనను మనుష్యు నకు జీవితప్రకాశమును, విశ్రాంతియు సులభముగా లభించు చున్నవి. కఠినహృదయులును, నసహనశీలురును నగు మను ష్యులు లోకమందలి సమసజనులకంటె నధికముగా దుఃఖ ము ననుభవింపఁగలరని వచించుటలో జనసామాన్యమున కత్యంతమగు నాశ్చర్యము కలుగఁగలదు. వాస్తవమున కీ విష యము భిన్నమయినది కాదు. కారణమేమనన నిట్టి వారాకర్షణ శక్తియొక్క నియమానుసారముగఁ బరుల హృదయము లందుఁ దమ్ముఁ బాధించుటకుఁ బ్రతికారబీజముల నాటిన వార లగుటయేకాక, వారు దివారాత్రములు చిత్తకాఠిన్యముచేఁ గలుగు దుఃఖము ననుభవించుచుండ బాధ్యు లగుదురు. మాన వుఁడెవ్వాని నయిన సాధించునిమిత్తమై తనహృదయమును గఠినమొనరించుకొనునపుడెల్ల వాని కవశ్యమయిదు విధము లగు నష్టములు కలుగుచున్నవి:—1. స్నేహలోపము, 2. సాంఘిక సాంగత్య నష్టము, 3. దుఃఖితుఁడును, నుద్విగ్నమన స్కుఁడును నగునట్టి నష్టము, 4. క్రోధము, గర్వము కలు గుట, 5. పరిజనపరిత్యక్తమగు దండన ననుభవించుట. ఇది యే చందమున మనుష్యుఁడు సహనమును గలిగి వర్తించుటచే

నయిదువిధములగు విశుద్ధానందములఁ బడయసమర్థుఁడగు చున్నాఁడు:—1. స్నేహానందము, 2. సాంఘిక సాంగత్యానందము, 3. స్వచ్ఛమును, బ్రశాంతమునునగు మానసికానందము, 4. క్రోధగర్వదమనము, 5. పరులు మనకు హితాభిలాషులగుటచేఁ గలిగెడి యానందము. ఈ పంచవిధములగు నానందములను మానవుఁడు కేవలము సహనముచే సంపాదింపఁగలుగు చున్నాఁడు.

అసంఖ్యాకులగు మనుష్య లోకాలయమున క్షమాశీలురు కాకుండుటచే సదాక్రోధాగ్నియందు దగ్ధమగుచున్నారు. అస్వాభావికమగు నసహన ప్రకృతిని నిరోధింపఁ జేసినఁగాని మనుష్యుఁడు తా నెంతటి కఠినహృదయుఁడయి నిర్దయుఁడయి వర్తించుచున్నదియు స్పష్ట పడనేరదు. అసహన మను దుష్ట పిశాచముయొక్క దాస్యమును విసర్జించి క్షమయను దైవము నారాధించువారికి క్షమాక్షమల సుఖదుఃఖ దాయకములగు స్వభావపద్ధతులు బోధపడఁగలవు.

మనము ప్రపంచముయొక్క పరస్పర వైమనస్యమును గూర్చి దీర్ఘముగా విచారించినచో నెందఱు వ్యక్తులు, ఎన్ని సమాజములు, ఎందఱిరుగు పొరుగువాండ్రు, ఎన్ని జాతులు ప్రత్యపకారముపైఁ బ్రత్యపకారము నొందొరులయందుఁ గావించుకొనుచున్నదియుఁ దేటతెల్లము కాఁగలదు. ఈరీతిగ

నెన్నిహృదయములు విదీర్ణము లగుచున్నదియు, నెంతగా నశ్రుధారలు ప్రవహించుచున్నదియు, ఎన్ని వియోగములు, ఎన్ని ప్రమాదములు తటస్థించుచున్నదియు, భయంకరముగా నెంత రక్తము ధారారూపంబునఁ బ్రవహించుచు భూలోకమున దుఃఖమును దాండవింపఁజేయుచున్నదియు విశదపడఁగలదు. ఈభయంకరములగు విషయముల నిన్నింటి ధ్యానపూర్వకముగ విచారించినచో మనము దుష్టుల మగుటకు సలుపు కుత్సితాలోచనములను విసర్జించి, ప్రతిమానవునియొక్క దోషమునకును ప్రత్యపకార మొనరించుటను మానివైచి క్షమించుట నభ్యసించినచో లోకమునకు ననంతకల్యాణము చేకూరుట యం దెట్టి విలంబ మొనఁగూడ దని స్పష్టము కాఁగలదు.

మనుష్యుఁడు పగదీర్చుకొనుటను వీడి, క్షాంతిని బరిగ్రహించినచో నవశ్య మంధకారమునుండి ప్రకాశములోనికి రాఁగలఁడు. అనవానమందుఁగల విశేషముకు నంధకారమును, నజ్ఞానమును గుర్తించియున్నవా రగుటచే బుద్ధిమంతులును, జ్ఞానసంపన్నులును నగు మనుష్యు లద్దానిని స్వీకరింపనొల్లరు. మనుష్యుఁడు పగఁదీర్చుకొను దుష్టప్రకృతిని విసర్జింపక, సదాచరణమును బరిగ్రహింపక యున్నంతపర్యంత మంధకారమునే గ్రహింపఁ జాలకుండును. మనుష్యుఁడు తనయంధకారమయములును, పాపప్రచురములును నగు ప్రవృత్తులచే నంధ

ప్రియుండయి మోసగింపఁబడుచున్నాఁడు. సమస్తవిధములగు నవమానములఁ బరిత్యజించుటచే నహంకారము, క్రోధము, ఉన్మాదము, మమకారము, ఆత్మస్తుతి మొదలగు దుర్గుణములన్నియు మానవజీవితమునుండి యంతర్హితములయి పోవుచున్నవి. అపకారిపైఁ బగఁదీర్చుకొనుటకు మానవుని చిత్తమును ప్రేరేపించుటకుఁగల కారణములన్నియు బహిష్కరింపఁబడెను. తనే తొలుత నహంకారముచేతను, నవివేకముచేతను నాచ్ఛాదితములయి యుండిన మానవుని సమున్నతజీవనజ్యోతియు, విశేషముగు వివేకప్రకాశమును బ్రకటీభూతము లగుచున్నవి. సామాన్యములగు నుపాలంభనములు, (ఎత్తిపొడుపులు) కటూక్తములు, ధిక్కారములు సామాన్యదృష్టికిఁ దీవ్రద్వేషముకంటెను, భయంకర ప్రత్యపకారముకంటెను హీనములయినట్లు గోచరించుచున్నను నివియు మనుష్యచారిత్రమును, మానవాంతఃకరణమును సంకుచితమొనరించునట్టి దుష్టప్రవృత్తులయని గ్రహింపవలసియున్నది. ఈదుర్గుణములన్నియు నహంకారమునుండియు, నాత్మశ్లాఘమునుండియు నుదయించుచున్నవి. అహంకారముచేతను, నాత్మస్తుతిచేతను నంధుఁడగు మానవుఁడు పరుల హితోపదేశమును, సద్వాక్యములను విషప్రాయముగ భావించుచుండును. అతఁడొరులనుడువులకుఁ జెవియొగ్గనొల్లఁడు. అహంకారము మానవునియం దభివృద్ధి నందినకొలఁదియు నతఁడు మహాదుష్టుఁడగుచు, లోకమునకుఁ గీడొనరింప

నుత్సహింపు చుండఁగలడు. దుష్టత్వమున కహంకారమే జన్మస్థానము. మానవుఁడు చీటికి మాటికి స్వల్పవిషయములందుఁ జెడుగాఁ దలంచుటచే వానిప్రకృతియం దీర్ష్య వర్ధిల్లి గాఢాంధకారలేశభ్రమల నావిర్భవింపఁ జేయుచున్నది.

మానవుఁడా! లోకు లేమి మాట్లాడినను దానిని చెడుగాఁ దలంపకుము. ప్రతిభావమందుఁ జెడునే చూచుచు వ్యర్థముగా నీమది కేల వ్యథను గలిగించెదవు? నీవు శీఘ్రము గర్వాహంకారములఁ బహిష్కరించి వేయుము. పరుల హృదయముల కెట్టి కష్టము నొదవింపఁ జేయకుము. పరుల దుష్టులుగ భావింపకుము. ఎల్లర క్షమించుచు వారియెడ దయార్ద్రహృదయుఁడ వయి వర్తింపు చుండుము.

గర్వాహంకారముల సంపూర్ణముగా విసర్జించుట మిక్కిలి కష్టసాధ్యమగు పని. కాని యిది సకల లోకాదర్శప్రాయమగు శుభకార్యము. ప్రతివిషయమును జెడుగాఁ దలపోయకుండు పద్ధతిని గ్రమ క్రమముగా నభ్యసించుట వలనను, స్వకీయ భావములను, గార్యములను నెమ్మదిగా గ్రహించి స్వచ్ఛములుగఁ జేసికొనుటవలనను గర్వాహంకారవిసర్జనకార్యము సులభసాధ్య మగుచున్నది. గర్వాహంకారములు క్షీణించు కొలఁదియు సహనశీలతయు, శాంతమును గ్రమముగా వృద్ధినందసాగుచున్నవి.

పరుల హృదయముల నొవ్వఁజేయకుండుటయుఁ, బ్రతి సామాన్య విషయమును జెడుగాఁ దలంపకుండుటయుఁ బరస్పర బాంధవ్యమును గలిగియున్నవి. ఒకమనుష్యుఁడు మఱొకమనుష్యుఁ డొనరించు కార్యములఁ జెడుగాఁ దలంపకున్నచో వాఁడవశ్యము ద్వితీయునిపై దయఁగలిగి వర్తించు ననుట స్పష్టము. ఇట్టి మనుష్యుఁడు వచించు విషయమును, ననుష్ఠించు కార్యములను బరులహృదయములం దెట్టి సంక్షోభ విషాదములఁ గలిగింపక దయను, బ్రేమను గలిగింపుచుండఁ గలవు. పరులు తనకయి కావించునట్టి యేకార్యమునుగాంచియు నతఁడు భయపడ నొల్లఁడు; కారణమేమన నొరుల కెట్టిదుఃఖమును గలిగించియుండని వ్యక్తి పరులు తన కెట్టిదుఃఖమును గలిగింపఁజాల రని విశ్వసింపుచుండును. భ్రాంతిశూన్యుఁడగునట్టియు, సత్యాసత్యవిచారణ లేనట్టియు, సమస్తవిధములగు నుపాలంభనములమీఁదను, దూషణములమీఁదను, దోషారోపణముల మీఁదను బగఁ దీర్చుకొనఁగోరునట్టి వ్యక్తి పరుల శాంతి సౌఖ్యమును గూర్చి విచారింపనివాఁడయి, అనుదినము తనశత్రుసంఖ్యను వృద్ధిఁ గావించుకొనుచుండును. వానికి సదా పరులు తన కేమికీడు గావింతురో యనుభయము నుండుచుండును. అతఁడు తాను పరుల కొనరించియుండిన కీడునకుగాను బ్రత్యపకార మవశ్యమెపుడో హఠాత్తుగా లభింపఁగల దను భయముచే సదా వ్యాకులచిత్తుఁడయి బాధపడుచుండఁ గలఁడు.

"ద్వేషము ద్వేషముచే నుపశమింపదు,
ప్రేమచే ద్వేష మంతరించును."

మనోజ్ఞమగు నీయుత్తమ నీతివాక్యమును రాజకుమారుఁడగు దీర్ఘాయువుయొక్క కథ సమర్థింపుచున్నయది:—"కాశీనగరముయొక్క శక్తిసంపన్నుఁడును, ప్రతాపవంతుఁడును నగు బ్రహ్మదత్త భూపాలుఁడు, కోశలదేశాధిపతియగు దీర్ఘతిధరణీధవునిపై దండెత్తి, అతని సామ్రాజ్యమును గబళింప యత్నించెను. దీర్ఘతియొక్క రాజ్య మంతవిశాలమయినది కాదు. అట్లగుటచేనతఁడు బ్రహ్మదత్తు నెదుర్కొని పోరు సలుపుట యసంభవమని భావించెను. ఈరీతి భావించియతఁడు తనరాజ్యమును శత్రుహస్తగత మొనరించి ప్రాణభీతిచేఁ బలాయనమొనరించెను. కొంతకాలముదనుక నతఁడు వేషాంతరస్వీకారముచే వాడవాడలఁ దిరుగుచుఁ దుదకుఁ బత్నీసమేతముగ నొకశిల్పకుని కుటీరమునందు నివాస మేర్పఱచుకొనియెను. ఇచ్చోటనతని కొక కుమారరత్నము కలుగ వానికి దీర్ఘాయు వని నామకరణముసేయఁబడెను.

అట బ్రహ్మదత్తభూపాలుఁడు "నేను దీర్ఘతియొక్క రాజ్యము నాక్రమించుకొనియుండుటచే నతఁడు తరుణము లభిం

చినపుడు నన్ను మోసగించి నా ప్రాణము లపహరించుటయందా శ్చర్యమేమియు లేదు, గావున వానిని వధించుట శ్రేయస్కర” మని భావించి దీర్ఘైతి నన్వేషింపఁదొడంగెను.

చాలకాలము గతించెను. దీర్ఘైతి తనతనూభవుండగు దీర్ఘాయువుచే విద్యాభ్యాసనమొనరింప నతఁడు స్వల్పకాలము నందే పండితుఁడును, చతురుఁడును, బుద్ధిమంతుఁడును గాఁ గలిగెను.

దురదృష్టవశమున బ్రహ్మదత్తుఁడు దీర్ఘైతియొక్క నివాసస్థానమును దెలిసికొనఁగలిగెను. ఇది యెఱింగి దీర్ఘైతి తనమూలమున దారాపుత్రు లన్యాయముగ వధింపఁబడఁగల రని గుర్తెఱింగి వారి నొక రహస్యస్థానమునకుఁ బంపివైచెను. కాని దీర్ఘైతి భార్యాసమేతముగ బ్రహ్మదత్తునకుఁ జిక్కి వానిచే సంహరింపఁబడెను.

శత్రువును స్త్రీసమేతముగ వధించినను వానిపుత్రుఁడు శేషించియుండుటచే నతఁ డెపుడో తా నసావధానముగ నున్నపుడు పైఁబడిచంపునను భయముచే నిత్యము తల్లడిల్లుచుండెను.

దీర్ఘాయువు తన జననీజనకులు క్రూరముగా సంహరింపఁబడి రను సమాచారము నాలకించినంతనే తన నామధేయ

మును, వేషమును మార్చుకొని బ్రహ్మదత్తుని యశ్వశాల యందు సేవకోద్యోగమును బరిగ్రహించెను. స్వల్పకాలములో నందే దీర్ఘాయువు తన సద్వ్యవహారమునను, సంస్తవపాత్రమగు యోగ్యతవలనను సకలజనప్రేమమునకుఁ బాత్రుఁడయినంతనే కర్ణాకర్ణిగ నతని సద్గుణప్రశంస బ్రహ్మదత్త భూపాలుని శ్రోత్రపుటములఁ బడెను. భూపాలుఁడు దీర్ఘాయువును సాదరముగఁ దనసన్నిధికి రావించి, బహురీతుల సత్కరించి నాటినుండి వానిని తనయొద్దనే యుండ నియమించెను. దీర్ఘాయువు నవీనపదవిని సంపాదించి స్వామిని భక్తిశ్రద్ధానురాగములచే సేవించి, అతని సంపూర్ణానుగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెను.

భూపాలుఁ డొకదినమున విశ్వాసపాత్రుఁడగు దీర్ఘాయువుతోఁగూడి రథారూఢుఁడయి మృగయావినోదమునకై బయల్వెడలెను. ధరణీపతి సైనికనికాయముతోఁ గూడ నరణ్యమునఁ బ్రవేశించి కొంత దవ్వరిగి, సైనికుల నట నిలిచి యుండ నాజ్ఞాపించి ప్రియమిత్రునితో నరణ్యమునఁ బ్రవేశించెను. మధ్యందిన మార్తాండుని తీక్ష్ణప్రకోపమునను, రథప్రయాణాయాసమునను బ్రహ్మదత్తుఁడు పరిక్లాంతుఁడయి దీర్ఘాయువుయొక్క తొడలోఁ దనశిరము నుంచి గాఢనిద్రావశవశుఁడయ్యెను.

రాజు గాఢసుషుప్తియందుండ దీర్ఘాయు వీరీతి విచారింప మొదలిడెను:—"ఈ నృపాలుఁ డన్యాయముగా నా సర్వనాశన మొనరించియున్నాఁడు. ఇతఁడు రాజ్యతృష్ణాబద్ధుఁడయి పూజ్యులగు నా జననీజనకుల సింహాసనచ్యుతులఁ గావించుటయే కాక, క్రూరుఁడయి యక్రమముగ వారి ప్రాణముల సంహరించెను. మాతాపితల ప్రాణహంతకుఁడగు మహాద్రోహి యిపుడు నాకు వశుఁడయియున్నాఁడు. ఇతని వధించి మాతాపితృ ఋణవిముక్తుఁడ నగుటయే పుత్రుఁడనగు నా ధర్మము." అని భావించి దీర్ఘాయువు యొఱనుండి కరాళకరవాలమును వెలికిఁదీసి ఝుళిపించెను. కాని తత్క్షణమే హితబుద్ధియయి తన బాల్యకాలమందు పితృదేవుఁడు బోధించియుండిన "అపకారికి నుపకారము నెపమెన్నక సేయువాఁడె నేర్పరి" యను నీతివాక్యము స్మృతిపథమునఁ దోఁచినంతనే చంద్రహాసము నొఱయందుంచివైచెను. వెంటనే వానిరోష మంతరించెను.

తుదకు రాజు నిద్రనుండి త్రుళ్లిపడుచు మేల్కాంచెను. దీర్ఘాయువు—"తమ రేల భీతచిత్తులయి యున్నట్లున్నా"రని ప్రశ్నింప, భూపాలుఁడు—"నేను సదా సుఖనిద్ర ననుభవింపలేకున్నాఁడను. స్వప్నములు నిరంతరము నన్ను బాధింపుచుండును. నా శత్రుపుత్రుఁడగు దీర్ఘాయువు నా వక్షస్స్థలమును ఖడ్గముతోఁ జీల్చుచున్నట్లు కలలను గనుచుందును. ఇపు

డుసయిత మట్టి భయంకరదృశ్యమే స్వప్నమందుఁ జూడఁగూడ భయకంపితుఁడనయి తుల్లిపడి లేచితిని." అని యుత్తర మొసంగెను.

బ్రహ్మదత్తుని కంపితభాషణము నాలించి, రాజకుమారుఁడు తనఖడ్గము నొఱనుండి తీసి, భూపాలు నుద్దేశించి "రాజా! నీ ప్రబలశత్రువగు దీర్ఘాయువు నేనే. తమ రిపుడు నాస్వాధీనమందున్నారు. తమపైఁ బగఁదీర్చుకొను తరుణ మాసన్నమయినది." అని గంభీరముగ గర్జించెను.

బ్రహ్మదత్తుఁడంత మోకరిల్లి దీర్ఘాయువుయొక్క చరణరాజీవముల నాశ్రయించి దీనకంఠస్వరమునఁ బ్రాణదానము నర్థింపసాగెను. దీర్ఘాయు వంత నిరీతి నుత్తర మొసంగెను:—"రాజా! తమరు నాకుఁ బ్రాణభిక్ష నొసంగుఁడు. చిరకాలమునుండి నన్ను వధింపఁ జూచుచున్నారు. నేఁడు నేను మీకుఁ జిక్కియున్నాఁడను. కావున నాకుఁ బ్రాణదాన మొసంగఁ గృతాంజలినయి వేడుచున్నాను."

బ్రహ్మదత్తుఁడును, దీర్ఘాయువును పరస్పరము ప్రాణదాన మొనరించుకొనిరి. ప్రేమచేఁ బులకాంకితశరీరులయి, గాఢాలింగన మొనరించుకొని యొండొరుల మొకరి కొకరు హానిఁ గావించుకొనమని రుద్ధకంఠములతో శపథ మొనరించుకొనిరి. దీర్ఘాయువుయొక్క క్షమాశక్తిని, యోగ్యతను, పరో

పకారబుద్ధిని గాంచి బ్రహ్మదత్తుఁడు విస్మయానందపరవశుఁ డయి తన ప్రియపుత్రిక నతనికిఁ బరిణయము గావించి, యతని పితార్జితమగు రాజ్యము నతనిస్వాధీన మొనరించెను.

ఈ నీతికథచేఁ బాఠకలోకమునకు ద్వేష మద్వేషముచే ననఁగా క్షాంతిచేఁ బరాభూత మగు నని స్పష్టపడుచున్నది. ప్రత్యపకారము కంటె క్షమయే యత్యధిక సుందరమును, మధురమును, మహత్తరమును నయియున్నది. త్యాగముచేఁ బ్రేమ ప్రాదుర్భవించుచున్నది. త్యాగము నభ్యసించు మనుష్యుఁ డహంకారమునుండియు, మిథ్యాభిమానమునుండియు, ద్వేషమునుండియు, ప్రత్యపకారమునుండియు దూరముగా నుండు నట్టియు — నిత్యసత్యములగు శుభవాంఛలతోడను, బ్రహ్మానందశాంతులతోడను వెలయుచుండు నట్టియుఁ బవిత్ర మగు స్థానమును జేరఁగలుగుచున్నాఁడు. ఈప్రశాంతమును, మానయుతమును నగు నానందమందు క్షమకూడ నుండనేరదు, మానవున కద్దాని యవసరమే యుండఁబోదు. కారణమేమన నీయానందమయస్థితికి ప్రాపించు మనుష్యుఁడు, పరుల దోషాపరాధములచే దుష్టుఁడు కానొల్లఁడు. మీదు మిక్కిలి వారి యజ్ఞానమును, భ్రమను, గ్రహించి వారిపై దయారసమును వర్షింపఁ జేయుచుండఁ గలఁడు. మానవుని స్వభావమందు దుష్టఁ దగులబొక్కయుఁ, ప్రత్యపకారమున

రించుట యొక్కయుఁ, గుత్సితవాసన నిండి యున్నంతవఱకే త్రమ యపేక్షింపఁబడుచున్నది. సకలజీవులపై నిష్కల్మషమగు సమానప్రేమభావమును గలిగియుండుటయే యాదర్శ నియమము; ఆదర్శజీవితము; ఆదర్శస్వర్గము. స్వర్గీయప్రేమ యొక్క నిర్దోషమగు మందిరములోనికిఁ బ్రవేశింప నేర్పడి యున్న ముఖ్యద్వారములలో సహన మొకటి. చదువరీ! జీవిత తారకమంత్రమగు నీసహనమును బడసి, తన్మూలమున నాత్మ విజేతవయి బ్రహ్మానంద పదవినందుము!



# అష్టమ ప్రకరణము.

---

## దోషములఁ జూడకుండుట.

మానవుఁ డనేకవిధముగ క్షాంతిపాఠాభ్యాసమున విజయమును బడయ, వాని మస్తిష్కమునందు వాస్తవికమగు యుక్తాయుక్తవివేకము కలుగ నతఁ డెట్లు హృదయమందు భావములు, ఉద్దేశ్యములు జన్మించుచున్నదియు, నేరీతి నవి వృద్ధినంది కార్యరూపమునఁ బరిణమించుచున్నదియు, స్పష్టముగా గ్రహింపనేర్చుచున్నాఁడు. ఇట్లగుటవలననే మానవుని మస్తిష్కమునం దనేకవిధమగు నవీనవికాసము కలిగి జీవితము నత్యంతశ్రేష్ఠముగను, సమున్నతముగను, బవిత్రముగను జేసివేయుచున్నది. ఇట్టి యుత్తమస్థితికిఁ బ్రాపించి మనుష్యుఁడు తా నన్యుల వచనములను, కార్యములను విని, క్రోధమును జెందక, పరులమాటలఁ జెడుగాఁ దలంపక యెల్లరఁ బ్రేమించుచుండఁగలఁడు. ఇపు డతఁడు గతసమయమందువలె నజ్ఞానముచేఁ గుపితుఁడు కాజాలఁడు. అతనిమానసమందు నిరంతర మిట్టిభావపరంపర లుదయించుచుండును:—చీటికి మాటికిఁ

బగఁదీర్చుకొనను ఏల? తిరిగి క్షమించు టేల? పరులపైఁ గ్రోధము వహించి, తిరిగి దానికయి పశ్చాత్తాపమును జెంది, క్షమాభిక్ష కయి ప్రార్థించు టెందులకు? క్రోధమును, జెడుగాఁ దలంచు టను విసర్జించుటయే క్షమ యనఁబడుచున్నది. క్రోధరోషము లనివార్యములును, సత్పదార్థములును నగుచో వానికయి పశ్చాత్తాపపడుచు క్షమార్పణములఁ గోరు టెందులకు సంభవించును? కటుభావముల దూరమొనరించుటయు, క్షమించుటయు సుందరముగను, మృదుమధురముగను, ప్రశాంతముగను నున్నట్లు కానగుచో బొత్తిగా మఱచియుఁ గ్రోధింపకుండుట, పరులతప్పుల నెన్నకుండుట, దేనిని జెడుగా భావింపకుండుట మొదలగునవి మఱెంత సుందరములును, ప్రియములును, మృదుమధురములును నయి యుండఁగలవు. క్రోధమును, రోషమును లేశమాత్రమయిన మానవ హృదయమందు లేకుండినచో సహనముయొక్క యవసరమే తలసింపనేరదు. ఒరుల వచనములను, గార్యములను జెడుఁగా దలంచు దుష్టస్వభావము నాయం దున్నపుడే నేను శాంతియొక్క పాఠము నభ్యసింప బాధ్యుఁడ నగుదును; కాని క్రోధమును, రోషమును, బరదోషగణనమును నాస్వభావమందే లేనప్పుడు నేను శాంతిని సంపాదింపవలసిన పని యేముండును? నా కెవఁడేని యుపకార మొనరించినచో నేను వానికి బ్రత్యుపకార మొనరింప దూషణమున కుపక్రమింతునేని యది నాయుపరా

ధము కాకుండునా? అపరాధముచే నపరాధము చక్కఁబడునా? ఒకనిదోషముచే మఱొకనిదోషము దూరమొనరింపఁబడఁగలదా? ఒకఁడు భయంకరమగు నపరాధముఁ గావించి యపకారము నా కొనరించియున్నాఁడో లేక తనకే కావించుకొనియున్నాఁడో విచారింపవలసియున్నది. నాదోషము నాకు గీడునాపాదించునో లేక పరులదోషమే నాకు హానిని గలిగించునో దీర్ఘముగా విచారింపవలసియున్నది. అయ్యో! నేను మూఢుఁడనయి యెపుడెపుడు క్రోధమును వహించుచుందు నెందులకు? నేను దోషములఁ జూచు టేమిభావ్యము? ప్రత్యపకారమున కెందులకుఁ గడంగవలయును? కటుభావచింతనము తగునా? నే నీ నీచకర్మలనెల్ల నాచరింపుచున్నచో దానికి ముఖ్యకారణములు నాయందు నెలకొనియున్న స్వార్థాహంకారములే. నాయంధప్రాయ మగు పశుత్వము మేల్కాంచి నాసత్యభావము నణచివేయుచున్నది. నే నంత దుష్టుఁడనయి ప్రత్యపకార మొనరింపఁ గటిబద్ధుఁడ నగుచున్నాఁడను. అహంకారముచేతను, నపవిత్రమును, హీనమును నగు క్రోధమువలనను బరులవాక్యములును, గార్యములును నాహృదయసంక్షోభకరములయి నన్ను భ్రష్టుని గావింపుచున్నవి. నే నన్యు లొనరించునట్టి యపరాధములకయి వారిని దండింప సన్నద్ధుఁడను గాక నిజదోషములనే దూరమొనరించుకొన యత్నించినచో ధన్యుఁడనే యగుదును. పరులదోషముల నెన్ని వారికి

బ్రత్యపకార మొనరింప నెంచుటకంటె నేను భయంకరమగు నహంకారమును, నాత్మశ్లాఘమును, క్రోధమును విసర్జించి వేయుదునేని మహత్తరమగు శ్రేయస్సు కలుగఁగలదు, అపుడు నా కెట్టి క్లేశములు సంభవింప నేరవు.

ఈచందమున మనుష్యుఁడు నిరంతరము తనయంతఃకరణమును బరిశీలించుకొనుచుఁ దనకుఁదానే యుచితసమాధానము నొసంగుకొనుచుండినచో వానిభావములు పావనములును, కోమలములును, జారిత్రము క్రోధశూన్యమును గాఁగలదు. అపుడవ్వాని యుద్వేగము క్షీణింపఁ గ్రోధరోషముల కుత్పత్తికి హేతుభూతము లయిన యజ్ఞానాంధకారము లోకమునుండి పెట్టున దూరమయిపోఁగలవు. అంతమునకు మనుష్యుఁ డాయానంద స్థితికిఁ బ్రాపింపఁగలుగుచున్నాఁడు. పరులదోషములపేక్షింపక, సకల మానవకలావణ్యము నపేక్షింపుచు నెల్లరియెడఁ బ్రేమభావమును, శాంతమును వహింపుచు వర్తించుటచే మానవునకు బ్రహ్మానందము లభింపఁగలదు. ఇంతమాత్రమున మానవుఁ డజ్ఞానమును, మూర్ఖ్యమును, జూచుటయే విసర్జించి వేయుచున్నాఁడనియు, గష్టములను, దుఃఖములను, భయములను గాంచుటయే లేదనియు, నుచితానుచితకర్మలయందును, శౌచాశౌచములందును గల భేదము నవలోకించుటకును, గ్రహించుటకును నసమర్థుఁడయి యున్నాఁడనియు భావింప వలనుప

డను. వాఁడు క్రోధమును, పక్షపాతమును, పరదోషకీర్తనమును విసర్జించివేయుటచే జ్ఞానముయొక్క సంపూర్ణ స్వచ్ఛప్రకాశమూలమున పైనివివరించియున్న వివిధవిషయములయొక్క వాస్తవికస్థితిని గ్రహింపుచున్నాఁడు. అప్పు డంతె వానికి తనకు హానికరమయినట్టియుఁ, దనచే నిరోధింపఁబడఁదగినట్టియు, శీఘ్రమే నష్టమొనరింపఁబడఁదగినట్టియు దుష్టశక్తిపరులయందు లేనట్లు గోచరింప నారంభింపుచున్నది కీడును దన హృదయమునుండి బహిర్గత మొనరించివైచుటచే మానవుఁ డద్దాని భయంకరత్వమును గ్రహించి తనజీవితము ద్వేషభయరోషముల నివాసమునకు యోగ్యమయినది కాదనియు, జిజ్ఞాస, అనుకంప, ప్రేమ మొదలగు సద్గుణముల నివాసమున కర్హమయినదనియు స్పష్టముగా గ్రహింప నేర్చుచున్నాఁడు.

మహాకవియగు షేక్స్పియరు "అజ్ఞానముకంటెఁ బ్రగాఢమగు భయంకరాంధకారము లేదు." అని తన యొక నాటకమున వ్రాసియున్నాఁడు. నేఁడు లోకమునఁ గాననగుచున్న కీడంతయు మానసముయొక్క గంభీరమగు నజ్ఞానతిమిరసంభూతమయినదియే. అంధకారమునుండి ప్రకాశములోనికి రాఁగోరు వ్యక్తి తనస్వాంతమునుండి సకలపాపముల నిర్మూలించివేయు టావశ్యకము. మేలుకలుగకుండుటకే కీడని పేరు. ప్రకా

శము కలుగకుండుటకే యంధకార మని నామధేయము. ఇది యేచందమునఁ గ్రోధరోషము లుత్పత్తికాకుండు స్థితినే కోవిదులు జ్ఞాన మనుచున్నారు. జ్ఞానసంపన్నుఁడగు పురుషోత్తముఁడు పరిశాంతమగు ననురోధముచే మనుష్యులకుఁ బరికాశ మెట నున్నదియు బోధించు టుచిత మని భావించుచున్నను, భావ రూపమునఁ బ్రకటితమగుచున్నవారి యాధ్యాత్మికాంధకార మును నిందింపనొల్లఁడు.

చెడుగు రెండువిధములు. యుక్తాయుక్తవిచక్షణాలోక కావింపఁబడున దొకకీడు ఇయ్యది యజ్ఞానముచే సంభవించు చున్నది. కర్తచేఁ గీడనియు, నాచరింపఁ బడరానిదనియు గ్రహింపఁబడియు ననుష్ఠింపఁబడు నశుభకార్యమే రెండవవిధ మగుచెడ్డ. చెడ్డ, గుర్తించిచేయఁబడినను, గుర్తింపక యాచ రింపఁబడినను నది యజ్ఞానమునుండియే కలుగుచున్న దని మనము గ్రహింపవలయును. అశుభకార్యము నాచరించు వాఁడు దానిని గ్రహించి చేసియున్నను, గ్రహింపక చేసి యున్నను వాఁ డద్దాని వాస్తవికమగు నునికిని, మర్మములను గ్రహింపఁజాలఁడు. అతఁ డాకీడు నాచరించుటచే భవిష్య త్కాలమునం దెట్టి దుష్పరిణామములు కలిగి యవశ్య భోక్తవ్యములయి తనజీవితమును దుఃఖవారిధిని ముంచివేయఁ గలవో గుర్తింపనేరఁడు. వాఁ డీ రహస్యమును గ్రహించియే

యున్నచోఁ బ్రమాదవశంబునఁ గీడొనరింప సాహసింపనేరఁడు. పలుమాటలేల? మానవుఁ డొనరించు సమస్తదోషముల కజ్ఞానమే ముఖ్యకారణము.

మానవుఁ డీ విషయమును గూర్చి యనుభవమును సంపాదింపుచుండియు నిట్టి కార్యముల నేలఁ గావింపు చుండు నను ప్రశ్న కలుగవచ్చును. మనుష్యుఁ డిట్టి పనుల నాచరించుట దోషమని గ్రహించినచో వానియం దజ్ఞానము కల దని భావించు టెట్లు?

మానవుఁడు దోషములను గ్రహింపుచుండియుఁ గీడొనరింపుచుండుటచే వానియందు సంపూర్ణమగు జ్ఞానము లేదనియు, వాఁడు దోషముల భయంకర తత్త్వమును సాకల్యముగఁ బరిశోధించి యుండలేదనియు గ్రహింపవలసి వచ్చుచున్నది. వాఁడు పరులప్రబోధముల నాలించుటవలనను, నాత్మీయ లోనంగు హెచ్చరికల మాలపునను, నిజాంతఃకరణ తాడనమునను గామక్రోధములవంటి దుష్కర్మ లనాచరణీయములని గ్రహింపుచు, నుడువుచు నుండునే కాని తత్కాలమందుఁ దానే యొనరింపుచున్నదియు స్పష్టముగా నవలోకింపనేరఁడు. వాఁడు నిషిద్ధమగు కార్యము నాచరించుటచేఁ దాత్కాలికమగు నాహ్లాదము లభించు ననియెడి వ్యామోహముచే నంతఃకరణప్రబోధమును దృణీకరించి యనుచిత

కార్యాచరణమున కుపక్రమించుచున్నాఁడు. వాఁడు తాను బడయునట్టి యాహ్లాద ముత్తమంబనియు, భోగ్యమనియు భావించుచున్నాఁడు. కష్టములేనిదే సౌఖ్యము దుర్లభమనియుఁ, దా ననుభవించునట్టి యాహ్లాదము కష్టమునుండి భిన్నమగు పదార్థము కాదనియు నతఁడు గ్రహింపఁజాలకున్నాఁడు. వాని యాచరణమువల్లే మానవకార్య నిర్వహణమున కాధారభూతమగు నియమమున కతఁ డనభిజ్ఞుఁ డని మనకు స్పష్టపడుచున్నది. వాఁడు తా ననుభవించు దుఃఖమంతయుఁ, దా నాచరించియుండిన దుష్కర్మలయొక్క ఫలితమే యని గ్రహింప నేరఁడు. అతఁడు తా ననుభవించుచున్న దుఃఖమంతయుఁ బరుల ద్రోహముచేఁ గలిగినదనియు, సుఖదుఃఖములు రెండును భగవద్విరచితములనియుఁ గావున వాని నన్వేషించుటయు, గ్రహింప నుంకించుటయు నిష్ప్రయోజన మని విశ్వసించుచుండును. అతఁడు తనకు సౌఖ్యము నొసంగఁగల వని విశ్వసించు కార్యములనే యాచరించుచు నిరంతరము సౌఖ్యము నన్వేషించుచుండును. కాని వాఁడు తన కార్యములచేఁ దా నెట్టి దుష్ఫలితముల ననుభవింప బాధ్యుఁడు గావలసి వచ్చునో గుర్తింపఁజాలకుండును.

ఒకతూరి దుర్వ్యసనగ్రస్తుఁ డగు మనుష్యుఁ డొకఁడు నాతో నీ విధమున నుడివెను:—"నే నీవ్యసనముచే నెట్టి బాధ

మును కలుగ నేరదనియు, మీఁదుమిక్కిలి భయంకరమగు హానియే వాటిల్లుననియు బాగుగా నెఱుంగుదును." నే నంత వాని నీరీతి నడిగితిని:—"మహాశయా! తమరు నిత్య మాచరింపుచున్న దుర్వ్యసనమును హానికరమనియు, నిష్ప్రయోజనమనియు స్పష్టముగా గుర్తింపుచు నేల గావింపుచున్నారు?" దీనిమీఁద నతఁ డిట్లుత్తర మొసంగెను—"ఈవ్యసనముచే నాకు రుచికరమగు నానందము లభింపుచున్నది. కావున నే దీనిని విడువఁజాల కున్నాఁడను." ఆమనుష్యుఁడు తనస్వభావము దూషితమయి పోయిన దని వాస్తవముగా నెఱుంగఁజాలఁ డనియే నుడువ వచ్చును. అతఁడు పరులచేఁ దనస్వభావము చెడ్డ దని వినియుండెనే కాని తనప్రకృతి కళంకితమయి పోవుచున్న దని స్వప్నమందయిన స్వయముగా నూహించి యుండలేదు. కాని వాస్తవమందు వాఁ డావ్యసనమును మంచిదానిగను, దనసౌఖ్యానందముల వర్ధిల్లఁ జేయుదానిగను విశ్వసించుటవలననే దానిని విసర్జింపఁ జాలకుండెను. మనుష్యుఁడు స్వానుభవముచే నొక కార్యమును దుష్టమనియుఁ, దదాచరణముచేఁ దన దేహమునకును, మానసమునకును నష్టము కలుగఁగల దనియు, నాకార్యమునందుఁ గల దోషములచే భయంకరములగు విపత్పరంపర లుదయింపఁగల వనియు గ్రహించినచోఁ దత్క్షణమే వాఁ డద్దానిని విసర్జించుటయే కాక పూర్వమువలె దానిని సౌఖ్యానందవర్ధకమగు వస్తువుగ భావింపక భయం

కర దుఃఖోత్పాదక మగు రాక్షసపదార్థముగఁ జూచుచుండఁ గలఁడు. భుజంగముయొక్క శిరోభాగమున ధగద్ధగాయమానముగ వెలుంగుచున్న బహుమూల్యవంత మగు మణి యున్నను మానవుఁ డాసర్పమును గాఢాలింగన మొనరించుకొనఁజాలఁడు. సర్పము బాహ్యమునకు మణిచే విభూషితమయి యున్నను ప్రాణహానికరమగు హాలాహలముచే నది నిండి యున్న దని స్పష్టముగా గ్రహించు మనుష్యుఁ డద్దాని పొంతకరుగ నొల్లఁడు. ఇదియేచందమున మానవుఁడు తా నాచరించు దుష్కార్యములకయి భవిష్యత్కాలమందుఁ దాను నిశ్చయముగా భయంకరములగు దుఃఖముల ననుభవింపవలసి యుండు నని గ్రహించినచో నంతకుఁ బూర్వమునుండియుఁ దనమానసముచే నభిలషింపఁబడుచు వచ్చియున్న తాత్కాలిక సౌందర్యమును, సౌఖ్యానందములను మట్టి పెల్లలకంటె హీనములుగఁ జూచి, విసర్జించివేయఁ గలఁడు. దుష్కర్మల యొక్క రహస్యము వెల్లడియయినంతనే మానవుఁడు వానిని స్పష్టముగా వీక్షింపఁ గలుగుచున్నాఁడు.

నాకుఁ బరిచితుఁడగు యువకుఁ డొకఁ డుండెను. అతఁ డొక ధర్మోపదేశకుఁడు. ధర్మోపదేశముతోఁ బాటు వాణిజ్యమునుగూడ జీవిత వ్యవసాయముగఁ బరిగ్రహించి యుండెను. అతఁ డొకతూరి వ్యాపార వ్యవసాయముల బాగు

గా నిర్వహించుటయందుఁ గల్లలాడుట, మోసముచేయుట
చాలయావశ్యకము లగుచుండు ననియు, నీ రెండు ఉపాయ
ముల నవలంబింపనిచో నిస్సందేహముగ వ్యాపారి నష్టపడఁ
గలఁ డనియు వచించెను. అతఁడే తిరిగి నాతో నబద్ధమాడుట
దోష మని గ్రహించియుండియు వ్యాపారసౌకర్యమునకయి
బొంకుచుండు ననియు నుడివెను. నే నతనిమాటల నాలకించి-
"సోదరా! నీ వెపుడయిన వ్యాపారాభివృద్ధికి శ్రేష్ఠమార్గముల
యిన సత్యమును, ధర్మమును నాశ్రయించి యుంటివా" యని
ప్రశ్నించితిని. అతఁ డంత—"వాణిజ్యాభివృద్ధికి ధర్మమునకంటె
నుత్తమంబగు సాధనము లేదని యెఱుంగుదును, గాని నే నింత
వఱకద్దాని నాశ్రయించి యుండలేదు." అని యుత్తర మొసం
గెను. చదువరీ! ఈ నవయువకుఁడు తనదోష[illegible] సం
స్కరించుకొనలేనట్టి దుస్స్థితియం దుండుటకుఁ గారణ
మెద్దియో గ్రహించితివా? ఈనవయువకుఁడు సత్యవి
రుద్ధముగ వర్తించుట మానవధర్మము కాదని గ్రహించి
యుండెనా? లేదు, కేవల మితఁడు జనసామాన్యముఖంబున
సామాన్యవిధమున నసత్యమాడుట దోష మని మాత్రమే
వినియుండెను. వాస్తవముగా నితఁడు స్వానుభవముచే సత్యా
సత్యముల ప్రయోజనాప్రయోజనముల గుఱించియుండ
లేదు. ఏనిఁ గల్లలాడరా దను శిక్ష లభించియుండెను ఇతని
యంతఃకరణమునయిత మసత్యభాషణము దోష మని [illegible]క్యము

నొసంగుచుండెను, కాని వీని కసత్యభాషణముచే విశేషమగు లాభమును, నభివృద్ధియు, సౌఖ్యమును గలుగు నను ప్రబల విశ్వాస ముండెను. ఇతఁడు సత్యభాషణముచే నష్టమును, దారిద్ర్యమును, దుఃఖమును గలుగు నని భయపడుచుండెను. ఇతని యాపద్గతుల నవలోకించుటచే నితఁడు కల్లలాడుటనే యుక్త ధర్మముగను, సత్యభాషణమునే యనుచితమగు నధర్మముగను భావించియుండినట్లు స్పష్టపడుచున్నది. ఇతనికిఁ గల్లలాడుటయొక్క వాస్తవికమగు రహస్యమును గ్రహించు శక్తి లేకుండెను ఇందువలననే యితనివర్తనమునకును, ప్రయోజనమునకును, ప్రభావమునకును, నానందమునకును, ప్రతిష్ఠకును, వ్యావహారిక లాభమునకును మిక్కిలి నష్టము కలుగుట సంభవించెను. ఇట్టి మనుష్యుఁడు పరసౌఖ్యమునుగూర్చి ధ్యానమును గలిగియుండియు వ్యాపారమందు బొంకకుండుటచే నార్థికనష్టము గలుగఁగల దను భయముచే లభించునట్టి యసౌఖ్యము ననుభవించి తన్మూలమున సత్యాసత్య భాషణముయొక్క వాస్తవిక జ్ఞానమును బడయుచున్నాఁడు. వాస్తవికమగు జ్ఞానము కలిగినంతనే మనుష్యుఁడు తా నింతకాలము పర్యంతము కల్లలాడి సంపాదించినది సౌఖ్యము కాదనియు, నదియే భయంకరమగు దుఃఖమనియు, బరుల మోసగించుటచే నాత్మవంచకత్వము సయితము వాటిల్లుచున్న దనియుఁ, దా నింతవఱకుఁ బ్రగాఢభ్రమయొక్క ఘోరాంధకారమున

మునిఁగియుంటి ననియు గ్రహించి విచారించి సకల వ్యవసాయ ములందు, సత్యభాషణమునే విజయప్రాప్తికి ముఖ్యసాధన ముగ నవలంబించిఁ తన్మూలమున వాస్తవికానందము ననుభ వింప సమర్థుఁ డగుచున్నాఁడు. పై నుదహరింపఁ బడిన రెండు ఉదాహరణములు ను సత్యము నన్వేషింపుచు, సందేహములయొక్కయు, భ్రమయొక్కయు వలలోఁ జిక్కియున్న మనుష్యులకు సమస్త పాపములును, దుష్క ర్మలును గాఢాజ్ఞానజన్యము లని స్పష్ట మొనరించును. ఈ యుదాహరణములచే మనుష్యుఁడు, పాపాత్ములయెడ ద్వేషమును వహింపరా దనియు, నిర్మలమగు ప్రేమనే ప్రకటిం చుట ధర్మమనియు గ్రహింపవలసి యున్నది. ప్రపంచమందు దోషులుగ నున్నవారెల్ల రజ్ఞానసంపన్ను లనుట కేమియు సంది యము లేదు. ఒకవస్తువుయొక్క సంపూర్ణజ్ఞానమును గలిగి యున్న వ్యక్తి యావస్తువును యథోచితముగ నుపయోగింపఁ గలఁ డనుట నిర్వివాదాంశము. ఇదియేరీతి మానవుఁడు సం పూర్ణముగ జ్ఞానసంపన్నుఁడే యగుచోఁ బాపముల నాచరింప నొల్లఁడు. మానవునిజీవితమందు లోచన గోచరములగు దోషములకన్నింటికి నజ్ఞానమే ముఖ్యహేతువుగ నున్నది కాన దోషులెల్లరు క్షమింపఁబడ నర్హులయి యున్నారు. అపరాధు లను క్షమించి, వారియెడ దయార్ద్రహృదయులయి వర్తించు టయే బుద్ధిమంతులగువారి పరమధర్మ మయియున్నది. అనే

త్యభావణమున కెట్టి పవిత్రమగు దైవికనిబంధన మేర్పడి యున్నదో, అదియే దూషితప్రకృతి, లోభము, జుగుప్స, ద్రోహము, ద్వేషము, అభిమానము, అహంకారము, ఆత్మ శ్లాఘ, స్వార్థము మొదలగు సమస్తపాపముల మెడను సార్థక మగుచున్నది. ఈదుర్గుణములన్నియు మానవజీవితమునఁ బ్రవేశించుటకు ముఖ్యకారణము జ్ఞానరాహిత్యమే. జ్ఞానరా హిత్యముచే మానవుని హృదయమందిరమందలి సత్యప్రకాశ మంతర్హితమయిపోవ నలుదెసల నాధ్యాత్మికాంధకారము వ్యాప్త మగుచున్నది. మనుష్యుఁడు తనహృదయముయొక్క దూషితపదార్థమునంతయు దూరముగఁ బాఱవైచి, కీడు యొక్క వాస్తవికమగు సంపూర్ణజ్ఞానమును సంపాదించినం తనే జుగుప్స లేనివాఁడయి దుష్కర్మల నాచరించు వారియెడ కోమలబుద్ధితో, దయార్ద్రహృదయముతో మెలంగ నారం భించుచున్నాఁడు.

దోషములఁ గాంచుచుండుటచే మనము మఱి యితర ములగు దోషములఁ జిక్కువడవలసినవారల మగుచున్నా రము. ప్రపంచమందలి ప్రతివ్యక్తికిని స్వాతంత్ర్యము కలదు. మనుష్యుఁడు తన యభిరుచి ననుసరించి కార్యము నాచరింప నధికారమును గలిగియున్నాఁడు. పరులయందు దోషముల నెన్నుచుండుటతోఁ బాటు పరులకార్యములును, భావములును

ద న్ననుసరించియుండవలయు నని కోరుకొను చుండును. మనుష్యుఁడు కేవలము తా నాచరించునట్టియు, విచారించునట్టియుఁ గార్యములనే సర్వోత్తమములుగ విశ్వసింపుచుండును. అతఁడు తనపను లెంతనీచములుగ నున్నను వానిని మంచివానిగనే తలంపుచుఁ బరు లొనరించు కార్యము లెంత ప్రశస్తములయి యున్నను వానిని నిరసింపుచుండును. కావున స్త్రీ పురుష భేదములేక సకలమానవాళి తా మెవరిపైనయిన జుగుప్సను, ద్వేషమును బ్రకటింపకుండ నుండుట శ్రేయస్కరము. అనేకు లాత్మదోషము లెంత భయంకరములయి యున్నను వానిని మిక్కిలిదయతో క్షమించుకొనుచుఁ, బరుల సామాన్యదోషములనయిన గొప్పవానిగ భావించి, ఆదోషము లొనరించిన వారిని సంపూర్ణముగా నిరసింపుచున్నారు. ఈ భ్రాంతియొక్క కారణముననే ప్రపంచముయొక్క వివిధ మతావలంబులమధ్య నిరంతర కలహములు తటస్థింపు చున్నవి. క్రైస్తవు లన్యధర్మావలంబుల మిక్కిలి దుష్టులని భావింపుచుండ, హిందూ మహమ్మదీయులు క్రైస్తవుల భ్రష్టులుగఁ దలపోయుచున్నారు. అతిఛాందసులు సంస్కర్త లన నీచులుగ భావించి వారల నెల్ల విధముల నిరసింపుచున్నారు. వైదికులు నేటిప్రపంచముయొక్క దూషితవిజ్ఞాన సిద్ధాంతముల బొత్తిగా గర్హింపుచున్నారు. వాస్తవమాలోచింప వీరందఱిలో నెవ్వారును దుష్టులును, భ్రష్టులును లేరనియే స్పష్టపడఁగలదు. ప్రతివ్యక్తియు తనవాంఛిత

మార్గము ననుసరించుచుఁ దన్మార్గమునే నిత్యముగను, సత్యము గను విశ్వసించుచుండును.

మనము ప్రశాంతహృదయులమయి, విశ్వముయొక్క భిన్నములగు ధర్మముల పరస్పరదూషణముల ధ్యానపూర్వక ముగ వీక్షింతుమేని యీకలహముల కన్నింటికి మూలకారణ మజ్ఞానమే యని స్పష్టము కాఁగలదు. లోకమందలి విద్వేషము లకును, కలహములకును మూలకారణమును గుఱించి ధ్యాన ముతో నాలోచించుటచే మానవహృదయముయొక్క శాం తియు, ననుకంపయు, బుద్ధియు, గాంభీర్యమును దినదినప్రవర్ధ మానములు కాఁగలవు.

యథార్థమగు సజ్జనుఁడు సమస్తసందర్భములందు మం చినే వీక్షింపుచుండును గాని కీడు నెంతమాత్ర మవలోకింపు చుండఁడు. కారణ మేమన నతఁడు పరుల భావములను, కా ర్యములను తనబుద్ధి ననుసరించియుండవలయు నని యెడ మూఢవాంఛను త్యజించివైచి మానవుల స్వభావములు భిన్న ములుగ నుండుచుండు ననియు, వారి యాధ్యాత్మిక శక్తి వృద్ధి నందినకొలఁదియు వారి భావములును, గార్యములును వర్ధిల్లు చుండుననియు గ్రహింపఁగలఁడు. అతఁడీర్ష్యను, దోషదృష్టిని, అహంకారమును, బక్షపాతమును విసర్జించి జ్ఞానముయొక్క దివ్యప్రకాశమును విలోకింప నిరంతరము కృషి సలుపుచుం డును. పారిశుద్ధ్యమును, బ్రేమను, దయను, సౌశీల్యమును,

ధైర్యమును, వినయమును, స్వార్థత్యాగమును జ్ఞానముయొక్క దివ్యప్రకాశములనియు, నపవిత్రత, ఈర్ష్య, కౄరత్వము, క్రోధము, నుద్వేగము, అహంకారము, స్వార్థము మొదలగునవన్నియు నజ్ఞానముయొక్క యంధకారపుంజము లనియు నతఁడు స్పష్టముగా గ్రహించుచుండును. మనుష్యుఁ డజ్ఞానాంధకారమునం దున్నను, సుజ్ఞానప్రకాశమం దున్నను దన కుచితము లని తోఁచిన కార్యముల నెల్ల నాచరించుచు నుండును. బుద్ధిమంతుఁ డీరహస్యముల నన్నింటి గ్రహించి యేవిషయమందును బరులపై దోషారోపణముఁ గావింప నొల్లకుండును.

ప్రతిమానవుఁడును, తనప్రకృతి ననుసరించియుఁ, దనకుఁగల యుక్తాయుక్త జ్ఞానము ననుసరించియుఁ గార్యముల ననుష్ఠించుచు స్వీయానుభూతకర్మలయొక్క ఫలితముల ననుభవించుచున్నాఁడు. తన యిచ్ఛానుకూలముగ నాలోచించుటయు, నాచరించుటయుఁ బ్రతిమానవునకు సర్వోత్తమమగు స్వత్వమయియున్నది. మానవుఁడు నిజస్వార్థమునకు వశుఁడయి తనయొక్క తాత్కాలిక సౌఖ్యోపలబ్ధినిమిత్తము విచారించి కార్యమొనరించుచుఁ బరుల సౌఖ్యమువైపునకు ధ్యానము నొసంగకుండినచోఁ గారణకార్యము లస్థిరనియమానుగుణ్యముగఁ దన్ను దుఃఖాబ్ధిని బడఁద్రోసికొనుచున్నాఁడు. వాఁడట్లు కొంతకాలము క్లేశము ననుభవించి దీర్ఘముగ విచారింప

వలసినవాఁడయి, తచ్చింతనమునకుఁ బిదప సంతరణము యొక్క శ్రేష్ఠమార్గమును గనిపెట్ట శక్తుఁ డగుచున్నాఁడు. స్వానుభవముకంటె మానవున కాదర్శప్రాయుఁడగు నాఁడు లేఁడు. అజ్ఞానముచేఁ బ్రాప్తించు కష్టమును మించిన శిక్షా ప్రదమును, సంస్కారణకారకమును నగు దండనము లేదు. స్వార్థాంధుఁడగు మనుష్యుఁ డజ్ఞానయుతుఁడు. అతఁడు తొలుత దుఃఖమును, ఆదుఃఖమునుండియే జ్ఞానానందములను బ్రసాదించు నట్టి మార్గమును స్వీకరింపుచున్నాఁడు; సజ్జనుఁడే బుద్ధిమంతుఁడు. బుద్ధిలేనిచోట సౌజన్యముండ నేరదు. బుద్ధిమంతుఁడు తనమార్గమును దాను స్వీకరించుచున్నాఁడు; కాని యజ్ఞానము యొక్కయు, దుఃఖముయొక్కయు సోపానపరంపరల నతిక్రమించి సుజ్ఞానానందములఁ బడసి, జ్ఞానముయొక్క సంపూర్ణప్రకాశమున లీనమగుచున్నాఁడు.

మనుష్యుఁడు పరులకు వారి కర్తవ్యాచరణ సందర్భమున నిజాభిలాష ననుసరించికాక, వారియభీష్టము ననుసరించియే సమ్మతినొసంగుచు వారికర్తవ్యములఁ దనబుద్ధిలోఁ బరీక్షింపక, వారిబుద్ధితోడనే పరిశీలింపుచు, వారికిని కాదర్శ మందు వారివాంఛలకే గణ్యస్థానము నొసంగుచు నందుఁ దనలాలసలఁ బ్రవేశపెట్టక యుండఁగలిగినపుడే పరుల దోషముల నేతింపనివాఁడయి వారివాస్తవిక చారిత్రమును, గ్రహింపఁ

గలుగుచున్నాఁడు. పరులయందు దోషములు మనకు దృష్టి గోచరములయినంతనే మనము వారి గుణాధిక్యమును నిజాధిక్యమునుండు మిథ్యాభిమానముచే గ్రహింపలేకనియే నుడువవలసియుండును. నీయాదర్శమున ననుసరించియు, నాయాదర్శము ననుసరించియు గాక మనుష్యుఁడు వాని యాదర్శము ననుసరించియే పరీక్షింపఁబడినపుడు వాని స్వాభావికమగు స్థితి బహిర్గతము కాఁగలదు. ఈరీతిగ మానవచారిత్రమును బరిశోధించుటను ధర్మశాస్త్రము బోధింపనేరదు. స్వర్గీయమగు నీ పద్ధతిని సమస్తలోకమునకుఁ జాటఁగలుగున దొక్క పరిశుద్ధమగు ప్రేమయే. మనము నిర్మలమగు ప్రేమదృష్టితో విలోకించినపుడే జ్ఞానసూర్యోదయమయి మనకు పరులయొక్క యథార్థమగు దశను జూపింపఁగలదు. మనుష్యుఁడు నే నితరుల స్వాతంత్ర్యమును లాఘవపఱచి వారిని నిర్ణయించుట కెవ్వఁడ నని భావించినపుడే ప్రేమతత్త్వమును విశేషముగాఁ బడయఁగలఁడు. ప్రతి మనుష్యుఁడు సదా పరుల దోషులుగ నిశ్చయించుటకును, నిందించుటకును, నే నంత పాపశూన్యుఁడను, బవిత్రుఁడను నయి యుంటినా యని స్వాంతమున విచారించుకొనుచుండవలయును. ప్రతిమానవుఁడు పరులయందలి దోషముల నెన్నుటకుఁ బూర్వమే తనయందు వేరూనియున్న దోషముల గ్రహించి నిర్మూలించివేయు టావశ్యకము. మహాత్ముండగు కబీరుదాసు వచించిన విధమును గనుఁడు.

"నాయనా! నీ వేల వీరపురుషునివలె వేషమును ధరించి మీ పాపము నను దువ్వుచు దోషమున బరుల దోషముల నెన్న బయలుదేఱితివి? అయ్యో! నీ వితరులతప్పులఁ బయ ల్పఱచుటకుముందు నీ హృదయాంతరాళమునఁ బుంఖాను పుంఖములుగ వేరూనియున్న దోషముల దూరమొనరించు కొనవేమి? నిన్ను నీవు సవరించుకొనలేక పరుల సంస్కరింప బయల్వెడలితివా?"

మహాపాప మొనరించియుండిన యొక దుశ్చరిత్రయగు స్త్రీని జనులు ఆగ్రహముతో రువ్వి హింసింప నారంభించినపుడు ద యామయుండగు జీసను ప్రభువు బోధించియుండిన వాక్యము చిరస్మరణీయము. ఆమహానుభావుఁ డిట్లు వచించెను.

"అన్నలారా! మీలో నేవిధమగునట్టిపాప మొనరింపని వ్యక్తియే యీ పాపాత్మురాలగు స్త్రీపైఁ దొలుత రాయిని విస రఁ దగును." మహాత్ముని యీనుడువుల నాలించి ప్రజాసంఘ మందలి పాపశూన్యుఁడును, నిర్దోషియు నగు వ్యక్తి రాళ్ళను రువ్వకయే వినయవిధేయతతోఁ గరుణారసము వర్షించునట్లు "అమ్మా! నిన్ను నేను దోషురాలిగ నిర్ణయింపఁజాలను. నీవిఁక వెడలి పొమ్ము. ఇంతటినుండి పాపము లాచరింపకుము" అని యాభ్రష్టచారిత్రనగు స్త్రీతో నుడివెను.

పవిత్రమగు హృదయమందు ద్వేషమునకును, స్వార్థయుక్తములగు నిర్ణయములకును స్థానము లభింపఁ జాలదు. కారణ మేమన నట్టి హృదయము మార్దవముతోడను, నిర్మలమగు ప్రేమతోడను బరిపూర్ణమయి యుండుచుండును. ఇట్టి విశుద్ధమగు హృదయమునకుఁ బరులయందు దోషములు గోచరింప నేరవు. మనుష్యుఁడు పరులయందుఁ గీడును జూచు స్వభావమును విడిచిపుచ్చుచున్నకొలఁదియు నతఁడు స్వయముగా భయవిషాదపాపముల నుండి విముక్తుఁడు కాఁగలుగుచున్నాఁడు.

మనుష్యుఁడు జ్ఞానమును సంప్రాప్తింపఁ జేసికొననంత పర్యంతము తనయందున్నట్టియుఁ దనకార్యములందు వెలయుచున్నట్టియు దోషముల నవలోకింపఁజాలఁడు. వాని జ్ఞానప్రకాశము వర్ధిల్లుచున్నకొలఁదియు నతఁ డా దోషపూర్ణములగు కార్యముల నెల్ల విసర్జించివేయుచుండఁగలఁడు. ప్రతిమనుష్యుఁడును దనకార్యములను బరు లెంతగా నింద్యములని భావించినను, ధర్మసంగతము లని నిరూపించ వాని నాచరించు టత్యంతావశ్యకమనియు, నవి న్యాయయుక్తము లనియు వచింప నారంభించుచుండును. అతఁడు తా నాచరించు కార్యమును జెడ్డదని వచించినచో దాని నాచరించు టెట్లు సంభవించును? ప్రతియల్పమానవుఁడును దా నొనరించు కార్యమును బ్రేమా

ణికమనియే వాదింపుచుండును. కుపితుఁడును తన క్రోధమును సుచితమే యని వచింప సాహసించును. లుబ్ధుఁడు తన లోభబుద్ధిని, జారుఁడు తన వ్యభిచారవృత్తిని ధర్మసంగతము లని నిరూపింపఁ జూచుచుండును. అసత్యభాషి నిరంతరము జీవితనిర్వాహణమున కసత్యభాషణము నత్యంతావశ్యకమగు పదార్థ మని నిర్వచింపుచుండును. దోషదర్శి దూషితచరిత్రుల జీవితముల సంస్కరించు నిమిత్తము వారల సావధానచిత్తులఁ గావింపుచు, సంస్కరింపఁ జూచుచుండునే కాని నిందింపనొల్లఁడు. దస్యుఁడు చౌర్యమొనరింప శీఘ్రకాలమందే సంపదల నార్జించి సుఖించుమార్గమును గ్రహింపుచున్నాఁడు. నరహంతకుఁడు మానవుల సంహరించుట నొక దోష మని విశ్వసింపక పోవచ్చును.

ప్రతిమానవుని కార్యము వాని జ్ఞానపరిపాకము ననుసరించియు, నజ్ఞానాంధకారము ననుసరించియు నిర్వహింపఁబడుచుండఁగలదు. వాని జ్ఞానసీమ నతిక్రమించి వాని జీవితమును, గార్యములును నుండనేరవు. వాఁడు వాంఛించినచోఁ దన్నుఁ దానే సంస్కరించుకొని తన జీవనజ్యోతిని, జ్ఞానమును వృద్ధి గావించుకొనఁ గలుగుచున్నాఁడు. క్రుద్ధుఁడగు మానవుని జ్ఞానము సమానమును, ధైర్యము లేనియుండని హేతువుచేతనే వాఁడు సదా విరక్తుఁడగుచు, నన

హ్యించుకొనుచు సమస్తలోకమును నకారణముగ దూషింపు చుండును. వినయ విధేయతల నభ్యసింపని మానవుఁడు ప్రమాదుల మహాత్మును గ్రహింపఁజాలఁడు. అసత్యభాషియుఁ, బరులదోషముల గణించునట్టియు మానవుని స్థితి యిట్టిదే యగును. చోరుని జ్ఞానానుభవములు లపరిపక్వములయి యుండుచుండును. వాని స్వాంతమును, గార్యములును నజ్ఞానతిమిరముచే నాచ్ఛాదితములయి యుండుచుండును. తన యధమస్థితితో సరిపోల్చుకొనుటకేని యతఁడున్నతజీవితము నెపుడును గడపియుండ నేరఁడు. అతఁడు తనజీవితముకంటెఁ బవిత్రమగు జీవితము లేదనియే భావింపుచుండును. అంధకారము నందుఁ బ్రకాశము ప్రజ్వరిల్లుచున్నది. కాని యంధకారమున కాప్రకాశముయొక్క యనుభవము కలుగనేరదు. ఆత్మస్తుతి పరాయణుఁడగు మూఢుఁ డంధకారమునుండి జ్ఞానశూన్యుఁడగుటచే దనస్థితిని బాగుగా గ్రహింపనేరఁడు.

మనుష్యుఁడు చీటికి మాటికి దుఃఖముల ననుభవించి తన నడవడిపై నిజదృష్టిని బ్రసరింపఁజేసినంతనే తన యజ్ఞానముయొక్క క్రోధాసత్యాది దుర్గుణములమూలముననే తనకనేకములగు క్లేశములు సంభవించిన వని గ్రహించి, యా సమస్తదోషముల విసర్జించివైచి, తద్విరుద్ధములగు పరమోజ్జ్వల గుణగణముల నన్వేషించి, వాని నభ్యసింప నారంభింపు

చున్నాఁడు. అతఁడు దృఢసంకల్ప పూర్వకముగ శ్రేష్ఠతర మగు మార్గము ననుసరించినంతనే సత్పథముయొక్కయు, దుష్పథము యొక్కయు జ్ఞానము కలుగఁ దాను బూర్వావస్థ యందు ఘోరాంధకారమునఁ జిక్కియుంటినని గ్రహింపఁ జేయు చున్నాఁడు. మంచిచెడ్డలయొక్క యనుభవమును జూచుచుం డుటవలననే జ్ఞానప్రకాశము విస్తరిల్లుచున్నది.

మనుష్యుఁడు పరులకార్యముల వారి దృష్టితోడనే విలోకింపుచు, వారి కొలఁతబద్దతోడనే కొలచుట కారం భించినంతనే వారియందు దోషములు కానవచ్చుట నిరోధింపఁ బడుచున్నవి. కారణమేమన నతఁడు ప్రతి మనుష్యునకు గొలఁతకఱ్ఱలును, ఆదర్శములును భిన్నములుగా నుండుచుండు నని గ్రహించును. విశ్వమందు స్వల్పసంఖ్యాకులచే నయిన ప్రేమింపఁబడనట్టి హీనాతిహీనములగు దోషములేవియు లేవనియే చెప్పవచ్చును. ఇదియే చందమున నల్పసంఖ్యాకులచే నయిన నిందింపఁబడని సర్వోత్కృష్టములగు సద్గుణములును విశ్వమునఁ గానరావు. సకలప్రపంచముచే నైక్యభావముతోఁ బ్రశంసింపఁబడు వస్తువేదియు నీధరాతలంబున గోచరింపదు. మనుష్యుఁ డేద్దానిని హీనముగ భావించునో, అది వాని కొక్క నికే హీనమయినది. వాఁ డేద్దానిని మంచివస్తువుగఁ బూజించునో అదియు వానివిషయముననే మంచిదిగ భావింప వలనుపడు

చున్నది. ఒకనిమేలు మఱొక్కని కీడు కావచ్చును. లోకమండలి యీ తారతమ్యము కేవలము గ్రహించుటలో నున్నది. పవిత్ర చారిత్రుఁడగు మనుష్యుఁడు లోకమండలి యధికసంఖ్యాకులు తనచే నిర్దేశింపఁబడు మార్గము ననుసరింపుచుండవలయు నను ధర్మవిరుద్ధములగు వాంఛలకు, దన మదియందుఁ దావొసంగఁజాలఁడు. అతఁడు మనుష్యులెల్లరు తమతమ యభిప్రాయముల ననుసరించి వర్తింపుచు స్వతంత్రులయి జీవించునపుడే మిక్కిలి హర్షింపఁగలఁడు. అతఁడు సర్వదా పరుల స్వతంత్రజీవితనిర్వాహణమునకు యథాశక్తిఁ దోఁడుసూప యత్నింపుచుండును. కారణమేమన నతఁడు సమ్మతిమాఱుటకంటె ననుభవము వర్ధిల్లుటవలననే సమున్నతమగు జ్ఞానమును, బహుళానందమును గలుగుచున్నవని గ్రహింపుచున్నాఁడు.

లోకమండలి ప్రతిమానవుఁడు ప్రాయికముగాఁ దనతో నేకీభవించి భిన్నాభిప్రాయము లేక యుండు వ్యక్తిని సజ్జనుఁడనియు, భిన్నాభిప్రాయముచేఁ దనతో నేకీభవింపఁజాలని మనుష్యుని ధూర్తుఁడనియు నుడువుచుండుట మనము విలోకింపుచునే యున్నారము. తన్నధికముగాఁ బ్రేమించుకొనుచుండు మనుష్యుఁడు తన యభిప్రాయములఁ జూచుకొనుచు సదా ముగ్ధుఁడగుచుండును. అతఁడు తన యభిప్రాయముల నభిను

సించువారల నాశీర్వదింపుచుఁ బ్రశంసింపనివారల దూషింపుచుఁ బరాభవింపఁ జూచుచుండును. " ప్రేమించువారలఁ బ్రేమించుటయం దేమి గొప్పతనము కలదు? శత్రువులఁ బ్రేమించువాఁడే బ్రశంసాపాత్రుఁడు." అని జీసను శిష్యకోటి కుపదేశించి యున్నాఁడు. అహంకారాభిమానములు మానవు నంధుని గావించివైచును. నేఁడు వివిధములగు ధర్మసంప్రదాయములు పరస్పర ద్వేషములచే దుఃఖమయస్థితికిఁ బ్రాపించుచున్నవి. భిన్నమతావలంబులగు రాజనీతిజ్ఞులొండొరులయందుఁ గలహించి పరస్పరము దూషించుకొనుచున్నారు. పక్షపాతహృదయముగల మనుష్యుఁడు తనయాదర్శము ననుసరించియే లోకమును బరీక్షింపుచుఁ బక్షపాతబుద్ధితో సర్వత్ర తనయాధిక్యమునే స్థాపించుకొనఁ జూచుచుండును. వాఁడు సదా తన్ను సత్యసంధునిగను, బరుల నపరాధులుగను నిశ్చయింపుచుండును. వాఁడు పరుల కభిలాష లేకున్నను, వారిబుద్ధికి విరుద్ధముగనున్న తనకర్తవ్యపథము ననుసరింప దండనముననుఁ, దౌర్జన్యమునను బలాత్కరింపుచుండుట యనివార్యమగు నుత్తమధర్మమనియే విశ్వసింపుచుండును. మొగలాయీ ప్రభుత్వకాలమున స్వధర్మమం దంధభక్తిని గలిగియున్న మహమ్మదీయుఁడు శుద్ధసాత్త్వికచరిత్రుఁడగు హైందవుని బాధించి మతభ్రష్టునిఁ జేయుటయే మోక్షదాయకమును, భగవత్ప్రీతికరమును నగు తనధర్మ మని త్రికరణముల విశ్వసింపుచుండెను.

మనుష్యు లొండొరుల ద్వేషించుకొనుచు, దోషపాత్రులఁ గావించుకొనుచు, కలహింపుచు దుఃఖముల నుదయింపఁ జేసికొనుచున్నారు. వారు యథార్థముగ దుష్టులయి యుండుటచే నీరీతి భ్రష్టులగుచుండుట లేదు వారు మంచిచెడ్డల గ్రహించి దుష్టకార్యములకుఁ గడంగుచుండుటలేదు ద్వేషమును, దూషణమును వారు జీవితోన్నతిప్రాప్తి కావశ్యకములగు ధర్మము లని విశ్వసించుటవలననే యిట్టి నింద్యకర్మలకుఁ బాల్పడుచున్నారు. మానవులెల్లరు నాంతరికముగ మంచివారలే; కాని వారియందుఁ గొందఱు మిక్కిలి బుద్ధిమంతులు. మఱికొందఱు వారికంటె ననుభవమునందు గణ్యులు. కొంతకాలమునకుఁ బూర్వము మధుసూదనుఁడు, సురేంద్రనాథుఁడను నిరువురు యువకులు సతీశచంద్రుఁడను సుప్రసిద్ధ రాజనీతిధురంధరుని విషయమయి వాదవినోదములు గావించుకొనియుండిరి. విద్యావంతులగు నాయిరువురి వాదోపవాదములు చదువరులకుఁ బ్రయోజనదాయకము లగునను విశ్వాసముచే నీదిగువ నుదహరింపుచున్నాఁడను.

మధు—భూలోకమందుఁ బ్రతిమానవుఁడును దనభావముల యొక్కయుఁ, గర్మలయొక్కయు ఫలమును బడయుచున్నాఁడు. మనుష్యుఁడు స్వయంకృతములగు పాపములచే దుఃఖముల ననుభవింపవలసినవాఁ డగుచున్నాఁడు

సురే:—మిత్రమా! నీ నుడువులు నా కంతగా సంతోషమును కలిగింప లేదు. మనుష్యుఁడు స్వయంకృతములగు దుష్కర్మలయొక్క దండనమునుండి తప్పించుకొనఁజాలనివాఁ డగుచోఁ బ్రతిభాశాలురగు రాజనీతి ధురంధరు లెందఱో తమంతటి తామే యెంతటి భయంకర నరకముల నిర్మించుకొనుచున్నారు! మనుష్యుఁ డధికారయుతుఁడును, శక్తిసంపన్నుఁడును నయియున్నను, గాకున్నను దాను పాపమందును, నజ్ఞానమందును నున్నంతపర్యంత మవశ్యము ఖేదము ననుభవింపవలసినవాఁ డగుచున్నాఁడు.

మధు—ఉదాహరణమునకయి సమస్తవిధముల దుష్టుఁడును, స్వార్థపరుఁడును, లుబ్ధుఁడును నగు సతీశచంద్రుని విలోకింపుము. ఇట్టి దుష్టమానవుని నిమిత్తము మిక్కిలి కష్టదాయకములగు దండనలు విధింపఁబడఁగలవు.

సురేం—సతీశుఁ డిట్టి దుష్టుఁడని నీ వెట్లు గ్రహింపఁగలుగుచున్నాఁడవు?

మధు—అతని కార్యములే యతనిచారిత్రమునకుఁ బలవత్తరములగు ప్రమాణములు. పరుల నెవ్వారినయిన నిందించు వ్యక్తిని గాంచినంతనే నే నతనిని దుష్టునిగ నిశ్చయింపుచుందును. నేను సతీశచంద్రుని వీక్షించినంతనే వాస్తవికముగు క్రోధముచే మండిపడు

చుండును. ఎవఁడేని యొకమనుష్యుఁడు పరులకు నష్టమును కలిగించునట్టి పదవి నధిష్ఠించియుండఁ జూడ నే నవుడవుడు వానియందు లోకోపకార మొనరించు నట్టి శక్తియే లేదాయను సందేహమునకుఁ బాల్పడు చుందును.

సురేం—చెలికాఁడా! నలీశచంద్రుఁ డేమయిన నీడ్యా నరింపు చున్నాఁడా?

మధు—అయ్యో! సందేహమేల? వాని కుటిలనీతి మిక్కిలి చెడ్డది. అధికారగర్వముచే నతఁడు సకల ప్రపంచమును దగ్ధమొనరించుటకేని శంకింపనంతటి రాక్షసుఁడు.

సురేం—నీవలెనే చాలమంది మనుష్యులు నలీశుని దుర్మార్గునిగనే నిశ్చయింపుచున్నారు. కాని నీవంటి బుద్ధిమంతులే వేలకొలఁదిగ నలీశుని పరమయోగ్యుఁడని విశ్వసించి వానియోగ్యత ననేకరీతులఁ బ్రశంసింపుచు, నతని రాజనీతిజ్ఞానముచే దేశకల్యాణము కాఁగల దని నిశ్చయింపుచున్నారు. అతని యధికారస్థితి యిట్టివారివలనే ముఖ్యముగా నవలంబితమయి యున్నది. నలీశ చంద్రుని మంచివాఁడని భావించు వీరునయితము దుష్టులేనా?

మధు— వారు భ్రమయుండున్నారు. వేలకొలఁది జనుల కండ్ల గప్పివచ్చిన సతీశుని దుష్టత్వ మపారము. అతఁడు స్వార్థసిద్ధికయి కపటవేషధారియగు బుద్ధిమంతునివలె నల్లరకు గోచరింపుచు నాంతరికముగఁ బాపముల నొనరింపుచున్నాఁడు. నే నట్టి గోముఖవ్యాఘ్రము నసహ్యించుకొనుచుందును.

సురేం—నీవుసయిత మొకవేళ ప్రజాసామాన్యమువలెనే మోసగింపఁబడఁగూడదా?

మధు— అదెట్లు?

సురేం—ద్వేషమును, జుగుప్సను గలిగియుండుటయే నాత్మవంచనము. ప్రేమ ఆత్మజ్ఞానము. మనుష్యుఁడు ద్వేషించుటను బాసి, ప్రేమభావమును గలిగియుండుట నభ్యసింపనంతపర్యంతము పరులను, దన్ను దివ్యదృష్టితో వీక్షింపఁజాలఁడు.

మధు—సంగడీఁడా! నీ యీ వచనము సత్యమయినది; కాని యిది యసాధ్యమును, అసంభవమును నయియున్నది. నే నవఁడేని నొక మనుష్యు నన్యుల దూషింపుచు, మోసగింపుచు, నసత్యమార్గము ననుసరింపఁ జేయుచు నుండఁ వీక్షింతునేని యవశ్య మవ్వానిని గర్హింపవల

సిద్ధమై యుండును. ఇట్లాచరించుట యనుచితము కానేరదు. సతీశచంద్రుని యంతఃకరణము లేదనియే నుడువవలసివచ్చుచున్నది.

సురేం—నీవు భావించునట్టి స్థితియందు సతీశచంద్రుఁడున్నాఁడనియు, లేఁడనియు నిశ్చయముగా వచింపఁజాలము. ఒకవేళ నీవు వచించినరీతిగనే సతీశచంద్రుఁడు దురాత్ముఁడయి యుండవచ్చును; అంతఃకరణములేని జడుఁడయి యుండవచ్చును. అట్టివానియెడ దయనుజూపుటను ధర్మమా లేక జుగుప్సను వెల్లడించుట ధర్మమా?

మధు—ఇది యెట్లు?

సురేం—సతీశున కంతఃకరణము లేదనియేకదా నీవు నుడివియుంటివి?

మధు—నిస్సందేహముగ నతని కంతఃకరణము లేదనియే నుడువవచ్చును.

సురేం—అట్లగుచో నతఁడు జ్ఞానమునుబట్టి విచారించినచోఁ బంగువగును. నీవంధులను వారు చూడలేరు కదాయని యేవగించుకొందువా? మూఁగని గాంచియు, బధిరునిఁ జూచియు వారు మాటాడలేరనియు, వినఁజాలరనియు నేవగించుకొందువా? సముద్రముపైఁ బ్రయాణ

మొనరించుచున్న నావికుని హస్తమునుండి తెప్పజారి మున్నీట మునిగిపోవ నానౌక యొక్క కొంకను డీకొని భగ్నమగుచోఁ "కర్ణధారీ! నీవేల నీనావను కొండ నుండి దూరముగా నుంచుకొనక పోయితి" వను నుపాలంభనవాక్యములచే విపత్తునందున్న నతనిహృదయమును క్షోభింపఁ జేయుదువా? నావయందలి యాత్రికుల ప్రాణహానికి నావికునే బాధ్యునిగ నిశ్చయింతువా? అంతఃకరణము లేని మానవునియొద్ద సరియైయున మార్గమున మనుష్యుల నడిపించునట్టి పథప్రదర్శకయంత్రములగు సత్యధర్మములు కలవు. కావుననే వానికి స్వార్థము ధర్మయుక్తముగను, సత్యముగను గాననగుచున్నది. నటేశుఁడు నీకుఁ జెడ్డవాఁడు కావచ్చును. కాని యతఁడు తనవిషయమున దుర్మార్గుఁడు కానేర్చునా? అతఁడు స్వయముగాఁ దన్ను దుశ్చరిత్రునిగ భావించుకొనుచుండునా?

మధు—అతఁడు తన్నుఁదా నొక దుర్మార్గునిగఁ దలంచుకొనకున్నను వాస్తవమునకుఁ బరమదుష్టుఁడే.

సురేం—నటేశచంద్రుని నీ వసహ్యించుకొనుచున్నావుగదా యని నేను నిన్ను చెడ్డవానిగాఁ దలంచినచో నేను దోషిని కాకుందునా?

మధు—లేదు.

సురేం—అది యేమి?

మధు—కారణమేమన నిట్టిస్థితియందు నన్నేవగించుకొనవలసిన యగత్యములేదు. నేను స్వార్థము నపేక్షించికాని, నిజాభిమానమునకు భంగము వాటిల్లుననికాని సతీశ చంద్రుని దూషించి యుండలేదు. లోకకల్యాణమునకు విరుద్ధముగ వర్తించుటవలననే వానిని నేను గర్హించితిని. ఇట్టిస్థితియందు ఘృణపరమావశ్యకమును, నుచితమును, సత్యమును గాఁగలదు. సత్యమగు క్రోధమును, సత్యమగు ఘృణయు నేవగింపఁ బడ రానివి.

సురేం—సత్యమగు స్వార్థమును, సత్యమగు లోభమును, సత్యమగు నిందయు నీయొక్క సత్యమగు క్రోధమువలెనే యెందులకు సన్మానింపఁబడరాదు? నీ వేదేని విషయమును గ్రహించి యాచరింపుచున్నచో సతీశచంద్రు నేవగించుకొనుటనే మనుష్యత్వముయొక్కయు, నాగరికతయొక్కయు నుచితమగు కర్తవ్యముగ భావింపుచున్నచో నేను నీయాపనులకయి నిన్ను చెడ్డవానిగాఁదలంచిన యది నాతప్పగును. జుగుప్సకంటె మఱియొక నుత్తమంబగుమార్గము కలదు. ఆయుత్తమమార్గపరిజ్ఞానమే

నన్ను సతీశచంద్రు సేవగించుకొనుటనుండి నిరోధింపు
చున్నది. కారణమేమన సతీశుని చారిత్రము నాకెంత
నీచముగానున్నట్లు గోచరించినను, నతనికిని, అతని
సహకారులకును మాత్రము చెడ్డదిగా గోచరించుట
లేదు.

మధు—అయుత్తమంబగు మార్గమేది ?

సురేం—అది సువిశాలమగు ప్రేమమార్గము. పరుల నేస్థితి
యందును చెడ్డవానిగాఁ దలంచు స్వభావమును బరిత్య
జించివేయుటయే ప్రేమలక్షణము. ఇయ్యది మానవ
హృదయముయొక్క యొకానొక శాంతిమయంబును,
నానందయుక్తంబును నగు భవ్యస్థితి.

మధు—ఒకఁడు మఱొక్క మనుష్యు నకారణముగ దూషింపు
చుండ నీవు కుపితుఁడవు కాకుండ నుండఁగలవా ?

సురేం—నాయభిప్రాయ మదికాదు. మనుష్యుఁడు పరులయెడ
దుర్భావమును గలిగియున్నంతవఱకు వారిపైఁ గోప
మును వహింపుచునే యుండఁగలఁడు. కాని వాఁడు
ప్రశాంతబుద్ధియొక్కయుఁ, బవిత్రప్రేమయొక్కయు
నుస్థితికిఁ బ్రాప్తించినంతనే క్రోధమునకు హేతు
భూతమగుచున్న కీడును లేశమాత్రమును దనయందుఁ
జూడనేరఁడు. అట్టి దతనికి మానవులయొక్క వివిధ

విధములగు స్వభావము లన్నియు విశదమగుచు వెంటనే యతఁడు మనుష్యులెల్ల రేరీతి కార్యాచరణ తత్పరు లగుచున్నదియు, దమ భావములకును, గర్మలకును నెట్టి ఫలితములఁ బొందుచున్నదియు స్పష్టముగా గ్రహింపఁగలుగుచున్నాఁడు. ఇట్టి స్థితిచే మానవుఁడు సమస్తమానవుల ననుకంపతోడను, నిష్కల్మషమగు ప్రేమతోడను విలోకింపఁ గలుగుచున్నాఁడు.

మధు—నీవు నుడివియున్న పరమ పవిత్రమగు స్థితి నిస్సందేహముగ సర్వోచ్చమును, మనోహరముగను నున్నది. కాని నే నిట్టి స్థితికిఁ బ్రాపించుటను దుఃఖదాయకముగ భావింపుచున్నాఁడను. సతీశచంద్రునివంటి లోకోపకార పరతంత్రులగు దుష్టుల వగించుకొనుట మాని గాఢాలింగన మొనరించుకొనుట నాచేఁ గానేరదు.

ఈ వాదవివాదముచే మధుసూదనుఁడు ద్వేషమును, జుగుప్సను బ్రేమింపుచుండుటచే వానిని విసర్జింపఁ జాలనని వచించియున్నట్లు మనకు స్పష్టపడుచున్నది. ఇదియే చందమాన సమస్త మానవులు తా మాచరించు కార్యములనే పరమావశ్యకములుగను, సర్వోత్తమములుగను భావింపు చుందురు- మనుష్యు జీవితములను సంపూర్ణముగా విశ్వసింపు చుందునో వానినే యాచరింప నలవడుచున్నాఁడు. ఒక

కార్యమందు మానవుని విశ్వాసము తొలఁగిపోయినచో నవశ్య మతఁడా కార్యమును విసర్జించివేయుననుట కేమియు సందేహము లేదు. మధుసూదనుఁడు లోకమందలి యితర మానవులవలెనే స్వార్థపరుఁడయి కోరినప్పుడెల్లఁ బరుల ద్వేషింపఁగలుగుచున్నాఁడు. ఇది వాని స్వాభావిక స్వత్వమయినది. ద్వేషభావమును గలిగియుండుటచేఁ దత్ఫలితముగాఁ బ్రాప్తములగు దుఃఖములను, మనోవ్యాకులతను మనుష్యుఁ డనుభవించినఁగాని ద్వేషముయొక్క భయంకర తత్త్వమును గుర్తించి "అయ్యో! ద్వేషము కరము హానికరము. దీనిని గలిగియుండుటకంటె మౌఢ్యము, గ్రుడ్డితనము లే" దని విచారింపుచు ద్వేషమును విసర్జించివేయఁగలఁడు.

ఒకతూరి సుప్రసిద్ధుఁడగు తన యాచార్యు నొకశిష్యుఁడు మంచి చెడ్డలయందుఁగల తారతమ్య మేమని ప్రశ్నింప నా దేశికుఁడు తనహస్తముయొక్క యయిదు వ్రేళ్ళ నధోముఖముగ నుంచి శిష్యు నీరీతిఁ బ్రశ్నించెను. "కుమారా! నాహస్త మేదిశకు వంగియున్నదో చెప్పఁగలవా?" శిష్యుఁడంత నీచందమునఁ బ్రత్యుత్తర మొసంగెను. -"గురుదేవా! మీహస్తము క్రిందివైపునకు వంగియున్నది." గురుదేవుఁడంత తనహస్తమును బైకెత్తి "ఇపుడు నాహస్త మేదిక్కును సూచింపుచున్న" దని ప్రశ్నించెను. శిష్యుఁడంత యూర్ధ్వదిశయని యుత్తర

మిచ్చెను. ఆచార్యుఁడు శిష్యుని రెండుత్తరముల నాలించి సుప్రసన్నుఁడయి 'నాయనా! మంచి చెడ్డలయం దీభేదమే సుస్థిరముగా వెలయుచున్నది. కీడుచే మనుష్యుఁ డధఃపతితుఁ డగును. మేలుచే నూర్ధ్వస్థితికిఁ బ్రాపించును. గురూత్తముని యీ సులభోదాహరణములచేఁ బ్రకృతిసిద్ధమగు శక్తి నశుద్ధకార్యములకును, ననుచిత ధర్మములకును వెచ్చించుటయే కీడు. ఆశక్తిని విశుద్ధమగు కార్యములకును, సముచితములగు భావములకును వినియోగించుటయే మే లనఁబడుచున్నది. ఇదియేచందమునఁ బ్రపంచనిందకుఁ బాత్రుఁడయినమనుష్యుఁడు గురువుగారు చేతివ్రేళ్లఁ బైకెత్తినట్లు అధమస్థితికిఁ బ్రాపించుచున్న తన చారిత్రము నుద్ధరించుకొను టావశ్యకము. మేలు నభ్యసించుచుఁ గీడుయొక్క వాస్తవికారమును గ్రహించుచుండుటచే మనుజుఁడు పరులయందుఁ గీడును జూచు దురభ్యాసమునుండి విముక్తుఁడగుచున్నాఁడు. పరులయందలి చెడుగునుఁ జూచుట మాని తన సంపూర్ణహృదయశౌచమునకయి యథాశక్తిఁ గృషిసలుపునట్టి మనుష్యుఁ డెందును ధన్యుఁడు. ఇట్టి సంస్తవపాత్రమగు కృషిచే మానవుఁ డొకదినమున మిక్కిలి పరిశుద్ధచారిత్రుఁ డయిపోవ, వాని దృష్టిపథమునం దెట్టికీడును గోచరింపఁజాలదు.

చెడుగుయొక్క జ్ఞానమును సంపాదించిన పిదప మనుష్యుఁ డేమి చేయవలయును? అతఁ డపుడు మంచియందు లీనుఁ

క్షయిపోవలయును. నన్నెవఁడేని యపరాధిగ నిశ్చయించినచోఁ బ్రత్యపకృతిగాను నేను వానిని దోషిగా నిశ్చయింప నొల్లను. నన్నెవఁడేని దూషించినను, కుపితు నొనరించినను నే నెట్టి క్రోధభావమును వెల్లడింపక వానిపైఁ గరుణారసమును వెదఁజల్లుదును. నన్నెవఁడేని నిందింప నారంభించినచో నే నవ్వానిని స్తుతింప నారంభింతును. నన్ను వాఁడు ఏవగించుకొనినచో వానికి నాప్రేమ యవసర మయినదని గ్రహించి నేను వానియెడఁ బవిత్రమగు ప్రేమభావమును వెల్లడింతును. ధీరత్వము నెఱుఁగనివారికి నేను ధైర్యస్థైర్యములను బోధింతును. లుబ్ధాగ్రేసరులపట్ల నేనుదారహృదయముతో వర్తించెదను. లోకానుభవ మెఱుఁగని బాలురతోడను, నాస్తికసములగు కలహప్రియులతోడను సవినయముగను, శాంతముగను మెలంగెదను. నే నెవ్వానియందును గీడునే చూడనపుడు నే నన్యుల శత్రువులుగఁ దలంచి యేవగించుకొను టెట్లు పొసగ నేర్చును?

ఓ నాప్రేమాస్పదులగు సోదర సోదరీమణులారా! ప్రపంచము మిమ్ము సంహరించుటకును, ద్వేషించుటకును, సిద్ధపడుచున్నదనిన నే నెంతయు ఖేదము నందుచున్నాఁడను. నన్ను ద్వేషించువారుగాని, నాకు ద్రోహమొనరించు వారుగాని విశాలమగు నీభూమండలమునఁ గాన రాకున్నారు.

సకలమానవాళి నాపైఁ బూర్ణమగు కృపాదృష్టిని కలిగియున్నది. స్వప్నమందును నా కెవ్వానిమీఁదను రోషము కలుగుచుండుటయే లేదు.

పరుల నిందింపుచుండు మనుష్యుఁడు తన దుర్భావములకును, దుష్కర్మలకును వెనుక నాకీల్లయొక్క నానా సవిశేషము లగు ప్రేత్యక్షమూర్తులు కూర్చుండి యున్నట్లు భావింపుచుండును. కాని పవిత్ర హృదయుఁ డగు మానవుని వెంట నెట్టిభూతములు నుండ రవు. సత్పురుషుఁ డొకవేళ పరుల కార్యములయొక్క మంచిచెడ్డలను గణించి విచారించినను వానిని పాపజాలములు వెంటాడ నేరవు. ప్రపంచతత్త్వము త్రపుష్టమయినది. ఆతత్త్వమునందుఁ జెడ్డకుఁ దావులేదు. బుద్ధిదోషము ననే కేవలకార్యములు దూషితము లగుచున్నవి. మేలు శాశ్వతమయినది. కీడు స్థిరము లేనిది. ఒక్క మాతృగర్భమున జనించిన సోదరీ సోదరు లేకగృహమం దధివసింపుచు శ్రమించుకొనుచు సుఖదుఃఖముల నొండొరుల సాహాయ్యమొనరించుకొనుచు, వారియం దెవఁడేని ప్రమాద మొనరించిన క్షమించుకొనుచు నొకరి నొకరు దూషించుకొనక శాంతముగ జీవించు విధమున సహృదయుఁడగు మానవోత్తముఁడు లోకమందలి సమస్తమానవు లనేక మాతృగర్భసంజనితులగు సోదరీ సోదరులుగను, నాకే తత్త్వముచే స్ఫురిం

పఁబడినవారిగను, నొకే యాదర్శము ననుసరించుచున్నవార లగను భావించి మనసారఁ బ్రేమించుచుండును. అతఁడు తన కంటె నధికప్రాయముగల పురుషులఁ బితృసమానులుగను, సమవయస్కుల సహోదరులుగను, చిన్నల బిడ్డలుగను, ప్రాయమునందు పెద్దవారగు స్త్రీల మాతలుగను, సమవయస్కుల సోదరీమణులుగను, బాలికలఁ బ్రియపుత్రికలుగను భావించి ప్రేమించుచుండును. అతఁడు సకల ప్రపంచమును తననుండి భిన్నవస్తువుగ భావింపనొల్లఁడు. సమస్త మానవ లోకమువట్ల నాత్మసమానమగు గౌరవభావమును గలిగి యుండి ప్రమాదవశంబునయిన నెవ్వరిని దూషింపనొల్లఁడు. ఈరీతిగ నతఁడు క్రోధద్వేషాది దుర్గుణముల నన్నింటి జయించి, విశుద్ధ ప్రేమమూర్తియయి, ఆత్మతత్త్వమును సాధించిన లోకోత్తరవిజేతయయి బ్రహ్మానందమయస్థితిఁ బ్రాపించి సమస్తవిధముల ధన్యుఁడు కాఁగలఁడు.



## నవమ ప్రకరణము.



# సుస్థిరానందము.

సుస్థిరానందమన నేమి? అది యెట్టిపదార్థము? లభించు స్థానమెద్ది? ఈప్రశ్నలనుగూర్చి యొకింత లోకానుభవజ్ఞాన సంపన్నుండగు వ్యక్తి దీర్ఘముగ విచారించినచో నవశ్యము విశ్వమానవజీవితమం దంతర్వ్యాపినియయి, శాశ్వతమయి వెలయు సుస్థిరానంద మొక స్వర్గీయపదార్థ మని గ్రహింప సమర్థుం డగును. స్వర్గీయమగు నీ సుస్థిరానందమునకుఁ బాపశూన్యమగు ప్రదేశమే నివాసస్థానము. ఇయ్యది జ్ఞానసంపన్నుండగు సత్పురుషుని పవిత్రహృదయమునందు వెలయుచుండును.

అంధకారము వెడలిపోవునట్టి యొకవిధమగు ప్రతిబింబము. ప్రకాశము స్థిరముగ నెలకొనియుండునట్టి సత్పదార్థము. అది యేవిధమున దుఃఖ మస్థిరమయినది. సుఖము లేక యానందము సుస్థిరమయినది. సత్యమగు పదార్థ మేదియు లుప్తీభూతము కానేరదు. సత్యము నిత్యమయినది, కాని-

అయథార్థమగు పదార్థము స్థాయిగ నుండనేరదు. దుఃఖ మసత్య మయినది. కావుననే యది యస్థిరము. ఆనందము తథ్యమయి నది. కావుననే యది శాశ్వతమయినది. ఒకింతకాలపర్యంత మా నందము గోప్యముగ నుండియున్నను, తిరిగి మానవునకు సంప్రాప్తము కాఁగలదు. దుఃఖ మొకింతకాల మున్నను బ్రియతత్త్వ మొక్కటే దూర మొనరింపఁ బడుచున్నది.

మానవమూర్తీ! నీదుఃఖములు స్థిరముగా నుండఁగల వని భావింపకుము. దుఃఖపరంపరలు గగనమండలమందలి నీలాంబుదశకలములవలె క్షణమాత్రకాలమున నదృశ్యము లైపోఁగలవు. పాపసంభూతములగు క్లేశముల నదా యనుభ వించునిమిత్తమే నీవు సృజింపఁబడియుండలే దని గ్రహింపుము. క్లేశములన్నియు భయంకరస్వప్నములవలె రెప్పపాటుకాలము నందంతర్హితములయిపోఁగలవు. భయ విషాద సందేహముల విసర్జించివేయుము! లే, లెమ్ము!! పవిత్రహృదయుండవయి, పాపవిదూరుఁడవయి నిత్యానందము ననుభవింపుము.

నీవే నీస్వప్నముల రచించుకొనుచుంటివి. లోభగ్రస్తుఁడ వయినకొలఁదియు దుఃఖభూధరములు నీపై విరిగిపడు చుండఁగలవు. అపుడు నీవు గొంతెత్తి రోదనమొనరించిన ప్రయోజనము కలుగనేరదు. నీవు లోభమును విసర్జించిన కొలఁదియుఁ బ్రవిమలానందచిత్తుఁడవయి సుఖింపఁగలవు.

నాయనా! నీవు దుఃఖముయొక్క శక్తిహీనుఁడవగు దాసుఁడవు కావు. అనూనమును, అక్షయమును, అపారమును నగు భవ్యానందము గృహద్వారమునఁ గూర్చుండి నీకొఱకుఁ బ్రతీక్షించుచున్నది. నీవు పాపమయ స్వప్నముల యొక్కయు, గాఢాంధకారములయొక్కయు నసహాయుఁడవగు ఖైదీవి కావు. ఇప్పటికిని నిమీలితములగు నీ నేత్రముల యొక్క రెప్పలపయిఁ బారిశుద్ధ్యముయొక్క మనోహరమగు జ్యోతి ప్రకాశించుచు నీ జాగరణమునకయి నిరీక్షించుచున్నయది.

స్వార్థముయొక్కయుఁ, పాపముయొక్కయు దుఃఖపరిపూర్ణమగు గాఢసుషుప్తియందు సుస్థిరానందము విస్మరింపఁబడి పోఁగొట్టుకొనఁబడుచున్నది. అపు డా పవిత్రానందముయొక్క గంభీరములగు గీతములు శ్రుతిగోచరములు కానేరవు. తదానందముయొక్క దివ్యపుష్పసౌరభము పాంథుని హృదయమును హర్షాబ్ధి నోలలాడింప నసమర్థమయిపోఁగలదు.

పాపములును, స్వార్థమును బరిత్యజింపఁ బడినపుడు—ఇంద్రియసౌఖ్యములనిమిత్తము విషయాదులయం దాసక్తమగు దుష్టపద్ధతిని విసర్జించినపుడు మానవుని బాధించుచున్న శోకభయాదు లంతరింప, వానిహృదయ మజరామరమగు బ్రహ్మానందజ్యోతిచే నుద్దీపితము కాఁగలదు.

పాపమును సంపూర్ణముగా బహిష్కరింప సమర్థమయిన హృదయమునుండియే నిర్మలానందము బహిర్గతమగుచున్నయది. ప్రశాంతస్వభావమానందమున కునికిపట్టు. ఆనంద సామ్రాజ్యముయొక్క పునాదులు పుణ్యచారిత్రుల బాహుబలముపై నాధారపడియున్నవి. స్వార్థపరాయణు లానంద సామ్రాజ్యమందలి భయంకర విప్లవకారులు. ఆనందము స్వార్థులనుండి కడుదూరముగ నుండుచుండును. కలహప్రియుల నిది కన్నెత్తి వీక్షింపనొల్లదు. పాపాత్ములదృష్టికి నిత్యానందము సదా యగోచరమయి యుండుచుండును. హర్షము సుకృతముతోఁగూడి నిత్యము కాపురము సేయుచుండునట్టి మనోహరమును, పవిత్రమును, కోమలమునునగు నొకస్వర్గీయ పదార్థము. ఇయ్యది స్వార్థవాయువును గాంచినంతనే యంతర్హితమగుచు సదా ప్రేమ నన్వేషించుచుపోయి దానిని జేరుచుండును.

స్వార్థాభిలాష క్షీణించుచున్నకొలదియు హర్షమనూనమగు పరిమాణమందు మానవునకు లభించుచున్నది. హర్షముయొక్క సంపూర్ణస్థితియు, స్థిరత్వమును కేవలమొక్క పుణ్యాత్ములకే లభించుచుండుటలేదు. అయ్యది సర్వసాధారణులకును, వారేయేగడియయందు స్వార్థమును విసర్జించుచుందురో ఆయా గడియయందు హర్షము రుచిజూచుటకుఁ దగినంతగా

లభించుచున్నది. విలాసయుతము కానట్టియు, క్షణికము కానట్టియు, దూషితము కానట్టియు, శోకదాయకముకానట్టియుఁ, పవిత్రానందము మానవుని స్వార్థశూన్యమును ధర్మాశ్రితమును, సత్యానుగుణ్యమును నగు ప్రతిభావమందును, గార్యమందును బుష్కలముగా లభించుచున్నది.

మానవుని స్వార్థత్యాగమునుబట్టియే వాని కానందమును సంప్రాప్త మగుచుండును. స్వార్థత్యాగమునకును, నిత్యానందమునకును బ్రగాఢమగు బాంధవ్యముకలదు. మనుష్యుఁడు స్వార్థాంధుఁ డగుచున్న కొలఁదియు నవశ్యము దుఃఖతుఁడును గావలసి వచ్చుచుండును. అహంకారమును, స్వార్థమును డీకొని వానిపై సంపూర్ణమగు జయమును బడసిన మనుష్యుఁడే సజ్జనుఁడు; సత్పురుషుఁడు. ఆనంద మట్టి సత్పురుషుల పెన్నిధి. జీవితాంతమందు దుఃఖము కలుగునని యథార్థమగు నాచార్యుఁ డెవఁడును నుడువ నంగీకరింపనొల్లఁడు. జీవితాంత మహానందవిలసితమనియే యతఁడు విన్నవించుచుండును. అతఁడు పాపముయొక్క కారణముచే ననివార్య మగుచున్న దుఃఖము నోక ద్వారమనియే వచింపుచుండఁ గలఁడు. అహంకార స్వార్థము లెచ్చోట సమాప్తము లగుచుండునో, అచ్చోటనుండియే శోకములు దూరముగాఁ దొలఁగి పోవుచున్నవి. హర్షము సత్యముయొక్క పరమబంధువు. పవిత్రజీవితమందు

తొలుత నిచ్చట దుఃఖము రోదింపుచుఁ గూర్చుండియుకునో, కోమలమగు దయ యచ్చటనే మూర్తీభవింపఁగలదు. స్వార్థత్యాగ ప్రయత్నమందు మానవుని బహువిధములగు దుఃఖము లాక్రమించుట యథార్థము. భ్రష్టుఁడు పవిత్రుఁ డగుటయం దవశ్యము క్లేశముల ననుభవింపుచున్నాఁడు; కాని ప్రతిమానవుఁడు మహాత్ముఁడగుటకు యత్నించునపుడే భయ విషాదములకు గురియగుట తటస్థించును గాని, సంపూర్ణముగా సంస్కరింపఁ బడిన పిదప వాని జీవితమందంతట బ్రహ్మానం దమే- బ్రహ్మానందము తాండవింపఁగలదు.

కుమారా! సుందరమగు పుష్పమెట్లు సిద్ధమగుచున్నదో విచారింపుము. తొలుదొలుత నొక క్షుద్రమగు నంకుర మంధ కారమయమగు మృత్తికాంతర్భాగమునుండి తనమార్గము నన్వేషింపుకొనుచు వసుధోపరిభాగముయొక్క ప్రకాశము నుద్దేశించి బహిర్గత మగుచున్నది. పిదప నొకసన్నని మొక్క దృగ్గోచర మగుచున్నది. తదనంతరము కిసలయములఁ బొడ వుచు వానినే పత్రములుగ సిద్ధమొనరింపుచున్నది. అసంఖ్యా కములగు దళములచే సుశోభితమయి మొక్క వృక్షముగ మారి మొగ్గలను దొడుగుచున్నది. తుదకా మొగ్గలనుండియే సంపూర్ణములగు పుష్పములు బహిర్గతములయి విశ్వముయొ క్క నల్దెసలఁ దమదివ్యసౌరభమును, సౌందర్యమును, సౌకు

మార్యమును వెల్లడించి ప్రకృతియొక్క ప్రయత్నమును సమాప్తమొనరించి వేయుచున్నవి.

మానవజీవితమునయిత మీ పుష్పస్థితిని బోలి యున్నది. మనుష్యుఁడు తొలుత స్వార్థముయొక్కయు, నజ్ఞానముయొక్కయు గాఢాంధకారముయొక్క భూగర్భము నందుండి జనుపాంధునివలెఁ బ్రకాశమును దడుముకొను చున్నాఁడు. అతఁ డట్లు కొంతకాలము తడుముకొనుచు గాఢాంధ కారమునుండి ప్రకాశమునఁ జొచ్చి క్రమక్రమముగా వేదనా దుఃఖముల ననుభవించి స్వార్థమును దూరమొనరించి యుద్ధ రింపఁ బడుచున్నాఁడు. అతఁ డంతమున వికసిత పుష్పము రీతి స్వార్థశూన్యమును, బవిత్రమును నగు జీవితమును బడసి సకలమానవాళి కనాయాసముగా శౌచముయొక్క సౌరభ మును నిత్యానందముయొక్క సౌందర్యమును ననుభవించు భాగ్యమును గలిగించుచున్నాఁడు.

పవిత్రహృదయులును, సజ్జనులును నగు మనుష్యులు సదా పరిపూర్ణానందమయులయి వెలయుచున్నారు. ఈ విష యమును జనసామాన్యము న్యాయదృష్టితో న్యాయాధిక ముగ భావించినను మానవహృదయము స్వయముగా దీనిని సత్యమని భావింపఁగలదు. జనసామాన్యము దేవదూతలను బ్ర సన్నకాయులుగ భావించుటలేదా? అస్థి చర్మ మాంస మయ

దేహులగు మనుష్యులయందును ప్రసన్నమూర్తులగు వారు కలరు. అట్టి యానందమయ దేహులగు దేవదూతలు నిత్యమును మనతోఁ గలయుట కటస్థింపుచుందురే కాని మనము దేహధారులయి తమ హృదయాంతరాళముల బ్రహ్మానందజ్యోతిని ప్రకాశింపఁజేయు దేవదూతల గుర్తించునంతటి పవిత్రహృదయులము కాకపోవుటచే వారి నెప్పటికప్పుడే ప్రతిమార్గమందు విడిచి ముందునకు సాగిపోవుచున్నాము.

పవిత్రహృదయులే నిత్యానందమయులు. పాపమందును, పాపముతోఁ బోరుటయందును నశాంతియు, దుఃఖమును గలుగుచున్నవి. కాని సత్యముయొక్క పరిపూర్ణత్వమందును, మార్గమందును నిత్యానందము లభ్యమగుచున్నది. స్వార్థముయొక్క పొల్లును మనుష్యుఁడు దూరమొనరింపనంతవఱకు దుఃఖము నెదుర్కొనవలసియే యుండును. పొల్లునందుండి ధాన్యము వేఱుసేయఁబడిన పిదపఁ బొట్టును యంత్రముచే దూరమొనరింపవలసిన కార్యబాధ్యత తీరిపోవుచున్నది. ఇదియేరీతిగ నాత్మయందుండి శోషించియున్న దోషములు దూరమొనరింపఁబడినంతనే దుఃఖముయొక్క కార్యప్రణాళిక సమాప్తమయి పోవుచున్నది. పిదప మానవునకు దీని యవసరమే కలుగనేరదు. మానవుఁడంత నిత్యానందము ననుభవింపఁ గలుగుచున్నాఁడు.

ప్రపంచమందలి సమస్త మహాసీయులును, సాధువులును, సంస్కర్తలును సహార్థముగ నొక శుభసంవాదమును తెలిపియున్నారు. ఆశుభసంవాదముల బాహ్యక లెక్కింగినయే యుందురు. రానున్న విపత్తును నిరోధించివేయుట, రోగమును దూరమొనరించుట, మిత్రుల యొక్కయు, బంధువుల యొక్కయు క్షేమసమాచారములు వచ్చిచేరుట, కష్టదమనము, ఒకానొక కార్యమందు సాఫల్యమును బడయుట మొదలగునవియే శుభసమాచారములు. కాని మహాపురుషుల శుభసంవాదమేమి? దుఃఖితులకు శాంతియు, పతితాత్ముల కావథమును, శోకపీడితులకు హర్షమును క్షుధార్తుల కాహారమును, బాపాత్ములకు విజయమును, నిరాధారులకు నివాసగృహమును, విదీర్ణహృదయుల కానందమును కలుగుటయే యీ శుభసంవాదము. ఈ మహత్తరములగు పదార్థములన్నియు జన్మాంతరమందు లభించునని భావింపరాదు. ఇవియన్నియు నీలోకమందే యిప్పుడును సంసిద్ధముగా నున్నవి. ఇవి తెలిసికొనదగినవియు, బ్రాప్తింపజేసికొనదగినవియు, భోగింపదగినవియు నయి యుండుటవలననే మహాత్ము లెలుగెత్తి చాటు రహస్యము నవలోకింపుడు.

"అన్నలారా! స్వార్థముయొక్క దృఢతమ బంధనముల ఛేదించివైచినవ్యక్తియే యీపదార్థముల నన్నింటి బడస

స్వార్థశూన్యమగు ప్రేమయొక్క దేదీప్యమానమగు స్వతంత్ర సామ్రాజ్యమునఁ జేరుచున్నాఁడు.

మానవమూర్తి! నీ వేల యాలసించెదవు? మంచితనము నన్వేషింపుము! దానిని బడసిన పిమ్మట దాని - బాగుగా నభ్యసించి, తత్సంబంధమగు ననుభవమును సముపార్జింపుము. దీనిచే నీవు మిక్కిలి గాఢమును, కోమలమును, మధురమును నగు బ్రహ్మానందము లభింపఁగలదు. నీవు పరులహితమును గూర్చి విచారించుట యందును, వారి కొఱకుఁ జింతించుట యందును, వారిని బ్రేమించుటయందును, వారిని సేవించుట యందును నెంత పరిమాణమందు నీస్వార్థమును బరిత్యజింతువో, అంత పరిమాణమందే నీవు బ్రహ్మానందము లభింపఁ గలదు. దానికంటె నధికమగు హర్షము లభించుట యసంభవము.

స్వార్థత్యాగముయొక్క ద్వారమునకు లోపల నిత్యానందమందిరము వెలయుచున్నది. అభిలాషగల ప్రతి వ్యక్తియు నందు నిరభ్యంతరముగాఁ బ్రవేశింప వచ్చును. సందేహయుక్త చిత్తుఁడగు మానవుఁడు స్వార్థద్వారమును దాటిపోయి నే నుడివియుండిన మాటలసత్యమును బరీక్షింపవచ్చును. స్వార్థము దుఃఖమును, జ్ఞాన మానందమును మన కేకాక సమస్త లోకమునకుఁ గలిగించు చున్నదనియు, మనతోడఁ గలసిమెలసి

వర్తించువారునయితము మన స్వార్థశూన్యతచే నత్యంతము
లగు సౌఖ్యానందములఁ బడయఁ గలరనియు, మనుష్య సృష్టి
యం దేవిధముగ నున్నదనియు, నొకని సౌఖ్యమే యెల్లరి సౌఖ్య
మనియు గ్రహించి మనము సాధారణ మార్గములను, సయిత
మానంద సంధాయకములుగఁ జేసికొనుచు శత్రువులయొక్క
మార్గములందుఁ బడియున్న కంటక సముదాయముల నెత్తి
పాఱవైచి స్వార్థశూన్యమగు ప్రేమయొక్క వికసిత కోమల
ప్రసూనముల మెత్తగా నేర్పఱుప వలయును. మనశత్రువు
లేమి, మిత్రులేమి, మఱి యితరు లేమి యాపుష్పాచ్ఛాదిత
మార్గముపై నడుగులిడుచుఁ బ్రయాణము సాగించినంతనే వికసిత
కుసుమము లణగి పారిశుద్ధ్యముయొక్క సౌరభముచే వాయు
మండలము నింపివైచి, నిర్మలానంద సుగంధముచే మానవ
లోకమును హర్షసాగరమున నోలలాడింపఁగలదు. ప్రేమ
సామ్రాజ్య పట్టాభిషిక్తులై యాత్మవిజేతలగుటచే నిత్యానంద
తరంగ డోలికల నుయ్యాలలూగుచుండఁగలరు.

---

## దశమ ప్రకరణము.

# మౌనము.

ఓ మనుష్యుఁడా! నీవు మౌనముద్ర నవలంబింపుము. మౌనము మానవజీవితమునకు ముకుటము. ప్రతిదినము కడు దీర్ఘమయి యున్నను మనమద్దాని విశేషభాగమును వ్యర్థమగు లోకాభిరామాయణమునుగూర్చి ప్రసంగించుటయందుఁ గడపి వేయుచున్నారము. దినమునకు రెండుమూడు గడియలయినఁ బ్రతిమానవుఁడు మౌనమును ధరించుటావశ్యకమయియున్నది.

మానవుఁడా! నీవు నీభాషణమును శక్తిసంపన్నముగను, బ్రభావోపేతముగను జేసికొన నభిలషింపు చుంటివేని కొలఁదిసేపయిన మౌనమును వహించి, మిథ్యావాదములను విసర్జించి వ్యర్థగోష్ఠికిఁ గడంగక జ్ఞానమును సంపాదించి మౌనముయొక్క స్వర్గసౌభాగ్యము ననుభవింపుము. —ఏ. ఆల్. సావుస్.

ఓ యంతఃకరణమా! నీవు నిశ్శబ్దముగా నుండుము. ప్రజ్వలితోద్వేగమునుండియుఁ, గార్యాతురతనుండియు క్షణమాత్రకాలము విడివడి విశ్రాంతి నందుము. సదా విశ్రాంతి

నొకవ్యసనముగ నేర్పఱచికొనవలదు. దినమున కొక్కగడియ కాలమేని త్రికరణపూర్వకముగ ధ్యానముతో నేకాంతముగ నుపవసింప భీతిల్లకుము. వికాసమున కిదియొక సూత్రమగు నుపాయము. —అరనెస్టు క్రాసబీ.

బుద్ధిమంతుఁడగు మానవుని భాషణమం దొకవిధమగు ప్రభావోత్పాదకశక్తి సహజముగా నెలకొని యుండుచుండును. కాని వాని మౌనమునం దంతకంటె గంభీరమగుశక్తి వెలయు చుండఁగలదు. ఆదర్శప్రాయులగు నుత్తమపురుషులు సుజ్ఞాన సిద్ధులయి యుండియుఁ బ్రాయికముగా నిస్తబ్ధతను వహించి యుండి మన కధికప్రభావయుక్తమగు శిక్షనొసంగఁ గలుగు చున్నారు. మహాపురుషులయొక్క మౌనభావ మెన్నిశతాబ్దముల పర్యంతమయిన భూలోకమున సుస్థిరముగా నుండి మానవకోటికి శిక్షాప్రద మగుచుండును. వాక్చాతుర్యమును గలిగి యున్నట్టియు, వాద ప్రతివాద నైపుణ్యాయుతుఁ డయినట్టియు వక్తయొక్క వాక్యముల వేలకొలఁది జను లాలకింపు చుండఁగలరు. అట్టివక్తల గంభీరోపన్యాసములు వినునపుడు శ్రోతలకు మిక్కిలి రుచికరములుగఁ గానవగుచుండినను గాలాంతరమం దవి బొత్తిగా విస్మృతింబడి కాలగర్భమున లీనమయి పోవుచున్నవి. పాయిలెటు జీససుప్రభువును "సత్యమన నేమి?" యని ప్రశ్నించినపుడు జీసను గంభీరమగు మౌనముద్రాంకి

తుఁ డయ్యెను. ఆమహానుభావుని యప్రతిమాన మతని విశాల మగు ప్రతిభను, నిరుపమానమగు బుద్ధివికాసమును, అనంత మగు మేధాశక్తిని సహస్రముఖంబుల సుద్ఘోషించుచున్నది. ఆమౌనము వినయముతోడను, నుపాలంభనములతోడను బరి పూర్ణమయియుండి సదా "దేవదూతలకేని ప్రవేశింప శక్యము కానిస్థానము మూఢులకు సులభగమ్యమయియుండు" నను కోవి దవాక్యమును యథార్థమొనరించుచున్నది.

తర్కశాస్త్రవేత్తలగు బ్రాహ్మణులు రెండువేల శతా బ్దములకుఁ దొలుత వారణాశియందు శ్రీబుద్ధదేవుని "బ్రహ్మ మననేమి?" యని ప్రశ్నించుచు మిక్కిలి బాధింప, దేవుఁడు మౌనమును వహించియుండెను. ఆ ప్రభువుయొక్క పరమ గంభీరమగు మౌన మతని చిరకాలార్జితమగు జ్ఞానముకంటె జనసామాన్యమునకు గురుతరమగు నీతిశిక్షను బ్రసాదించి యుండెను. ఆమహనీయుఁడు కేవలమూఢులకు మౌనముచే నెట్టిశిక్ష నొసంగఁజాలకపోయినను బండితలోకమునకుమాత్ర మపూర్వమగు శిక్ష నొసంగ సమర్థుఁడయ్యెను. అసమాన ముతోఁ గూడియున్న భగవదాస్తిక్య నాస్తిక్యవిషయమున వాదవివాదములు పెచ్చు పెరుగుటకు హేతువేమి? ప్రజ లీ విషయమున సామాన్యమగు దయాళుత్వమును, శ్రద్ధను నభ్య సించి బుద్ధిబలముయొక్క సామాన్య నియమముల గ్రహించు

టుచితము. భగవత్పదార్థమన నేమి యను విషయమును గూర్చి విశ్వమునం దిన్ని వాద వివాదములును, సందేహములును గలుగుటకు హేతువేమి? తొలుదొల్త మనము మన విషయమును గుఱించి తెలిసికొనుట యావశ్యకము. నాస్తికవాదము బుద్ధిహీనతకుఁ బ్రమాణసూచకమగు చిహ్నము కానేరదు. ఇదియే చందమున నాస్తిక్యమునకును, వినయమునకును సమానములగు బౌద్ధమును, నాధ్యాత్మికమును నగు పరిపక్వ స్థితియొక్క లక్షణములు లభింపనేరవు. లావుగారు తన జీవితకాలమున లోకమున కాదర్శశిక్ష నొసంగియున్నారు. "బుద్ధిమంతులు శబ్దముల నుచ్చరింపకయే మౌనముచే నుత్తమశిక్ష నొసంగుచున్నారు." ఈ మౌనశక్తిచే లావుగారి కనేకులకు శిష్యు లేర్పడిరి. ఆమహనీయుఁడు ప్రాయికముగా నేకాంతమందు మౌనవ్రతము నవలంబించి యుండువాఁడు. అతఁడు మౌనవాణి నాలకించుటకుఁగాని, స్వయముగా లోకమున కుపదేశించుటకుఁగాని లాలసుఁడయి యుండలేదు. శిష్యులే స్వయముగా నతనిచెంత కరిగి జ్ఞానపాఠముల నభ్యసించుచుండిరి. ప్రాచీనకాలముయొక్క మహాపురుషుల మౌనయుతములగు కార్యములు దూరమునందుండి ప్రకాశించుచు వారికిఁ గర్తవ్యపథములఁ జూపించు దీపముల వంటివి. కారణమేమన మంచితనమును, సుజ్ఞానమును సంపా

దింప నభిలషించు మానవుఁడు తా నెప్పుడెప్పుడు మాట్లాడవలసి యుండునదియు, నేరీతిగ సంభాషింపవలసినదియు, నెప్పుడెప్పుడు మౌనమును వహింపవలసినదియు, నేయే నుడువుల నుచ్చరింప రానివియు స్పష్టముగా గ్రహించుట యావశ్యకము. జిహ్వపై నధికారమును సుస్థాపిత మొనరించుకొనుట బుద్ధిబలము యొక్క ప్రథమ కర్తవ్యము. మస్తిష్కమును స్వాధీనమునం దుంచుకొనుట యంతకంటె నుత్కృష్టమును, పరమావశ్యకము నగు ధర్మమయి యున్నది. ఈరెండు కర్తవ్యముల నిర్వహించుటయందు విజయమునందిన వ్యక్తు లాత్మవిజయమును సాధింప సమర్థు లగుచున్నారు. రసనేంద్రియమును నిరోధించు వ్యక్తి మస్తిష్కముపై సంపూర్ణాధికారమును నెఱప శక్తుఁడగుచున్నాఁడు. మూర్ఖుఁడు వదరుచు, వ్యర్థగోష్ఠి సలుపుచు, వాదప్రతివాదములకుఁ గడంగుచు నిరంతరము వాచాలత్వమను నస్త్రమును బూని శబ్దసంగ్రామ మొనరించుచుండును. అతఁడు సదా తన వాక్ప్రవృత్తిని గూర్చి స్తుతించుకొనుచుఁ బ్రతివాదియొక్క వాగ్బంధనముఁ గావించితిని కదా యని మఱి భాషించుచు గర్వపడుచుండును. వాఁడు తన మాధ్యమునకయి యభిమానము వహించుచుఁ దన రక్షణమును గుఱించియే నిత్యము చింతించుచుఁ దనశక్తి నంతయు వ్యర్థప్రయోగములందు దుర్వ్యయ మొనరించు చుండును.

అట్టి మూఢుని జీవితము సస్యప్రదమగు క్షేత్రమును బాసి చవిటిభూమిని మిక్కిలిశ్రమచే దున్ని విత్తుచుండెడి కర్షకునిజీవితమును బోలుచున్నది.

ధీమంతుఁడు వ్యర్థప్రసంగమునుండియు, దంభములనుండియు, మిథ్యాకథనమునుండియు నిరంతరము దూరముగా నుండుచుండును. అతఁ డేవిషయమందేని పరులచేఁ బరాభవింపఁబడినను నిర్వికారమూర్తియయి సంతుష్టాంతరంగుఁడగుచుండును. అతఁ డెప్పుడేని యొకపందెమునఁ దోటువడినఁదా నింతవఱకు గ్రహింపఁజాలకయుండిన దోషమొండు మానసికచక్షువునకు గోచరించి బుద్ధిబలమును వృద్ధిగావించెను గదా యని హర్షించుచుండును. "సమాప్తము" అను శబ్దము నుచ్చరింప నౌత్సుక్యమును వహింపని మనుష్యుఁడు ధన్యుఁడు. ఒకానొక మహాపురుషుని కథనమొం డీ సందర్భమున స్మరణకు వచ్చుచున్నది. "నేను తొలుత శబ్దశాస్త్రవేత్తలతోడను, తర్కశాస్త్రనిష్ణాతలతోడను శాస్త్రార్థమును, వాదవివాదమును గావించుచుండెడి వాఁడను. కాని నేనిపు డా మౌఢ్యమును గడునింద్యమని గ్రహించితిని. నే నిపుడు వాదవివాదము లొనరించుటను, బరులపై దోషారోపణము గావించుటను విసర్జించి వైచితిని. నేను కేవలము సకలమును వినుచుఁ, జూచుచు నుందును. అవసర మగునేని ప్రశ్నకే సాధ్యమయి

నంత క్లుప్తముగఁ బ్రత్యుత్తరము నొసంగుచుండును. మౌన వ్రత మాహాత్మ్యమును సంస్మరించి నప్పుడెల్ల నేను విస్మితుఁడ నగుచుందును." పరులు రెచ్చఁగొట్టినను నిస్తబ్ధతను వహించుటయే యాత్మపరిపక్వమును, సహానుభూతిపూర్ణమును నగుచున్నదనుటకుఁ బ్రమాణములు. విచారశూన్యుఁడును, దయాహీనుఁడును నగు మనుష్యుఁడు స్వల్పముగ రెచ్చఁగొట్టఁబడినను వెక్కసముగ నుద్రేకపూరితుఁ డగుచుండును. అట్టిమనుష్యుఁడు తన్నెమాత్రము పరు లాక్షేపించినను తనబుద్ధియొక్క సిరత్వము (తూకము)ను జెఱచుకొనుచుండును. శ్రీ బుద్ధదేవుని యొక్కయు, జీనసుప్రభుని యొక్కయు గంభీరమగు నాత్మదమనము, కౌతుకమును, దాంత్రిక విద్యాప్రదర్శనమును గానేరదు. వారి మౌనము వారి పరిపక్వస్థితియొక్కయు, బుద్ధివైశాల్యముయొక్కయుఁ బ్రబలదృష్టాంతము. మనము గ్రంథములందు జీనసుప్రభువు వాదవివాదములయొక్క శబ్దమున కయినఁ బ్రత్యుత్తరము నొసంగి యుండలేదనియు, శ్రీ బుద్ధమహాప్రభువు శాస్త్రార్థములందు నిమీలితనేత్రుఁడయి, సిరవుఁడయి యుండెడివాఁడనియుఁ జదువునప్పు డాలోక పావనచారిత్రుల గంభీరమౌనముయొక్క యపారమగు శక్తియొక్కయు, వారి యథార్థమగు మహత్వముయొక్కయు సౌమ్యద్యుతి నవలోకింపఁ గలుగుచున్నారము.

మౌనియే శక్తిసంపన్నుఁడగు మనుష్యుఁడు. వదరు
చుండు మనస్సు నిశ్శబ్దములయం దెట్టిపరిభావముఁ బొందనేరదు. అతని యాధ్యాత్మికశక్తులు నిత్యము వదరుచుండుటయందే వ్యయమయిపోవుచున్నది. ఆధ్యాత్మికశక్తిహీనునియందు నిగ్రహముండనేర్చుట యసంభవము. ఒకానొక యంత్రము యొక్క శక్తిచేఁ గార్యమును సాధించుకొనవలసివచ్చినపుడు యంత్రసంచాలకుఁడు తొలుదొలుత నాయంత్రము యొక్క వివిధోపకరణముల యథోచితస్థానమునందుంచి బాహ్యబలముచే దానియందలి శక్తి నావిర్భూతముఁ గావించుచున్నాఁడు. బుద్ధిమంతుఁడగు మనుష్యుఁడును యంత్రమును నడుపువానివలెనే తనశక్తుల నన్నింటిఁ గూర్చుకొని వానిని స్వాధీనమునం దునిచికొనవలసినపుడెల్ల వానిని యథోచితముగ నుపయోగించుచుఁ గర్తవ్యముల సాధించుచున్నాఁడు.

వాస్తవికమగు శక్తి మౌనవ్రతమునందే వెలయుచున్నది. మోక్షప్రాప్తికి విజ్ఞానధనులగు భారతీయ ఋషిపుంగవు లవలంబించియుండిన ముఖ్యసాధనములలో మౌనవ్రతము గణ్యస్థానమునే యలంకరించుచున్నది. మొఱుగుచుండు శునకము కఱవనేరదనియుఁ, గఱవనేర్చిన శునకము మొఱగనేరదనియు వచింపఁబడుసామెత లోకానుభవసిద్ధమయినది. వెడల్పు మోముగల సీమదేశపు కుక్కలు (Bulldogs) భయానకమగు

మానమునందుఁ బ్రఖ్యాతిని వహించియున్నవి. ఆ కుక్క యితరసమయములందు జడప్రతిమవలె నుండి యవసరమైనప్పుడు దీర్ఘకాల నిస్తబ్ధతానంచితమగు శక్తి నొక్కమ్మడి వెచ్చించి యొంటి ఘనకార్యమునయిన సఫలమొనరించి వేయుచున్నది. ఈకుక్కయొక్క మాన మధమశ్రేణికి వర్తించునదయ్యు నున్నను మానవప్రతినియమప్రభవ మనే చాటుచున్నయది. ప్రాయికముగా బడాయిఁగొట్టు మనుష్యుఁ డపజయములకు గురియగుచుండును. అతని ధ్యాన మెపుడును నిజోద్దేశ్యము నుండి విభక్తమయిపోవ, వాని ధైర్యాంతరశక్తు లన్నియు నాత్మశ్లాఘయందే వ్యయమగుచున్నవి. వాని మనోబలమంతయు వాని కార్యముయొక్కయుఁ, గార్యపర్యవసానముయొక్కయు శోభయందు వ్యయమయిపోవుచున్నది. తన సైన్యము నొక్కచో సమావేశపరచు విధము నెరుంగక బహుప్రదేశములయందు దునిచి యుద్ధయాత్ర కరుగు సేనానాయకునివలె మానముయొక్క ప్రయోజనము నెఱుంగని వ్యక్తి తన కర్తవ్యముల నిర్వహింపఁ గడంగుచుండును. వినమ్రస్వభావుఁడును, నుద్యోగియు నగు పురుషుఁడే కార్యకుశలుఁడు కాఁగలుగుచున్నాఁడు. అతఁ డాత్మాభిమానమునుండియు, నాత్మశ్లాఘనుండియు విడివడి తన సమస్తశక్తుల కార్యమును విజయపూర్వకముగ సిద్ధమొనరించుటయందుఁ బ్రయోగింపుచు

న్నాఁడు. వదరుపోతు తనశక్తిసామర్థ్యములఁ బ్రశంసించుకొనుటయం దెంతసమయమును వెచ్చించుచుండునో కార్యార్థి యంతసమయమునే కార్యసంపాదనమునం దుపయోగించి వాచాలునికంటె శీఘ్రముగఁ గర్తవ్యమును నిర్వహింపుచున్నాఁడు. విభక్తమగు శక్తిసంచితమును, సురక్షితమును నగు శక్తియొక్క వశమునందుండునను నియమము, సర్వవ్యాపకమును, సార్వకాలికమును నయియున్నది. వదరుచుండునట్టియు, నాత్మస్తుతిగావించుకొనుచుండునట్టియు మూఢుని, నిస్తబ్ధముగా నుండుచు సమర్థస్వభావమును గలిగియుండు వాని సులభముగాఁ బరాభవింపఁగలుగుచున్నాఁడు.

మానవచరిత్రమునం దపారమగు శక్తికల దను నిబంధనము సార్వదేశికము. కార్యకుశలుఁడగు వణిజుఁడు తనవ్యాపారపద్ధతులను, వివిధోపాయములను, ఉద్దేశ్యములను స్థానస్థానమందు లాభము నపేక్షించి, చాటుచుఁ దిరుగనొల్లఁడు. అతఁడు వ్యాపారవిజయముచే ముగ్ధుఁడయి స్వానుభవశూన్యునివలె స్థానస్థానమందు వదరుచుఁ దిరుగుచుండినచో వానివ్యాపార విజయపతాక భూతలపతితమగుట సత్యము, ఆధ్యాత్మిక ప్రభావసంపన్నుఁడగు వ్యక్తి తనయొక్కయుఁ, దన యాంతరిక సాఫల్యముయొక్కయు విషయమునుగూర్చి స్తుతిపాఠమును బ్రారంభింప నొల్లఁడు. అతఁ డిట్లాచరించినచో వాని

యాధ్యాత్మికశక్తియుఁ, బ్రభావమును క్షీణించిపోవ మిక్కిలి దుర్బలుఁడు కావలసివచ్చును. సాఫల్యము వ్యావహారికమయినను ధార్మికమయినను నయ్యది శక్తిసంపన్నమును, ధైర్య సమన్వితమును నగు మానవప్రతిమయొక్కయు, దృఢసంకల్పముయొక్కయు, మనోబలముయొక్కయు బరిచారికయయి యున్నది. విశేషముగ బలమును గలిగియున్న శక్తులు కోలాహల మొనరింపఁజాలవు. ఆడంబరమునకుఁ గల సంరంభము సామ్యస్థితికి లేదని యే నుడువవచ్చును. జడమతి స్వల్పకార్యముల నాచరించునపుడును గలకలమొనరింపుచుండ మహాప్రభావయుతుఁడగు మనుష్యుఁ డెంతటిఘనకార్యములనయిన సద్దులేకుండగనే సాధింపుచున్నాఁడు.

నాయనా! నీవు బలాఢ్యుఁడవును, బ్రయోజకుఁడవును, స్వావలంబనపరాయణుఁడవును గాఁ గోరుచుంటి వేని మౌనవ్రతమందలి విశేషమగు ప్రయోజనమును, సామర్థ్యమును శీఘ్రమభ్యసింపుము. నిన్నుగురించి నీవే మాట్లాడుకొనవలదు. ప్రపంచము మిథ్యాభాషిని బలహీనునిగను, నీచునిగను భావించి, వానిడంబములఁ బలుకు స్వభావమునకుఁ గినిసి తత్క్షణము వానిని విసర్జించి వేయుచున్నది. నీ వాచరింపవలసిన కర్తవ్యమునుగూర్చి ఆచరణమునకుఁ బూర్వమునుండియు నుపన్యసింపఁ గడంగకుము. పదరుటకంటెఁ గార్య మాచరించి లోకమునకుఁ

చూపుటయే మానవత్రితముయొక్క ముఖ్యలక్షణము. అమూల్యమగు నీశక్తిని బరులయొక్క కార్యవిధానమును విమర్శించుటయందును, వారిని నిందించుటయందును వెచ్చించివేయకుము. ప్రతిమానవుఁడు తనశక్తిని స్వీయకర్తవ్యసాధనమునందు సఫలత్వము నపేక్షించి వ్యయమొనరించుట శ్రేయస్కరము. ఉత్సితవిధానము ననుసరించి యాచరింపఁబడిన కార్యము సయితము విశేషోత్సాహముతోడను, మాధుర్యముయొక్క సాహాయ్యముచేతను జేయఁబడినచోఁ బరుల కార్యములను గూర్చి నిందించుటకంటెను, విమర్శించుటకంటెను వేయిమడంగు లుత్తమము. నీవు సదా పరులకార్యముల నిందింపుచుంటివేకాని నీకార్యపద్ధతి యెట్లున్నదా యని తలంచుటయైన లేదు. పరులు తమ కార్యముల నుత్తమరీతిఁ గావించుకొనకున్నచో నీవు వారికిఁ దోడ్పడుచు, నీకర్తవ్యముల బాగుగా నిర్వహించుకొని వారికి మార్గదర్శకుఁడ వగుము. పరులు నిన్ను నిందింపకుండునట్లును, నీవు పరుల నిందింపకుండుటకును దగిన రీతిని విచారింపుము. మూఢు లెవరైన నిన్ను దూషింపుచుఁ జీటికిమాటికి నీపై దండెత్తుచున్నచో నభంగమగు మౌనముచే వారల లజ్జితులఁ గావింపుము. ఈరీతి నీ వాత్మవిజయమును సంపాదించినచో భాషింపకయే పరుల వారి యపరాధములకయి దండింపఁ గలుగుదువు.

యథార్థమగు మౌనము జిహ్వేంద్రియమును బంధించుటచే లభింపనేరదు. చిత్తమున బ్రశాంతస్థితియుం డుంచుటయే వాస్తవికమగు మౌనలక్షణము. నీవు కేవలము రసనేంద్రియమును బంధించి, మానసమును నస్థిరమునుగను, నిత్యము వ్యర్థసంచార మొనరించుదానిగను నుంచినచో నిట్టి మౌనము దుర్బలత్వమును బారదోలుట కౌషధమును, శక్తిని సంపాదించుట కుత్తమసాధనమును గానేరదు. మౌనము నీ స్వభావమునందును, హృదయమందును సంపూర్ణముగా వ్యాప్తము కాగలిగినపుడే శక్తిసంపన్నమగుచున్నది. మౌనము సదా ప్రశాంతముగనుండు టవసరము. మనుష్యుడు తనపైదాను విజయమును సంపాదింప నేర్చినకొలదియు విస్తృతమును గంభీరమును, సుస్థిరమును నగు మౌనమును సంప్రాప్తింపజేసి కొనుచున్నాడు. క్రోధము, ద్వేషము, దుఃఖము, భయము, వికారము మొదలగు దుష్టప్రవృత్తులు మానసమునందుపద్రవముల నావిర్భవింపజేయుచున్నంత పర్యంతము మౌనవ్రతముయొక్క పవిత్ర గాంభీర్యము పరిపక్వస్థితికి బ్రాపింపజాలదు. పరుల వాక్యములవలనను, కార్యములచేతను నీ ప్రకృతి దుఃఖము నందుచున్నంతకాలము నీవు దుర్బలుడవనియు, నపవిత్రుడవనియు, నాత్మనిగ్రహశక్తిశూన్యుడవనియు లోకమునకు స్పష్టమగుచుండగలదు. కావున సదా యుశాంతి

నభివృద్ధిపఱచునట్టి దురభిమాన, దురహంకార స్వార్థ ప్రవృత్తుల నీహృదయాంతరాళమునుండి పెకలించి వేయుము క్రోధలేశమున కయిన నీహృదయమున స్థాన మొసంగకుము. ఏవిధమగునట్టి కీడును, నిందయు నీయంతఃకరణముయొక్క నిర్మలశాంతిని భంగమొనరింపకుండునట్లు చూచుకొనుము. దృఢముగా నిర్మితమయిన యుత్తుంగ ప్రాసాదముపై నుండి ప్రచండమగు వాయువు కడురయమునఁ బర్వెత్తుచున్నది; కాని యాని కేతనమున కెట్టి హానియు గలుగుచుండుట లేదు. తన్మందిరమునం దధివసించు మనుష్యు లెల్లరు నిర్విచారముగను, నిశ్చింతగను, బ్రశాంతముగను గూర్చుండి సౌఖ్యమయము లగు తమదినములఁ గడుపుచుందురు. ఇదియేచందమున సుదృఢమును, సక్రమమును నగు బుద్ధిమందిరమునఁ గాపురము సేయు మానవున కెట్టి విపత్పరంపరలును నష్టమును గలిగింప నేరవు. అతఁ డాత్మనిగ్రహపూర్వకముగను, నిశ్చలముగను విశ్రాంతి సౌఖ్యము ననుభవించుచుఁ గూర్చుండి యుండఁ గలఁడు. కేవలము జితేంద్రియుఁ డగు మానవోత్తముఁడే మానవజీవితాభ్యుదయమున కావశ్యకమగు నాదర్శమాన వ్రతము నవలంబింప సమర్థుఁడు.

ఒకానొక విషయమును గూర్చి గొప్ప యాడంబరము తోడను, వైభవముతోడను బ్రసంగింపక, తన్నిర్వహణమున

కెట్టి యాందోళనమును, గోలాహలమును గావింపకయే మను
ష్యుఁడు కార్యసిద్ధి నందలేఁ డని జనసామాన్యము నుడువు
చుండుపద్ధతి కేవల మనుభవశూన్యమును, భ్రమాన్వితమును
నయియున్నది. వ్యర్థప్రసంగి, శాంతముగ విచారించునట్టియు
నిశ్శబ్దముగాఁ గార్యమును సాధించునట్టియు వ్యక్తిని వ్యర్థునిగ
భావించుచుండును. అతఁడు నిస్సబ్ధత యన నేమియు సేయకుం
డుట యనియుఁ, ద్వరపడుట, ఆతురపడుట, అవిరామముగఁ
బ్రసంగించుట బాగుగాఁ బనిసేయువాని లక్షణము లనియుఁ
దలపోయు చుండును. అతఁడు కేవలము సర్వప్రియత్వమునే
శక్తి యనియుఁ, బ్రభావ మనియు నెంచు చుండును. కాని
విచారశీలుఁడును, గార్యకుశలుఁడును నగు మనుష్యుఁడే
యథార్థమగు కార్యనిర్వాహకుఁడు. కార్యనిర్వాహకుఁడు
సదా వివేచించి, కార్యతత్త్వమును గ్రహించి, దానిమర్మ
ములఁ బరిశోధించి, తాత్పర్యము ననుభవగతమొనరించు
కొని కర్తవ్యాచరణమునకుఁ గడంగు చున్నాఁడు. ప్రకృతి
మానవృత్తివలనను, నద్భుతమగు రసాయనము మూలము
నను వసుంధరయొక్కయు, వాయువుయొక్కయు స్వయం
భూతములగు తత్త్వములచే వృక్షములయొక్క కోమలము
లగు దళములను, సుందరములగు పుష్పములను, రుచిరములగు
ఫలములను, వివిధములగు నగణితమనోహరాకృతులనురచించు

విధంబుననే మానియు, వివిధార్థసాధకుఁడగు గార్యకర్తయు మానవులయొక్క యాచరణపద్ధతులను, బృథ్వియొక్క స్వరూపమును, స్వకీయశాంతిబలముచేతను, జమత్కారమువలనను మార్చివేయుచున్నాఁడు. అతఁడు వస్తువులయొక్క పరివర్తనశీలమును, నప్రాకృతికమును నగు స్థితితోఁ గ్రీడింపనొల్లఁడు. కాని యాపదార్థములయొక్క యాంతరిక రహస్యస్థానము వరకుఁ జేరఁగలుగుచున్నాఁడు. అతఁ డటఁ జేరి కార్యమొనరింపుచున్నాఁడు. అంతిమసమయ మేతెంచినపుడు, మృత్యువు వాని స్థూలదేహమును భౌతికప్రపంచమునుండి తొలఁగించివేసినపుడును వానిగుప్తములును, నజరామరములును నగు ప్రయాసముల సత్ఫలితములు ప్రపంచమును సౌఖ్యానందమయముగఁ జేసివేయుచున్నవి. కాని వ్యర్థభాషియగు మనుష్యుని ప్రసంగములు, వాక్యములు కడుశీఘ్రముగ నశింపుచున్నవి. శాబ్దికకృషి (సేద్యము) చే ఫలములు ఫలింపనేరవు.

తనమానసికశక్తుల నన్నింటి నేకీభవింపఁ జేసికొనునట్టియు, సంచయ మొనరించుకొనునట్టియు మనుష్యుఁడే తన సమస్తదైహికశక్తులను నయితము కేంద్రీభూత మొనరించుకొనఁ గలుగుచున్నాఁడు. శీఘ్రగామియుఁ, జంచలచిత్తుఁడును, గోలాహలుఁడును నగు మనుష్యునికంటె సామాన్య మనుష్యుఁడే శ్రేష్ఠతరముగ స్వాస్థ్యసుఖము ననుభవించి

విశేషకాలము జీవింపఁగలుగుచున్నాఁడు. ప్రశాంతమును, వినమ్రమును నగు మానసిక భద్రస్థితిచే శారీరక భద్రస్థితి వృద్ధి నందుచున్నది. మహాన మాత్మదమనముయొక్క ఫల మగుట వలననే శక్తిసంపన్నము గాఁగలుగుచున్నది. మనుష్యుఁ డెంత విశేషమగు సఫలత్వముతోఁ దన్నుఁ దాను వశపఱచుకొను చున్నాఁడో, అంత యధికముగ శాంతిని, మానమును బడయఁ గలుగుచున్నాఁడు. కారణమేమన నతఁడు స్వార్థమయములగు భోగవిలాసముల ననుభవించుటకుఁగాక మహత్తరమగు నేదియో యొక యుద్దేశ్యమును సాధించు నిమిత్తమే కార్య మాచరించుచున్నాఁడు. కావున నతఁడు భౌతికప్రపంచము యొక్క బాహ్యకలహములనుండి దూర మగుచుఁ బరమశాంతి యొక్క యాంతరిక భద్రస్థితికిఁ బ్రాపించుచున్నాఁడు. అతఁడు మాట్లాడు ప్రతిశబ్దమున కేదియో యొక గంభీరమగు నుద్దేశ్యమును, మహార్థమును నుండుచుండును. అతని ప్రతిమాన మునకును విశేషార్థము లేకుండనుండదు. అప్రాపతమునకును, దుఃఖమునకును హేతుభూతమగునట్టి యొక శబ్దమైన వాని శ్రీముఖమునుండి వెలువడనేరదు. పశ్చాత్తాపమును, క్లేశము లను గలిగించునట్టి యేకార్యము నతఁ డాచరింపనొల్లఁడు. మంచిమాటల నుడువుచు, శుభకార్యముల నాచరించుచు నతని యంతఃకరణము ప్రశాంతమయి యుండుచుండఁగలదు.

ఇట్టి ప్రశాంతస్థితి నందిన మనుష్యుఁ డాత్మవిజేతయయి తన జీవితకాలమునంతయు సౌఖ్యానందపూర్వకముగఁ గడుపుచుండఁగలఁడు.

---

## ఏకాదశప్రకరణము.



# ఏకాంతవాసము.

కుమారా! ఆధ్యాత్మికములగు నేకాంతవాస మొసంగఁగల ప్రత్యుత్తరములకయి బాహ్యవస్తువుల నన్వేషింపుచుంటి వేల ? స్వర్గముయొక్క దివ్యదృశ్యము నీసమీపమునందేయుండ గిరులపై నధిరోహించు శ్రమ కేల పాల్పడుచుంటివి? మహాత్ముఁ డేకాంతవాసమున విచారింపుచు రాత్రులం దాకాశమండలమును సుశోభితమొనరించు తారకాసముదాయమును మధ్యందినసమయమందే తనదివ్యదృష్టిచే విలోకింపుచున్నాఁడు.

—ప్లేటోయారు.

మౌనవ్రతకాలమందు సకలేంద్రియములు ప్రశాంతములయి యున్నపుడు మనుష్యుఁడా! నీవు నీహృదయమందిరమును బుద్ధిభండారముచే నింపివేసికొనుము. ఏకాంతవాసమున మానవుఁడు దీర్ఘమగు తత్త్వాలోచనమునకుఁ గడంగుచో

జ్యోతిస్స్వరూపమగు పరమపతిముయొక్క మంగళాకృతిని
వీక్షించుటయం దబ్బుర మేమికలదు? — వర్డ్స్వర్త్.

మానవుని ప్రధానాస్తిక్యము (ఉనికి) ఆంతరికమును, సద్రుష్టమును, నాధాత్మికము నయియున్నది. కాని నరు డవనేడు స్వీయజీవితమును, బలమును, బాహ్యమునుండి కాక లోపలినుండియే పడయుచున్నాడు. బాహ్యవస్తువు లనేకవిధములగు రూపములు. వీనినుండియే మానవాస్తిక్యముయొక్క శక్తులు వ్యయమగుచు దరిద్రరూపమున స్రవించిపోవుచున్నవి. వ్యయమగు శక్తులను తిరిగి మనుష్యుడు సంపాదింపలేనిచో నాంతర మానవత్వము నాశ్రయింపవలసి వచ్చుచున్నది.

మనుష్యుడు డియాభ్యంతరికమానమును చంచలేంద్రియములయొక్క కోలాహలయుక్తములగు విలాసములకయి వెచ్చింపుచు, బాహ్యపదార్థ సంఘర్షణమందు లీనుడగుచున్న కొలదియు భయంకర క్లేశములను, దుఃఖములను ననుభవించి తుద కత్యంతపరిశ్రాంతచిత్తుడయి విశేషమగు విశ్రాంతి నొసంగు ప్రశాంతమగు ఏకాంతవాసముయొక్క చరణకమలముల నాశ్రయింపుచున్నాడు.

మానవుని దేహము కేవలము ధాన్యముయొక్క పొట్టును, బొల్లును భుజించి జీవింపలేని విధంబుననే, పవిత్రమగు మానవాంతరాత్మయును గేవలము నిస్సారములగు విలాసములపై

నాధారపడి యుండఁజాలదు. మానవశరీరమునకు సకాలమున యథోచితమగు భోజనము లభింపనిచో నది దుర్బలమయి, క్షుత్పిపాసలచే వ్యాకులతను జెంది, ఆహార పానీయములకయి యఱవ నారంభించుచున్నది. ఆత్మయొక్క స్థితియు నిట్టిదే. ఏకాంతమందీ యాత్మకును స్వచ్ఛమును, పవిత్రమును నగు భావాహారమును నొసంగు టావశ్యకమయి యున్నది. లేనిచో దీని నవీనతయు, శక్తియు నశించిపోవును. అంతమున కీయాత్మపదార్థము క్షుద్బాధకుఁ దాళలేక దుఃఖభారముచే నెలుగెత్తి యేడ్వ నారంభించుచున్నది ప్రకాశము కొఱకును, ఆశ్వాసము నిమిత్తమును దుఃఖితాత్మకుఁ గలుగు ప్రగాఢాభిలాషయే దానియొక్క క్షుత్పిపాసానివారణమునకయి కావించుకొనఁ బడు విన్నపము. సమస్త దుఃఖక్లేశములు మానవాత్మ క్షుద్బాధచే మరణించుచున్న దని సూచించుచున్నవి. అంతరాత్మ జ్ఞానప్రకాశముల నభిలషించుచోఁ దదభిలాషయే భోజనమునకయి కావింపఁబడు మొఱయని మనము గ్రహింపవలయును. దుశ్చరితుఁడగు పుత్రుఁడు విశ్వజీవిత క్షేత్రమునఁ బ్రవేశించి తనతోఁ గొనిపోయి యుండిన ధనధాన్యముల దుర్వ్యయ మొనరించి వైచి, ఆహార పానీయములకాధారము లేక పితృగృహాభిముఖుఁడగు చందముననే మానవాంతరాత్మయు విలాసములకయి బుద్ధివివేకబలముల

దుష్క్రినియోగ మొనరించియుండినచో దుర్బలమయి తిరిగి శక్తిని సంపాదింప నశక్తుల మగుచుండఁగలదు.

ఇంద్రియలోలత్వమున దాత్మకుఁ బవిత్రమగు జీవితము లభింప నేరదు. విషయ సేవనముచే యింద్రియములు మదించి యాత్మవికాసమును హరించుచున్నవి. ఇంద్రియములు సదా విరామము లేకుండ నింద్యములగు భోగవిలాసముల నభిలషించుచు మానవజీవితశాంతిని భంగ మొనరింప జూచుచుండును. ఇంద్రియముల ననుసరించుటచే క్షణికమగు బాహ్యానందము, కోలాహలము, చాంచల్యము, క్లాంతి, దుర్బలత్వము మొదలగు దుఃఖదాయకము లగు పర్యవసానముల మనుష్యుఁ డనుభవింప బాధ్యుఁ డగుచున్నాఁడు. ఇంద్రియలోలత్వముచే మానసిక శక్తులకు సంభవించు నష్టమును మనుష్యుఁడు తిరిగి యాభ్యంతరికమగు శాంతవాసముచేఁ బూరించుకొనఁ గలుగుచున్నాఁడు. కష్ట మొనరించిన పిదప తిరిగి శక్తిని సంపాదింప దేహమునకు విశ్రాంతి యవసరమయిన రీతిగనే మానవాంతరాత్మయుఁ దనశక్తులను తిరిగి యధోచితస్థితికిఁ బ్రాపింపఁజేయ నిమిత్తము విశ్రాంతి నేకాంతవాసముచేఁ బడయవలసియున్నవి. మానవుని స్థూలదేహమునకు సంపూర్ణారోగ్యము కొఱకు నిద్ర యవసరమగు విధముననే సూక్ష్మశరీరము యొక్క స్వాస్థ్యమునిమిత్త మేకాంతవాస

మత్యంతావశ్యకము. దేహమునకు వ్యాయామ మెంత ప్రయోజనకరమగుచున్నదో, ఏకాంతవాసముచే జనించు పవిత్రములగు భావములును నిశ్చలమగు ధ్యానములును మానవాంతరాత్మ కంతియు లాభదాయక మగుచున్నది. అవశ్యకములగు విశ్రాంతియు, నిద్రయు లేనిచో దేహము శిథిలమయి పోవు రీతి నాత్మయు నావశ్యకములగు శాంతియు నేకాంతవాసమును లేకపోవుటచే వికాసశూన్య మయిపోవుచున్నది. మనుష్యు డాధ్యాత్మికాసిక్తముయొక్క గణనముచే సమయసమయమందు నశ్వరపదార్థమయమగు బాహ్యప్రపంచమునుండి వెలుపడి, ఆంతరికమగు నేకాంతవాసముయొక్క సుస్థిరములును, నజరామరములును నగు సత్యములను సేవింపనంతపర్యంతము తన శక్తిని, ధార్మికత్వమును సుస్థిర మొనరించుకొన నేరడు. ధర్మముచే జిత్తమునకు సంప్రాప్తమగు సాన్త్వన మేకాంతవాసముచే సులభముగా లభ్య మగుచున్నది. ధర్మవిధుల ననుసరించి, యోగారూఢుడయి, ప్రాపంచికములగు నాతంకములనుండి విమోచనము నంది ధ్యానోపాసనములకు గడంగినచో నివి మనుష్యునకు సమయ సమయములందు నాధ్యాత్మిక శాంతియందు మానసమును లీన మొనరించు పద్ధతిని, నమున్నతములును, బవిత్రములును నగు వాసనలయం [illegible]మును లగ్న మొనరించు రీతిని నేర్పుచుండు

గలవు. మానవుని హృదయాంతర్గతములగు ప్రబోధకశక్తులు మానవునియొద్దఁగల సంపదలకంటె నుత్తమములును, యోగ్యములును నగు సంపదలనుబడయ నిరంతర మన్వేషించుచుండును. ఏకాంతవాసముచే నెపుడును దన మానసమును స్వచ్ఛముగను, శాసనపాలనయోగ్యముగను జేసికొన నేర్వని మనుష్యుఁడు నిరంతరము లౌకికవిధులయొక్క సాహాయ్యము నపేక్షించుచుండవలసియుండును; కాని దివ్యమగు నాత్మికమనబలప్రభావముచే నాత్మవిజయమును గాంచినట్టియు, స్వీయేంద్రియముల వశమొనరించుకొన నేకాంతమును సేవించుచున్నట్టియు మనుష్యుఁడు పవిత్రములగు కర్తవ్యపథముల ననుసరింప మానసమును మచ్చికకుఁ దెచ్చుచు విజయమును గాంచుచున్నాఁడు. ఇట్టివిజేతకు మహాపురుషులయొక్కయు, ధర్మాచార్యులయొక్కయుఁ, బూజామందిరములయొక్కయు, సద్గ్రంథములయొక్కయు నావశ్యకతయే యుండదు. శ్రీరామకృష్ణాదు లిట్టివిజేతల శ్రేణియం దెన్నఁదగియున్నారు. పూజామందిరములు పవిత్రహృదయుల కానందవిహారములు కానేరవు; కేవల మవి దూరదృష్టిలేని పాపాత్ముల నుద్ధరించుటకు సామాన్యసాధనములు. సంస్కృతహృదయుఁడు సర్వవ్యాపకమగు ప్రేమజ్యోతిని విసర్జించి మానవకల్పిత మందిరాంతరాళమందలి జడమయకృత్రిమ ప్రకాశమును విలోకించుటయందానందము ననుభవింపఁజాలఁడు.

మనుష్యుఁడు, జీవితముయొక్క కష్టములను, విపత్పరంపరలను, లాలసలను డీకొనుటకు శక్తిని, వానిరహస్యముల గ్రహించునిమిత్తము శాంతిని, వానినిఁ బరాజితము లొనరించుకొనుటకు జ్ఞానమును, వానిపై సంపూర్ణాధికారమును వహింప స్థిరమగుబుద్ధిని యేకాంతవాసముచే సంపాదింపవలసియున్నది. ధరాంతర్గతమయి, దృష్టికగోచరమయియుండు పునాదియొక్క సాహాయ్యముచే భవనము సురక్షితముగ నుండు చందమున నే మనుష్యుఁ డేకాంతవాసమున హృదయమునం దావిర్భవింపఁ జేసికొనియున్న సుదృఢములును, దివ్యములునగు భావములచేఁ జర్మచక్షువులకు గోచరింపరానట్టి ప్రబలశక్తిని, శాంతిని సంపాదించి వానిని సుస్థిరము లొనరించుకొనఁ గలుగుచున్నాఁడు.

ఏకాంతమందే మనుష్యుఁడు తన్నుఁ దాను స్పష్టముగా గుర్తింపఁగలుగుచున్నాఁడు. అతఁ డేకాంతమున నే నిజస్వభావమును, బ్రకృతియొక్క శక్తిని, బ్రభావమును గ్రహింప సమర్థుఁడగుచున్నాఁడు. ప్రపంచముయొక్క నానా కోలాహలములందునుఁ బరస్పరవిరుద్ధములగు వాంఛలయొక్క కేకల మధ్యయందును బవిత్రాత్మయొక్క వాణి శ్రుతిగోచరము కానేరదు. ఏకాంతవాసము లేనిదే మనుష్యుఁ డాధ్యాత్మికాభ్యుదయము నందనేరదు.

ఈశ్వరసృష్టియందుఁ దమపైఁ దాఁ ... తీవ్రతరమగు దృష్టినిఁ బ్రసరింపఁజేసికొనుటయందు దిగులొందునట్టియుఁ, దమ యాంతరికస్వరూపమును సంపూర్ణముగా గ్రహించుటకు భయావహు లగుచుందునట్టియు మనుష్యు లెందరో కలరు. వా రేకాంతమందుఁ దమ ప్రత్యంతఃకరణమునుండి బహిర్గతములగుచుండు గంభీరములగు భావములను గాంచి హర్షించుటకుమారు భయము జెందుచుందురు. వారు క్షణాలమయినఁ బసులతోడి నపేక్షింపక స్వతంత్రాలోచనమందు నిమగ్నులయి యుండఁజాలరు. అట్టి దుర్బలహృదయు లేకాంతమునఁ గూర్చున్నంతనే తమ వివిధవాసనలయొక్క భూతప్రేతముల మానసిక ప్రతిబింబము ... ముగ గోచరించినంతనే భయప్రకంపితులయి పోవుచున్నారు. కావుననే వా రేకాంతవాసముచే నాత్మవిజయపథము నన్వేషించి నిత్యానందము ననుభవించుటకుమారుగఁ గేవలము వినోదము...యొక్క నాద... తీవ్రస్వరమున వినవగుచుండు నట్టి స్థలములకును, బరమసత్యముయొక్క దివ్యవాణిని వినరాకుండఁ జేయునట్టి మహా సంరంభయుతములగు ప్రదేశములకును జనుచుందుట కలవడియుందురు. కాని సత్యముమీద ప్రబల స్నేహమును గలిగి యుండునట్టియు, బుద్ధివికాసము నభిలషించుచుఁ దన్మార్గము నన్వేషించుచుండునట్టియు మానవోత్తముఁడు నిత్య మే

శాంతవాసమందే కాలము గడుపుచుండును. అతఁడు తన యథార్థమగు స్వరూపమును సంపూర్ణముగను, స్పష్టముగను విలోకింపఁ గలుగుచున్నాఁడు. అతఁడు సదా కోలాహలమయ ప్రపంచమునందియు, కల్పితానందమయస్థానములనుండియు దూరముగా నుండుచుఁ బరమసత్యము యొక్క మృదుమధురమగు దివ్యగానము ప్రతిధ్వనింపుచుండు పవిత్రస్థానమును జేరుచుండును. అయ్యెడనే యా పరమసత్యము యొక్క పవిత్రవాణి వాని హృదయకుహరమున ధ్వనింప నారంభించి వానికొక లోకోత్తరశ్రావ్యమగు సంగీతానందరసమును పాన మొనరింప నొసంగుచుండును.

ప్రపంచమందు మనుష్యు లధికముగా సంగీతమునకయి యాతురపడుచుఁ దిరుగుచున్నారు. వారు నూతనములగు వినోదములను, వింతలను, నవీనములగు నాహ్లాదములను, నుత్తేజనములను మిక్కిలి యన్వేషింపుచున్నారు. కాని శాంతియను నెట్టిదో వారు గుర్తింపఁజాలనట్టి గాఢాంధకారమున మునింగియుండుచున్నారు. వారు క్షణికములును, హీనములును నగు వినోదముల యొక్క వివిధమార్గములందు సౌఖ్యమును దమకుఁ గొనుచుఁ దిరుగుచున్నారు. కాని వారెప్పటికిని విశ్రాంతిసౌభాగ్యమునకే నోచకున్నారు. నానావిధములగు హాస్యముల మూలమునను, జ్వరపూర్ణములగు ప్రలాపముల

మూలమునను వారానందమును, జీవితమును వెంబడింపుచు దిరుగుచున్నారు. కాని నిరంతరము శోకాతురులయి యుండి యవిరామముగ నశ్రుపాత మొనరింపుచుఁ, దుదకు భయంకర మృత్యుముఖంబునఁ బడి పోవుచున్నారు.

స్వార్థబహుళములగు నాహ్లాదముల నన్వేషించుటలో మనుష్యుఁడు జీవితసముద్రముపైఁ గొట్టుకొనిపోవుచు నాశల నిధియొక్క ప్రచండవాయువేగమందనఁగా తుపానునందుఁ జిక్కువడి పోవుచున్నాఁడు. అట్లు తుపానునకుఁ జిక్కి, మెదురుదెబ్బలఁ దినుచు, ఘోరముగ దుఃఖపిల్లుచుఁ దుద కెప్పటికో స్వీయాత్మిక్యముయొక్క గంభీరమౌనమునందు విద్యమానమయి యున్న రక్షణ మను కొండ నారోహింపఁ గలుగుచున్నాఁడు.

మానవుఁడు బాహ్యమగు కృషియందు నిమగ్నుఁడయి యున్నంతపర్యంతము వాని యాధ్యాత్మికశక్తి హీనమగుచునే యుండఁగలదు. అతఁడు హీనమగు తనయాభ్యంతరికశక్తిని దిరిగి పరిపుష్టమొనరించుకొనఁ నభిలషించినచో నేకాంతవాసమందు ధ్యాన మొనరింపవలసివచ్చుచున్నది. ఏకాంతవాసము నుండి విముఖుఁడయి యుండు వ్యక్తి జీవితముయొక్క సత్యజ్ఞానమును బడయనేరఁడు. ఒకవేళ సత్యజ్ఞానమును సంపాదించినను దానిని స్వల్పకాలపర్యంతమయిన సురక్షితముగా

నుంచుకొనఁజాలఁడు. ఈ రహస్యముచే నేకాంతవాసము యొక్క ప్రభావ మెల్లరకు గోచరించుచున్నది. ఏకాంతవాసముచే జీవితము యొక్క సత్యజ్ఞానమును సముపార్జింపనేరని వ్యక్తి తన హృదయక్షేత్రమున సూక్ష్మముగను, నగాధముగను వేరూనియున్న పాపములను గ్రహింపఁజాలఁడు. కారణమేమన సత్యజ్ఞానములేని వాని కాపాపములు బాహ్యమునకుఁ బుణ్యములుగనే గానఁబడుచుండును. మహోచ్చకోటికిఁజెందిన ధీమంతులుదక్క లోకమందలి సమస్తమానవులీపుణ్యరూపమునందున్న మహాభయంకరపాపములకు బలియయిపోవుచున్నారు.

"అంతర్ధ్యానముయొక్క నిశ్శబ్దము లగు గడియలందు వినీతభావముతోఁ దనపైఁ దాను సందేహమును శ్రద్ధను వహించునట్టి మానవోత్తమునియందే వాస్తవికమగు మహత్త్వము వెలయుచుండును."

సదా బాహ్యములగు నుత్తేజనములకుఁ జిక్కియుండు మనుష్యుఁడు నిరాశకును, శోకములకును గురియగుచుండును. ప్రపంచిక విలాసములయొక్క నినాదము మిక్కిలి ప్రబలమగు స్థానమందే హృదయశూన్యతయు మిక్కుటముగా నగాధమును, తీవ్రమును నగుచుండును. ఎవ్వాని సమగ్ర జీవితము విలాసములయొక్క లాలసలయందే కాక, ప్రపం

చిక కార్యవ్యగ్రతయందుఁ జిక్కువడియుండెనో, ఎవ్వఁడు దృష్టపదార్థములయొక్క పరివర్తనశీలమగు దృశ్యముచేతనే నిజప్రయోజనమును గలిగించుకొనఁ జూచుచుండునో, ఎవ్వఁడేకాంతవాసముయొక్క ముఖ్యావలంబనముచే స్థిరాస్తిక్యముయొక్క యాంతరికమును. సదృష్టమును నగు సూక్ష్మప్రపంచమును వీక్షింపఁజాలఁడో అట్టి మనుష్యుఁడు సమితము జ్ఞానమునుఁ బుద్ధిని సంపాదింపలేక శూన్యహృదయుఁడైయుండుచున్నాఁడు. అతఁ డేవిధముగను జగత్తునకు సాయమొనరింపఁజాలఁడు; అవసరమయినపుడు తన యోగ్యములగు కాంక్షలను బలిదాన మొసంగ నేరఁడు. కారణమేమన వానియొద్ద సమర్పణ మొనర్చుటకు ఉపభోజనమే లభింపనేరదు. వాని యాధ్యాత్మికభండారము శూన్యమయియుండును. కాని వస్తువులయొక్క సత్యమును నిర్ణయించు నిమిత్తమేకాంతము నాహ్వానించునట్టియుఁ దన యింద్రియముల పరిభూతి మొనరించుకొన, నిజేచ్ఛాప్రాబల్యముఁ దగ్గించినట్టియు మనుష్యుఁడనుదినము నూతనమగు జ్ఞానమును, బుద్ధిని సంచయ మొనరించుకొనుచున్నాఁడు. అతఁడు వలయుచోఁ బ్రపంచమున కపారమగు సాహాయ్యము నొనరింపఁగలుగుచు సత్యస్వరూపముచేఁ బరిపూర్ణుఁడయి యుండుచున్నాఁడు. కారణమేమన వాని యాధ్యాత్మికభండారము సమృద్ధిగ నుండుచుండును

ఆకాశమునుండి పుష్పములుగా సంపదల వినియోగింపు మన్నలఁదియు వృద్ధియగుచుండును.

మనుష్యుఁ డాభ్యంతరిక సత్యములయొక్క ధ్యానము నందు దగ్గరకుఁడయి యున్నంతవఱకు మిక్కుటముగా జ్ఞానమును, శాంతమును సంపాదింపఁగలుగుచున్నాఁడు. అతఁడు కోమలమగు పుష్పమువలె సత్యముయొక్క సర్వవ్యాపకమగు ప్రకాశమువైపునకుఁ దన్నుఁ దానే వికసింపఁజేసికొనుచు, జీవిత చైతన్యమును బ్రసాదించు రశ్మిని బ్రాప్తింపఁజేసికొనుచు దానిని గబళించివేయుచున్నాఁడు. అతఁడు జ్ఞానముయొక్క యమృతమధురమయిన [illegible]గి సుప్రసన్నహ్రదముతో నాపైలమేటి దివ్యోదకమును పానమొనర్చుచుఁ దన తీవ్రపిపాసను నివృత్తింపఁ జేసికొనుచున్నాఁడు. ఇట్టిమనుష్యుఁ డేకాగ్రమగు ధ్యానముచే నొక్క సంవత్సరకాలములో సహస్రగ్రంథపఠనముచేఁ బడయఁజాలని సత్యజ్ఞానము నొకగడియయందే సంపాదింపఁగలుగుచున్నాఁడు. ఆస్తిక్య మహత్త్వము. జ్ఞాన మనంతము, దాని యుద్గమస్థాన మభంగము. పైని వచించిన సత్పురుషుఁడు తన యాస్తిక్యముయొక్క నైరంతరిక గాంభీర్యముపై విశ్వాసమును గలిగియుండుచున్నాఁడు. అతఁడు స్వర్గీయ వివేకముయొక్క యనూనప్రవంతియందలి హృదయాహ్లాదకరమగు జలమునుండి నజరామరత్వమును పానమొనరింపుచున్నాఁడు.

ఆస్తిక్యముయొక్క పరమసత్యములతో సంయోగమొన
రించుకొన నలవడియున్న వ్యక్తియే ప్రతిభాసంపన్నుఁడు. అతఁడే
జీవితజలముయొక్క శాశ్వతోద్గమస్థానమందుఁ జీటికి
మాటికిఁ జేరి తజ్జలమును పానమొనరించుచున్నాఁడు. కుశాగ్ర
బుద్ధియొక్క సంపాదనపద్ధతు లసంఖ్యాకములును, నభేద్యము
లును నయియున్నవి. కారణమేమన నాపద్ధతులు సర్వవ్యాపక
ములును, నున్నతియొక్క ప్రాథమికద్వారములును నయి
యుండుటచేతనే కుశాగ్రబుద్ధియొక్క సమస్తకార్యములు
నిత్యనూతనములయి రాజిల్లుచున్నవి. కుశాగ్రబుద్ధి తనజ్ఞాన
మును బరుల కొసంగుచున్నకొలఁదియు జ్ఞానమునందు స్వాభా
వికముగాఁ బరిపూర్ణుఁ డగుచుండును. వాని ప్రతికార్యమును
సంపూర్ణమయినపిదప వానిమస్తిష్క మపూర్వమగు నభి
వృద్ధిని గాంచి విస్తృత మగుచుండఁగలదు. అతఁడు సమస్తవస్తు
వులయొక్క మర్మముల గ్రహించుచుఁ బ్రకృతిశక్తియొక్క చరమ
మసీమను వీక్షింప సమర్థుఁ డగుచున్నాఁడు. కుశాగ్రబుద్ధి జ్ఞాన
ముచే నిండియుండు చున్నాఁడు. వాఁడు తనశక్తియొక్క
ప్రభావముచే నంతముయొక్కయు, ననంతముయొక్కయు భేద
ము నేకీభూతమొనరించివేయుచున్నాఁడు. అతనికి సామాన్య
సాహాయ్యక ప్రయోగములయొక్క యవసరమే తటస్థిం
పనేరదు. జలాశయములనుండి కిరణములద్వారమున దివా

కరుడు జలమును గ్రహించువిధంబుననే సూక్ష్మగ్రాహి యగు కుశాగ్రబుద్ధి సకలార్థసిద్ధిదాయకమును, సకలకార్య సాధకమును, హృదయాహ్లాదకరమును నగు జ్ఞానసలిలము నాసర్వవ్యాపకమగు ఝురమునుండి యవసరమగునప్పుడెల్ల గ్రహించుచున్నాడు. కుశాగ్రబుద్ధియందును, సామాన్య మానవు నందును గలభేదమును మనము తెలిసికొను టుచితము. కుశాగ్రబుద్ధి యాభ్యంతరికసత్యమునందు నిత్య మధివసించు చుండును. సామాన్యమానవుఁడు సదా బాహ్యదృశ్యము లందుఁ గాపురము సేయుచుండును. సాధారణమనుష్యుఁడు వినోదములను, వింతలను విలోకింపఁ దిరుగుచుండఁ గుశాగ్ర బుద్ధి నిత్యము బుద్ధిసంచయమునకయి సంచార మొనరింపు చుండును. సామాన్యమానవుఁడు గ్రంథములపై నాధారపడి యుండుచుండఁ గుశాగ్రబుద్ధి తన యాంతరికాసక్తులపై నవలంబించుకొనియుండుచున్నాడు. పుస్తకజ్ఞానము శ్రేష్ఠ మయినదే, కాని దీనియొక్క యథార్థావశ్యకతను గ్రహింప వలసి యుండును. అప్పుడే గ్రంథపఠనము లాభదాయకము కాఁగలదు. లేనిచో నయ్యది బుద్ధి నుడుగింపఁ జేయఁజాలదు. బుద్ధియొక్క సంచయద్వారము స్వయముగా జీవితమునందే యేర్పడియున్నది. ఈ ద్వారమును మనుష్యుఁ డభ్యాసానుభవ ములచే గ్రహించి తెలియఁగలుగుచున్నాడు. పుస్తకములచే

మనకు సమాచారములు తెలియవచ్చును. కాని స్థిరమగు జ్ఞానము లభింపనేరదు. సద్గ్రంథములు మనజ్ఞానసంపాదనకై నుత్తేజిత మొనరింపఁగలవు, కాని స్వయముగా జ్ఞానమును సంపాదింపనేరవు. కావున మన కేవల సద్గ్రంథపఠనములో సంతృప్తి పడినలఁ గాక, స్వయముగా శ్రమపడవలసి యున్నది. కేవల గ్రంథములపై నవలంబించుచుండియుండు వ్యక్తి తనలో పలి మౌనసంచయద్వారమును సమీపింపజాలకపోవుటచేఁ దానొనరించిన శ్రమనంతయు వ్యర్థ మొనరించి మిక్కిలి పరిశ్రాంతుఁడయి పోవుచున్నాఁడు. అతఁ డెంత చదువుఁడై యున్నను జ్ఞానము నార్జింపఁ జాలఁడు. అతఁడు తన సమాచారభాండారమును (గ్రంథాంతము) వలన శీఘ్రముగాఁ జేరఁగలుగుచున్నాఁడు, కాని శూన్యుఁడగుచు నాసమాచారములనే సంపాదింపుచు వ్యాకరణకోశమును నింపివేయుచున్నాఁడు. చీటికి మాటికి నతఁ డొనరింపుచుండు నట్టి కార్యములచే జీవితముయొక్క మధురస్వాతంత్ర్యమును, నవీనత్వమును బడయఁజాలఁడు ఇట్టి మనుష్యుఁడు జ్ఞానోపలబ్ధియొక్క యసంతమార్గములనుండి తన్నుఁ దానే తొలఁగించుకొని, జీవితముతోడి పొత్తును విసర్జించి మృతప్రాయములగు నశ్వరదృశ్యములతోడఁగూడి వ్యవహరింప నారంభింపుచున్నాఁడు. సమాచారములు సమాప్తము లగుపోవుచున్నవి, కాని జ్ఞాన మెప్పటికిని సమాప్తము కానేరదు.

చమత్కృతబుద్ధియు, మహత్వప్రాప్తియు నేకాంతమందు బుద్ధములును, వికసితములును, సంపూర్ణములును నగుచున్నవి. అతి సామాన్యమనుష్యుఁ డయినను నిత్య మేకాంతమునందుఁ దన శక్తులను, మనోబలమును గూర్చి విచారింపుచు నాతని సూక్ష్మప్రీతి మొనరించుకొన నాలోచింపుచుఁ దన యాదర్శప్రాయమగు నభిలషితకర్మను గూర్చి విచారింపుచు, బరీక్షింపుచు నున్నచో నిజాభీష్టసిద్ధినంది త్వరలో కుశాగ్రబుద్ధి కాఁగలుగుచున్నాఁడు. ప్రపంచముయొక్క వివిధములగు వినోదములను, విలాసములను సంపూర్ణముగా విసర్జించి, సర్వజనప్రీతిపాత్రతనుండియు, మిథ్యాప్రశంసనుండియు విముఖత్వమును వహించి, సకల మానవజాతియు కల్యాణము నిమిత్త మే దేనియొక్క మహోన్నతాదర్శమును సంపూర్ణ మొనరించుటకయి యేకాగ్రముగ నాలోచన గావింపుచుఁ గార్య మొనరింపుచుండు మనుష్యుఁడు భవిష్యద్ద్రష్టయు, స్వయంసిద్ధుఁడును గాఁగలుగుచున్నాఁడు. నిశ్చయముగా నిజహృదయమును మృదులముగను, మధురముగను, సుందరముగను, పవిత్రముగను, శ్రేష్ఠముగను జేసికొనుచుండునట్టియు, నేకాంతమందుఁ జిరకాలపర్యంతము ధ్యానపూర్వకముగ వస్తువుల యాంతరికమగు శాశ్వతనిర్ణయ మొనరింపుచున్నట్టియు మనుష్యుఁడాస్తిక్యముయొక్క యూర్జితశ్రావ్యస్వరయుతుఁ డగుచు

న్నాఁడు. అతఁడు, సార్వజనికగీతమునకు సుస్వాగత మొసం
గఁ దన హృదయమందిర సింహద్వారమును దెఱచివేయుచు
న్నాఁడు. అతఁ డీరీతి వర్తించి తుద కొక కవియయి పోవుచు
న్నాఁడు.

సమస్తవిధములగు కుశాగ్రబుద్ధులసిద్ధి యొకేవిధముగ నుండుచుండును. కుశాగ్రబుద్ధి యేకాంతము యొక్క స్వచ్ఛ హృదయమును, దివ్యదృష్టిని, స్పష్టమగు శ్రవణశక్తిని గలిగి యున్నట్టి సుందరాకారుఁడగు నొక బాలకునివంటివాఁడు. కాని యపు డపు డా కుశాగ్రబుద్ధిచే మౌనముయొక్క సురక్షితద్వారమునుండి విలోకింపఁబడు కోలాహల మగ్నమగు ప్రపంచము, వాని నిగూఢమగు భేదమును, గ్రహింపఁజాలదు.

అన్యమతావలంబుల యెడ డుక్కలి క్రూరముగ వర్తింపుచుండిన సెంటుపాలు తన క్రైస్తవమతమునం దంధభక్తిస, బక్షపాతమును గలిగియుండెడివాఁడు. పరమత సహనబుద్ధియు, విశ్వసోదరప్రేమయు లేని యతఁడు మూఁడుసంవత్సరముల కాలము వనమునం దేకాకియయి వసించి, నిరంతరైకాంతచింతనముచే నాత్మపరిశోధనమునం దప్రతిహత ప్రతిభాభా సముపేతుఁడయి, విశ్వజనీన ప్రేమయుతుఁ డగు ధర్మదూతయు, భవిష్యద్దర్శియగు సిద్ధుఁడును నను విఖ్యాతిని

విశాలమగు క్రైస్తవప్రపంచమున సంపాదించియుండెను. భోగవిలాసములమధ్యఁ బోషింపఁబడియున్న రాజనందనుఁడగు శ్రీ సిద్ధార్థుఁడు తొలుత నొక సామాన్యమానవుఁడయియుండి కోలాహలమయప్రపంచమును బాసి ఘోరారణ్యముల వత్సరషట్కమేకాంతముగ వసించి, నిశ్చలచిత్తముతోఁ బరమసత్యస్వరూపమునుగూర్చి తర్కించి, చింతించి, ధ్యానించి చపలములగు నింద్రియములతో ఘోరసంగ్రామ మొనరించి, కాముని హతమొనర్చి, తనయాస్తిక్యము యొక్క గంభీరభేదములఁ దీవ్రమగు ధ్యానముతో విచారించి శుద్ధుఁడును, సిద్ధుఁడును, బుద్ధుఁడును నయి జ్ఞానపిపాసార్తులకెల్లరకు నజరామరత్వమును బ్రసాదించు మహోనిర్వాణజ్ఞానపీయూషధారను బానమొనరింపఁ బ్రసాదించి ధన్యుఁడయ్యెను. శ్రీబుద్ధభగవానుఁ డేకాంతవాసమందలి ధ్యానప్రభావము నత్యద్భుతమని తన శిష్యులతో నుడివియుండెను. చిత్తశాంతికేకాంతవాసము మిక్కిలి ప్రయోజనకర మగు సాధన మని ధమ్మపదమువంటి వేదగ్రంథ మెలుగెత్తి చాటుచున్నది. లావ్రూగాదివంటి యొక సామాన్య మనుష్యుఁడు సుజ్ఞానాన్వేషణమున బయల్వెడలి, యేకాంతవాస స్వీకారముచే భగవత్సాక్షాత్కారమును బడసి ప్రపంచమునం దొక విఖ్యాత ధర్మాచార్యుఁడు కాఁగలిగెను. అక్షరజ్ఞానము లేని వడ్రంగి

పుత్రుఁడగు జీససు చాలకాలము పర్వతములపై నేకాంతవాసమొనర్చి అనంతమగు విశ్వప్రేమయందును, విశాలమగు పవిత్రబుద్ధియందును ధ్యానము సలిపి స్వర్గరాజ్యమును బడసి విఖ్యాతమానవజాతీయకల్యాణకర్త కాఁగలిగెను.

ఈ మహాపురుషులెల్లఁ బవిత్రమును, స్వర్గీయమును నగు జ్ఞానముయొక్క సమున్నతశిఖరముపై సమారోహించిన పిమ్మటసమయములు సావకాశములం దెప్పుడును మాటిమాటి కేకాంతమున కరుగుచుండెడివారు. మహాపురుషశిరోమణియే యైనను కేవల మేకాంతవాసముచేఁ బ్రాపించునట్టి లీనయాంతరికశక్తిని మాటిమాటికిఁ బుష్టియుతమును గావించుకొనుచుండనిచో దనయాధ్యాత్మికోన్నతినుండి పతితుఁడయి నిజప్రభావమును గోల్పోవవలసినవాఁ డగును. శ్రీబుద్ధాది ధర్మాచార్యులు శమభావములను, లోనియుత్పాదకశక్తులను నంతఃకరణముతో సమానమొనరించి, తమతమ సిక్క్యమును స్వాధీనమొనరించుకొని సర్వవ్యాపకమగు విశ్వవాంఛలో వ్యక్తిగతమగు స్వేచ్ఛాభిలాషను లీనమొనర్చి. ధ్యానధారణ శక్తిని సంపాదించి, ఉత్పాదకములును, కారణభూతములును నగు భావముల కధినాయకులయి జగదున్నతికి ముఖ్యహేతుభూతు లయిరి.

ఇది యొక కౌతుకము కాదు, కాని సుస్థిరమగు నొక నియమము. ఆసనస్థితియం దెట్టి గుప్తభేదముండని విధముగనే శ్రీబుద్ధాది మహాత్ముల పవిత్రజీవితములందును నెట్టి కుతూహలమును లేదనియే చెప్పవచ్చును. ప్రతిస్థితియం దామహాశక్తియొక్క రూపము సమానముగా నుండఁగలదని చెప్పవలను పడదు. మహాపురుషులయందు విశేషముగా గానవగు సృష్టిశక్తి చాలసంవత్సరములవఱకు విరామముగా నేకాంతవాస మొనరించుటచే సంప్రాప్తమగుచున్నది.

మానవుని సత్యావాసస్థానము మహత్తరమగు మానసమునందే విరాజిల్లుచున్నది. వానియందుఁగల సత్యమునకును, స్థిరత్వమునకును మానసమే యుద్గమస్థానము. అట్లయ్యు మానవుని యాధునికస్వభావము ద్వివిధములయి యుండుటచే బాహ్యకార్య ప్రవృత్తి యావశ్యక మగుచున్నది. ప్రపంచమునందు సంపూర్ణమగు నేకాంతముగాని, సంపూర్ణమగు కార్యవ్యగ్రతగాని సత్యజీవిత మనఁబడనేరదు. ఏకాంతవాసముచే శక్తిని బుద్ధిని సంచయ మొనరించి ప్రాపంచిక కర్తవ్యముల నిర్వహించుటయం దాశక్తిని, బుద్ధిని వ్యయ మొనర్చుటయే సర్వసామాన్యులకు సత్యజీవిత మయియున్నది. మనుష్యుఁడు దినాంతమున ననఁగా సాయంసమయమునఁ గార్యనిర్వహణ ప్రయాసముచేఁ బరిశ్రాంతుఁడయి రేపటిదినముయొక్క కర్తవ్యసర్వ

హాగమునకు వలయు పాటను గావించుటకుఁ దగు మధుర విశ్రాంతి ననుభవించు నిమిత్తము స్వగృహోన్ముఖుఁడగు చందముననే ప్రతిమనుష్యుఁడును జీవితకర్తవ్యముల నిర్వహిం చుచు నలుపుజెందినంతనే విశ్వయంత్రశాలయొక్క కోలాహల మునుండి విడివడి భవిష్యజ్జీవితహితార్థము ప్రాణపూర్వకముగ నేకాంతవాసమున కియ్యకొనుట శ్రేయస్కరము. ఈరీతిగ ననుదినము వాసరమందలి యొకింతభాగమును బవిత్రమును, సదుద్దేశ్యపూర్ణమును, ప్రశాంతమును నగు నేకాంతవాసమందు వినియోగించు వ్యక్తి యసామాన్యశక్తి సంపన్నుఁడును, యోగ్యుఁడును, బ్రహ్మానందమయుఁడును గాఁగలఁడు.

ఏకాంతవాసము శక్తిసంపన్నుల స్వాభావికసంపత్తి. శక్తిసంపన్ను లగుటకుఁ గటిబద్ధులయినవారి కిదియే దివ్యౌషధము. మానవుఁడు సామాన్యస్థితినుండి విడివడి, మహోన్నతదశకుఁ బ్రాపించినకొలఁదియు నేకాంతవాసమం దనురక్తుఁడగుచున్నాఁడు. అతఁడు సత్యము నన్వేషింప నేకాంతస్థానమున కేగి స్వాభీష్టసిద్ధి నందుచున్నాఁడు. విజ్ఞానధనులగు ప్రాచీన భారతీయ ఋషిపుంగవు లేకాంతవాసమును, మౌనమును, ధ్యానమును, చింతనమును శ్రేయించియున్నట్లు సకల ప్రపంచముయొక్క యేజాతియందలి మహాపురుషు లేయుగమునను శ్రేయించియుండలేదు. భారతీయఋషులు స్వాను

భవముచే నేకాంతవాస మహిమను గ్రహించియుండినవార లగుట దత్త్వజిజ్ఞాసులయి మోక్షోపలబ్ధికిఁ గోలాహలశూన్య ములగునరణ్యముల నాశ్రయించుచుండిరి. ఋషీశ్వరులు భారత జాతీయజీవితము నాశ్రమచతుష్టయముగ విభజించి, బ్రహ్మ చర్యమునం దొకవిధముగను, వానప్రస్థమందు మిక్కుటము గను, సన్న్యాసమునందు సంపూర్ణముగను నేకాంతవాసమునకు స్థానము నొసంగి, తత్ప్రభావమును లోకమునకుఁ జాటియుం డిరి. ఆత్మవిజయమున కేకాంతవాస మేరీతిఁ దోడ్పడుచుండఁ గలదో ప్రాచీనార్యవిజ్ఞానపాఠకునకుఁ బ్రత్యేకించి నుడువఁబని లేదు. జ్ఞానమును, బుద్ధిని, సత్త్వమును, శక్తిని బడయుట కేర్ప డియున్న ప్రత్యేకమార్గములన్నియు శబ్దశూన్యము లగు నేకాంతవాసములో నుండియు, మౌనములో నుండియుఁ బోయియున్నవి. మౌనయుతమగు నేకాంతవాస మాత్మవిజ యమునకును, ఆత్మవిజయ మానందసామ్రాజ్యపట్టాభిషేక మునకును ముఖ్యసాధనములు.

---

## ద్వాదశ ప్రకరణము.

---

# స్వావలంబనము.

తన స్వచ్ఛహృదయమునందు దివ్యప్రకాశమును గలిగియుండు మనుష్యుఁడే యెల్లరిమధ్యఁ గూర్చుండి పరమోజ్జ్వలమగు దివసము యొక్క బ్రహ్మానందము ననుభవింపఁగలుగుచున్నాఁడు. కుమారా! యథాశక్తి నేకాంతముగనుండు నుపాయమాలోచించుచుండుము. నీయెడ నీకు విశ్వాసము గలిగియుండుము. నీయాత్మ వేనిని ధరించియున్నదో పరీక్షింపుము.

— జార్జి హార్బర్టు.

ఆనందమయజీవితమునకు స్వావలంబన మత్యంతావశ్యకమయి యున్నది. శాంతి ననుభవించుటకు శక్తి వాంఛనీయము. సంరక్షణమునకు స్థైర్య మపేక్షింపఁబడుచున్నది. మన నుండి బాహ్యక్రమణములచే దూరమయి పోవునట్టి పదార్థసముదయములపై మన నిత్యానంద మవలంబితమయి యుండరాదు.

తనజీవితమును నియంత్రిత మొనరించుకొనఁ గలుగు టయు. శాంతిని సంపాదించుకొనఁ గలుగుటయును మనుష్యుఁడు తాను నిలుచుట కాధారభూతమయి, తనలోపల వెలయుచున్న సుస్థిరమగు కేంద్రమును బడయునందాక తనజీవితమును సత్యరూపముగ నారంభింపఁజాలఁడు. పరివర్తనశీలమగు వసువును విశ్వసించినచో స్వయముగా మనుష్యుఁడును మార్పునకు గురియగు చుండఁగలఁడు. తననుండి వేఱు చేయఁబడఁగల వస్తువుయొక్క సాహాయ్యమును మనుష్యుఁడవలంబించియున్నచో నావసువు తన్ను బాసి పోయినంత క్షతగాత్రుఁడయి పతితుం డగును. అతఁడు నశ్వరములగు లాభములచే సంతుష్టుఁడగుచున్నచో సర్వమును గలిగియుండియు నానందతృష్ణాబాధచే నిరాహారియై మడియును. ఈమర్మముల నెఱింగి మనుష్యుఁడు పరుల సాహాయ్యమునకయి ప్రతీక్షింపకయు, వారినుండి పారితోషికముల సంపాదింపవలయునను వాంఛను గలిగియుండకయు, నితరములగు స్వార్థమయ ప్రయోజనముల నాకాంక్షింపకయు, మనుచుండుట శ్రేయస్కరము. యాచించుట, దూషించుట, పశ్చాత్తాపపడుట మానవునకుఁ దగనిపనులు. ప్రతిమనుష్యుఁడును దన యాంతరికసత్యము నవలంబించి, తన హృదయముయొక్క భద్రస్థితికయి సంతోషమును బడయుచుఁ దనబలముపై నాధారపడియుండు టావశ్యకము.

యొక్క శక్తిచేఁ దాను నడువవలసిన మార్గము నన్వేషించు టావశ్యకము. బహిర్జగత్తునందుఁ బరివర్తనము, నాశనము, అసంరక్షణము కానవచ్చుచుండ నంతర్జగత్తునం దానందసంరక్షణ స్థిరత్వములు దృగ్గోచరము లగుచున్నవి. ఆత్మ స్వయముగాఁ బర్యాప్తమయి యున్నది. ఎచ్చోట దాని కవసరము కలుగుచుండునో, అయ్యెడనే తత్సంపూర్తికి వలయు సాధనములు బహిర్గతము లగుచుండును. మానవుని యజరామరమగు వాసస్థాన మతనియందే వెలయుచున్నది. మనుష్యుఁడయ్యెడ కరిగి తనగృహముపై సంపూర్ణాధికారమును స్థాపించుకొనుట యావశ్యకము. మనుష్యుఁడా! నీ వా పవిత్రస్థలమున రాజవయియుండ తత్ప్రదేశమును దాటి యీవలి కేతెంచినంతనే దాసుఁడవయిపోవుచున్నాఁడవు పరులు తమ తమ చిన్నరాజ్యములందు సువ్యవస్థ నొనరించినను, దుర్వ్యవస్థ నొనరించినను నీవు వానిని లెక్కసేయక తటస్థుఁడవయి యుండుము. నీవు నీహృదయసామ్రాజ్యముపై సంపూర్ణ శాసనబలమును గలిగియున్నదియు, లేనిదియు మాత్రము సదా విచారించుకొనుచుండుము. నీయొక్కయు, నఖిలప్రపంచముయొక్కయుఁ బరమకల్యాణము నీహృదయమందే కలదు. సదా నీవు నీ యంతఃకరణము ననుసరించుటయందు బ్రమత్తుఁడవు కావలదు. నీమస్తిష్కమును స్వచ్ఛ

ముగా నుండుకొనుము. నీయందుగల నిర్ణయబుద్ధిని కర్త
వ్యాచరణమం దుపయోగించుచు వృద్ధిగావించుకొనుచుండుము.
నీయొక్క యిచ్ఛాశక్తిని సక్రమముగా నుపయోగించుచు
సమున్నత మొనరించుము. నీయొద్ద వెలయు జ్ఞానమును
సద్వినియోగముచే వర్ధిల్లఁజేయుము. నీ యాత్మయందుఁ
గల ప్రకాశముపై దివ్యదృష్టి నునిచి దాని నెల్లరీతులఁ
బోషించుచుండి దానిని క్రోధాదిప్రచండవేగములనుండి సం
రక్షించుచుండుము. తదచలజ్యోతి నిరంతర ప్రవర్ధమాన
మగుటకుఁ దగు యత్న మొనరించుము. కుమారా! నీవు
సత్వరము స్థూలమగు బహిర్జగత్తును విసర్జించి విశాలమగు
నీయాత్మసామ్రాజ్యమునఁ బ్రవేశించుము. ఆదర్శమానవుని
రీతి విచారించుచు నావిధముగనే కార్య మొనరించుచుండుము.
ఉత్తమమానవుఁడవయి జీవితకాలమును గడపుచుండుము.
నీకు నీవే ప్రభుఁడవయి స్వయముగా సంపూర్ణుఁడ వగుచుం
డుము. నీలోపలఁగల శాశ్వతకేంద్రము నన్వేషించి, తదా
జ్ఞాపాలనమునకు సన్నద్ధుఁడవయి యుండుచుండుము. భూగో
ళము సూర్యుని తన కేంద్రస్థాన మొనరించుకొని నడచువిధ
మున నీవును, నీలోపలఁగల దివ్యప్రకాశముయొక్క కేంద్రము
యొక్క యాజ్ఞలఁ బాలించుచు నడువుము. నీలోపల వెలుం
గుచున్న ప్రకాశమును పరు లంధకార మని వచించినను నీ కెట్టి

హానియు లేదు. పరుల నిరర్థకములగు ప్రశ్నల కన్నింటికిఁ బ్రత్యుత్తరము నొసంగవలసిన భారము నీది కాదు. నీవు కేవలము నీకొఱకే బాధ్యుఁడవయి యున్నావు, కాన నిన్ను నీవు విశ్వసించుకొనుము నీవు నీకొఱకయినను సత్యసంధుఁడవు కావేని నీవు సత్యముయొక్క మధుర సంతోషము లభింపఁ జాలదు.

మహాపురుషుఁడు స్వతంత్రమనుష్యత్వముయొక్క సరళ మహాత్వము...డ ...కయి నిలువఁబడి యుండుచున్నాఁడు. వాఁడు తనమార్గముపై నిర్భయముగా నడచుచుండి పరుల నుండి వ్యర్థముగా క్షమింపుఁడని కోరుచుండనొల్లఁడు. అతఁడు గృహబాహ్యమునఁ దిరిగివచ్చుట కేగుటచేఁ దనవస్త్రములపైఁ బడుచున్నట్టి దుమ్మును దులిపి వేసికొనుచుండు విధముగ సదా మానవలోకమునుండి తనపైఁ బడుచుండు భూషణదూషణములఁ దనచిత్తమును స్పృశింపకుండగనే తుడిచివేయుచుండును. అతఁ డను కూల పరివర్తనశీలము లగు లోకులయుద్దేశ్యముల ననుసరించి వర్తింపనొల్లఁడు అతఁడు సదా తనమస్తిష్కముయొక్క దివ్య ప్రకాశ సాహాయ్యంబున నడచుచుండును. లోకమందు దసంఖ్యాకులు మిథ్యాప్రశంసార్థమును, లౌకికరీతినిమిత్తమును, కృత్రిమ నాగరకతకొఱకును దమ మనుష్యత్వమును విక్రయించివేయుచుందురు.

కుమారా! నీవు భూతప్రేతములయొక్కయు, దేవీదేవతలయొక్కయు, మనుష్యులయొక్కయు శాసనముల ననుసరించుటయందలి మిథ్యావిశ్వాసమును విసర్జించి, నీయాంతరిక సత్యప్రకాశముపై నేకాకివయి స్వతంత్రముగా నిలువఁబడఁ జాలనంత పర్యంతము బంధనయుక్తుఁడవును, స్వతంత్రుఁడవును, సంపూర్ణానందమయుఁడును గాఁజాల వనుట సత్యము. నీవు ప్రమాదవశంబుననయిన నాత్మాభిమానమును స్వావలంబనముగ భావింపవలదు. కారణమేమన నభిమానము యొక్క క్షణభంగురమగు పునాది (ఆస్తిభారము)పై నిలువఁబడుటచే ముందుముందు విరిగిపడఁగలవు. గర్వాంధుఁడగు పురుషుఁడు పరులపై నవలంబితుఁడయి యున్నరీతి మఱియేమనుష్యుఁడు నుండనేరఁడు. వాఁడు పరులు తన్నుగూర్చి యొనరించు ప్రశంసావాక్యమాధుర్యము నమృతప్రాయముగఁ బాన మొనరింపుచుండును. కానియితరులు తన్ను నిందించునపుడు క్రోధోద్దీపితుఁ డగుచుండును. వాఁడు మిథ్యాప్రశంసను నిర్దోషముగ భావింపుచు నిత్యము పరుల యభిప్రాయములచే నొకక్షణమందుఁ గ్రుద్ధుఁడును, మఱొక్కక్షణమందు సంతుష్టుఁడునునయి యుండుచుఁ దన మానసిక వికారముల వృద్ధి గావించుకొనుచుండును. ఈరీతిగ గర్వాంధుని సౌఖ్యమాత్రము పరహస్తగతమయి యుండు

చుండును. కాని స్వావలంబనముపై నాధారపడియుండు మనుష్యుఁడు మిథ్యాభిమానముపైఁ గాక, తనయందలి శాశ్వత నియమములమీఁదను, సిద్ధాంతములమీఁదను, పవిత్రాదర్శములమీఁదను, సత్యముమీఁదను నిలువబడియుండు చున్నాఁడు. ఈకారణముచే నతఁడు స్థిరముగా నిలువఁబడనేర్చి యాంతరిక క్రోధోద్వేగ తరంగములచేతను. బాహ్య నిందా స్తుతుల తుపానులవలనను దసదృఢమగు పునాదినుండి విసమని చలింపనేరఁడు. ఒకవేళ నాఁడు చలించినను తత్క్షణమే తన్ను సంబాళించుకొని తనసవిశస్థితికిఁ బ్రాపించుచున్నాఁడు.

నాయనా! నీవు మానసిక తులాదండముయొక్క బీజము నన్వేషింపుము. అన్వేషించి దానిపై నొంటరిగా సుస్థిరుఁడవగుము. దీనిచే నీవు నీజీవితకార్యములం దవశ్యము సఫలతను గాంచ గలుగుదువు. నీ వైశార్ద్యమును గూర్చి నీమస్తిష్కము నుపయోగింతువో దానియందుఁ దప్పక సిద్ధి నందఁగలుగుదువు. కారణమేమన యథార్థమగు స్వావలంబితమగు వ్యక్తియే శ్రేయుఁడగుచున్నాఁడు. పరుల సాహాయ్యముపై నిలువఁబడియుండరా దనుటకు వారియొద్దనుండి యెట్టి నీతిశిక్షను బడయరాదనుట తాత్పర్యము కాదు. నాయనా! నీవు జ్ఞానాభ్యుదయపథమునుండి యెట్టిస్థితియందును విముఖత్వమును వహింపకుము. భద్రమును, నుపయోగకరమునునగు నంశము నెచ్చోటినుండి.

యమునఁ బడయుటకు సదా కటిబద్ధుఁడవై యుండుము. వినయ విధేయతలు ఎప్పుడును బాహ్యరూపములయి యుండఁ గూడవు. ఇవి వృద్ధి నందినకొలఁదియు మానవకల్యాణమును బొందుచుండఁగల దు. మనుష్యుఁడు స్వావలంబనపరాయణుఁ డగుచున్నకొలఁ దియు విధేయుఁడును, వినయశీలుఁడును నగుచుండఁగలఁడు మహాత్ముని యాత్మప్రకాశము రాజరాజేశ్వరుని కీర్తియు సరిరానే రదు. అతఁ డింత వినయసంపన్నుఁ డగుటకు హేతు వేమి? అతఁడు తనయందుగల యీశ్వరీయమహత్త్వముననే నమ్రస్వభావమును గలిగియుండఁ గలుగుచున్నా నని గ్రహింపఁగలుగుచున్నాఁడు. కుమారా! నీవు నిశ్శేషముగ సహమానవులనుండి నీతి శిక్షను బరిగ్రహింపుచుండుము. విశేషించి సత్యరూపులగు నా దర్శగురువులనుండి గుణపాఠముల నేర్చుకొనుచుండుము. కాని సర్వోత్కృష్టమగు ననుశాసనము నీయందే కలదనియు, మఱె చోట్లను లేదనియు నెఱిఁగి పరమసత్యమును మాత్రము విస్మ రింపకుము. ఆదర్శగురుసత్తముఁడయినను నీకు 'ఇదియే సత్యమా ర్గము' అని బోధింపుచుండును కాని దానిపై నడిపించి విజయ ని గావించుటకు మాత్రము బాధ్యుఁడగుచుండుట లేదు. గురూప దేశిత మార్గానుసరణముచే విజయమునందు సంపూర్ణమగు బాధ్యత నీయందనే కలదు. కావున నీవు స్వయముగాఁ బ్రయ త్నశీలుఁడవగుము, నిజపురుషార్థముచే జ్ఞానమును సముపార్జించి

స్వయంకృషిచే నాగురువుయొక్క సత్యమును నిజసత్యముగఁ జేసికొనుము. ఆత్మవిశ్వాస మభ్యున్నతి కత్యంతావశ్యకమగు సాధనము.

“ నిజబలము చే మనుష్యుఁ డగుట, స్వీయాత్మశక్తిచే మహాత్వమునకుఁ బ్రాపించుట, ప్రకాశయుతమగు జీవితమును గడపుట యనునవే దైవైశ్వర్యముయొక్క ముఖ్యలక్షణములు.”

కుమారా! నీవు నీకు స్వామి వగుము. నీపై నీవు శాసకుఁడవు కాఁగలిగినపుడే ధన్యుఁడవగుదువు. ముఖస్తుతిని కృత్రిమవేషమును ప్రేమింపకుము. నిన్ను నీ వొక ప్రపంచముయొక్క ప్రధానమును, సజీవమును నగు భాగముగ భావించి కార్యమొనరింపుము. పవిత్రమగు ప్రేమను బరులకుఁ బ్రసాదించుము. తిరిగి దానిని వారినుండి పడయ నాశింపకుము. పరులయెడ సహానుభూతిని గలిగియుండుము. పరులు సదా నీ పట్ల సహానుభూతిని వెల్లడించుచుండవలయునని వాంఛింపకుము. పరులకు సాహాయ్యమొనరింపుము, కాని పరులసాహాయ్యముపై నవలంబితుఁడవయి యుండకుము. నీ కార్యము సత్యపరతంత్రమగుచోఁ బరులు దానిని దూషించుచున్నను లెక్కింపక సంతుష్టాంతరంగుడవయి యుండుము. నీవు మఱచియు ‘ నా యీకార్యము లోకమునకు రుచికరముగనుండునా ? ’ యని పరులఁ బ్రశ్నింపకుము ; నీయందును విచారించుకొన

ణము. సదా నీవు విస్మృతిలేనివాఁడవయి "నా యీకార్యము సత్యసమన్వితమును, ధర్మాశ్రితమును నయియున్నదా?" యని సదా నీయంతఃకరణమును బ్రశ్నించుకొనుచుండుము. నీకార్యము సత్యపరతంత్రమగుచో దానిని లోకముయొక్క దూషణమును, దర్కమును స్పృశించుటకైన సమర్థములు కానేరవు. నీ వొనరించు కార్యమే యసత్యమును, నధర్మమును నగుచోఁ బరులద్దాని నేవగించుకొనక పూర్వమే యది స్వయముగా విధ్వంసమయి పోఁగలదు. సత్యముయొక్క వాక్యములును, గార్యములును గరవ్యమును సంపూర్ణమగు పర్యంతమును గడచి పోవనేరవు. కాని యసత్యముయొక్క వాక్యములును, గార్యములును వాస్తవమున కవి యాచరింపవలసిన దేమియు లేకపోవుటచే సులభముగా నశించిపోవుచున్నవి. తర్కమును, గ్రోధమును భయంకరములును, హానికరములును, వ్యర్థములును నగు పదార్థములు.

నాయనా! తొలుత నీవు నిన్ను స్వీకృతపారతంత్ర్యముయొక్క బంధనములనుండి విముక్తు నొనరించుకొనుము. ప్రపంచమునందొక పనికిమాలిన ప్రల్లపదార్థము పారవేయఁబడునట్లు కాక ప్రయోజనకరమగు నొకవస్తువువలె దాస్యపాశమునుండి నిన్ను నీవు వేఱుపఱచికొనుము. నీవు సక్రమముగ సంపాదించియుండిన స్వాతంత్ర్యమునుండి జనించు మార్గమును

వివేకయుక్తమగు నాత్మాధికారముచే స్రవించు శాంతిని, నైసర్గికశక్తియందుండు బ్రహ్మానందమును సంపాదించును. ఏకాకిగ నుండి స్వయముగా సంపూర్ణత్వమునకుఁ బ్రాపించి, జన్మించిన గృహమునుండి శ్మశానమువఱకుఁ దనమార్గమును నిర్మించుకొనుచు, లోకాపవాదమును, కృతిమప్రశంసను లెక్క-సేయక, సందేహమయస్థానములందుఁ గేవల మాత్మావలంబనమును గైకొను మనుష్యుఁడే యథార్థముగఁ బూజ్యుఁడు. అట్టి సంపూజ్యుఁ డాత్మవిజయుఁ డగుటచే బ్రహ్మానందమును సులభముగాఁ బడయఁగలుగుచున్నాఁడు.

---

## త్రయోదశ ప్రకరణము.

---

# జీవిత సామాన్య నిబంధనముల గ్రహించుట.

మనుష్యుఁడా! నీవు సత్యసిద్ధాంతములను, దదుత్పత్తిని సూత్రములుగాఁ బరిశోధింతువేని యవి నీహృదయాంతరాళమునుండి వెలువడి వికసించిన వని గ్రహింపఁగలుగుదువు. సత్యస్వరూప మగు సకలమున కుత్పత్తిస్థానము నీయంతరాత్మయే యని దీర్ఘాలోచనము చే గ్రహింపఁగలవు. — బ్రౌనింగు.

రత్నసముదాయముకంటె ధర్మభండార మధికమూల్యవంతమయినది. మధుప్రకంటెఁ పీయూషముకంటె ధర్మము, మధురమయినది. దీని రసాస్వాదనానందము వర్ణనాతీతము; కేవలానుభవైకవేద్యము. — ది లైట్ ఆఫ్ ఏషియా.

పాంథుఁడా! యానందమయమార్గముల ననుసరించుచు నపుడపుడు విశ్రాంతినందుచుఁ, దన్మార్గసౌందర్య మధురరసము నాస్వాదించుచు, నకాలమున జీవితముయొక్క విస్తృత మార్గముయొక్క పవిత్రస్థానమునఁ జేరి తాను వహించియుండిన

భారమును దింపివేయుచున్నాఁడు. అప్పు డతని యనారోగ్యము దూరమయి పోవఁగలదు. వానికిఁ జైకగా స్వాతంత్ర్య మప్పుడు లభింప, వాఁడు చిరశాంతిసౌఖ్యము ననుభవింపఁగలుగు చున్నాఁడు. ఈసమస్తాధ్యాత్మికానందమయమార్గములలో శక్తిని, విశ్రాంతిని కలిగించునట్టి సర్వోత్కృష్టమగు పథము జీవితసామాన్య నిబంధనముల సక్రమముగా గ్రహించుట యయియున్నది. జీవితసాధారణ నిబంధనల గ్రహించు మనుష్యుఁడు సమస్తన్యూనత్వములనుండియు, లాలసలనుండియు, సందేహ భయములనుండియుఁ, దొటుప్రాటునుండియు, దుఃఖమునుండియు సంపూర్ణవిమోచనము నందఁగలుగుచున్నాఁడు. అప్పు డతఁడు సంపూర్ణమగు సంతోషమును, బ్రకాశమును, జ్ఞానమును, హర్షమును, నిశ్చయమును బడయుచున్నాఁడు. జీవితముయొక్క సరళత్వమును గ్రహించి, తదాజ్ఞాపాలన మొనరించునట్టియు, స్వార్థపూర్ణములగు వివిధవాంఛలయొక్క యంధకారమయ మార్గములఁ గా లిడనట్టియు మనుష్యుఁడు నిరుపద్రవకరమును, శత్రుజనాభేద్యమును, సందేహ భయ దుఃఖ వాసనాగమ్యమును నగు పుణ్యస్థానమునఁ జేరఁగలుగుచున్నాఁడు. సత్యము సన్మానింపఁబడు స్థలమందు సందేహము నిర్మూల మగుచున్నది. సత్యసిద్ధాంత ప్రారంభము భయవిషాదసమాప్తమునకుఁ గారణము.

శాశ్వతమును, సంపూర్ణమును నగు సంతోషము నెలకొని యుండదు. కావున దుఃఖదాయకమగు లాలస కాపురము సేయ నేరదు. మానవుని కజరామరమగు దివ్యానందము ప్రాప్తించి నప్పు డతని జీవితమునందు దుఃఖమున కేమాత్రము స్థానము లభింపనేరదు.

మనుష్యజీవితము సత్యము ననుసరించి నిర్వహింపఁ బడుచుండినచో నత్యంతసుందరమును, దివ్యమును, సువ్య వస్థితమును గాఁగలదు. అసూయాది లోభము, ద్వేషము, ఇంద్రి యలోలత్వము మొదలగు వాసనాపాశములచే బద్ధింపఁబడి యున్నంతవఱకు సత్యనిబంధనము ననుసరించి సాధింపఁబడ నేరదు. మస్తిష్కముయొక్క ప్రకాశహీనమగు స్థితియొక్క కారణముచే నుదయమగు జీవితము సత్యజీవితము కానేరదు. అది తాపజ్వరముగాని, దుఃఖదాయక మగు జాడ్యముగాని గావచ్చును. అభిలాషలఁ దగ్గించుకొనుటయే బుద్ధివికాసము నకుఁ బ్రథమలక్షణము. వాసనలపై సంపూర్ణాధికారమును గలిగియుండుట బుద్ధివిశేషముయొక్క చరమధర్మము. కారణ మేమన జీవితము నిబంధనములచే బద్ధమయియున్నది. నిబంధ నలనుండి భిన్నముగాకుండుటచే జీవితమునకు నేటివఱకు లభిం పనట్టి పదార్థముల యావశ్యకతయే మనకు లే దని గ్రహింపఁ దగును. యథార్థ మాలోచించి చూచినచో లాలస స్వాభావిక

మానవజీవితమున కవసరమగు పదార్థము కాదు. కేవల మది యొక విద్రోహయుక్తమగు నిరుపయోగత్వము. కావుననే యది దైన్యమునకును, దుఃఖమునకును జనయిత్రి యగుచున్నది బైబిలునం దొక దుశ్చారిత్రుఁడగు పుత్రునిగూర్చి కథయొకటి వ్రాయఁబడియున్నది. పితృగృహమందు పుత్రున కావశ్యకము లగుసంపదలకంటె నధికముగనే సిరు లుండెను. కాని వాఁడు గృహమును విడిచి వెడలిపోయెను. వానికిని స్వవస్తుబాహుళ్య మున్నపుడు మఱియెట్టిలాలసయు నపేక్షణీయము కాఁజాలదు. కాని వాని హృదయమందు లాలస ప్రవేశించినంతనే కడు దూర మందున్న విదేశమునకు వెడలిపోయెను. అచట కరిగినంత వానికిఁ బ్రతిసామాన్యవస్తువుయొక్క యావసరము తటస్థించెను. వాఁడు గర్భదరిద్రునివలెఁ జేతఁ గాసు వీసమేని లేక దైనికజీవితమును గడపఁజాలనివాఁడయి నిరాహారిగ నుండఁ జాలక తన పితృగృహము నుద్దేశించి పయనము కావలసినవాఁ డయ్యెను. ఈచిన్నికథ ఒక వ్యక్తికినే గాదు, మనుష్యజాతి సంతయు పరివర్తనము సేయుటకొక యనుపమదృష్టాంతము కాఁగలదు. మనుష్యుఁడు వాంఛలయొక్క సందిగ్ధతయందుఁ జిక్కుపడినంతనే యవిరామమగు నశాంతిని, అసంతోషమును, అవసరమును, క్లేశమును బొందుచున్నాఁడు. అపుడు వాని యట్టి దుస్థితి తొలంగుటకుఁ బితృగృహమున కరుగుట య

నఁగా లాలసను విసర్జించి సత్యజీవితనిబంధనములననుసరించుటయే దివ్యౌషధమగుచున్నయది. కాని మనుష్యుఁ డాధ్యాత్మిక దారిద్ర్యముచే తృష్ణాబాధచే బాధింపఁబడి వ్యాకులత ననుభవించు వఱ కీనీతి నాచరింపఁజాలఁడు. తొలుత లాలసయొక్క దుష్పరిణామమగు దుఃఖమును, గలహమును ననుభవించిన పిమ్మటనే శాంతిమయమును, సుసంపన్నమును నగు సత్యజీవితముయొక్క ప్రబలోత్కంఠమానవాంతఃకరణమున వృద్ధి నందుచున్నది. అప్పు డతఁడు ముందడుగిడ నేరనివాఁడయి విముఖుఁడయి నిజ గృహాభిముఖముగఁ బ్రయాసకరమగు ప్రయాణమొనరింప నారంభించుచున్నాఁడు. అనఁగా నతఁడు విషయదాస్యము నుండియు, జ్వరప్రకోపమునుండియు, బుభుక్షనుండియు వేఱుగానుండునట్టి సాధారణసత్యముయొక్క యమూల్యమగు జీవితక్షేత్రమునఁ బ్రవేశింప మొదలిడుచున్నాఁడు. యథార్థ జీవితమును గుఱించియు, సత్యమును గుఱించియు, సమరస భావమునుగుఱించియు మానవునకుఁ గలుగునట్టి యభిలాషను, లాలసను నొకవిధముగ భావింపరాదు. వాస్తవికజీవితమును గోరునది పవిత్రమగు నభిలాష. లాలసవిషయ భోగాదుల వాంఛించు నింద్రియప్రవృత్తి. అభిలాష శాంతినిమిత్తము మానవహృదయమున జనించిన తృష్ణ. ప్రాపంచిక పదార్థముల లాలస మనయందు వృద్ధినందినకొలఁదియు మనల శాంతి

సౌఖ్యమునుండి దూరమొనరించివేయుచు మనల నిత్యదరి
ద్రులఁ జేసివైచి తాను సంయుతము సదా యసమాప్తముగను,
నసంతుష్టముగను నుండుచుండును. లాలససమాప్తమగు వఱ
కు మనుజునకు విశ్రాంతియు, సంతోషమును గలుగుట
యసంభవము. ప్రాపంచికపదార్థములు యెట్టిస్థితియందును
సంతృప్తము కానేరదు. కాని శాంతి బుభుక్షసంతృప్తిని
వహింపఁగలుగుచున్నది. సమస్తవిధములగు స్వార్థమయలాల
సలు మనల విడిచినంతనే శాంతియొక్క సంపూర్ణమగు సంతో
షము సులభముగా లభ్యమగుచున్నది. అపుడు సంపూర్ణమగు
హర్షమును, సమృద్ధియు, నమూల్యమగు నానందమును
నైక్యమానములయి యుండుచున్నవి. అత్యంతానందదాయక
మగు నీస్థితియందు జీవితముయొక్క సమగ్రశ్రేష్ఠత్వమును,
సరళత్వమును మానవుఁడు గ్రహించి తన్మూలమున నపార
మగుశక్తిని బ్రయోజనమును సంపాదింపఁ జేసికొనుచు
న్నాఁడు. అంతమునకు వానిశాంతి, బుభుక్షయు నుపశమించు
చున్నది. కారణమేమన సంపూర్ణమగు శాంతి సుస్థిరమును,
శాశ్వతమును నగు దేహముయొక్కయు, మానసము
యొక్కయు నొక సాధారణదశగ మారిపోవుచున్నది. వాసనా
ప్రవాహమున మునింగియున్న మనుష్యుఁడు లాలసాదమన
మౌదాసీన్యమును, నలసత్వమును, శక్తిహీనతను, నిర్జీవత్వ

మును స్మరించునని యజ్ఞానాంధకారముచే భ్రమయుచుఁ గడంగుచున్నాఁడు. వాసనానిగ్రహముచే నేకాగ్రత, కార్యపరాయణత, శక్తి, ప్రయోజనము మొదలగు సద్గుణములచే భూషితమయిన దివ్యానందమయ జీవితము ప్రాప్తింపుచున్నదను రహస్యమును భోగవిలాసముల నిమిత్తమును, భౌతికపదార్థ సంచయార్థమును లాలసులయియుండి తల్లాలసాతృష్ణాబాధచేఁ జచ్చుచుండు మనుష్యులు గ్రహింపఁజాలరు.

స్వార్థయుక్తమగు లాలసనుండి విమోచనము నందిన నంతనే మానవుని మస్తిష్కము భారశూన్యమగుచున్నది. అతఁడంత మానవజాతినిమిత్తము కార్యమొనరింప స్వతంత్రుఁడగుచున్నాఁడు. స్వాతంత్ర్యము నందినంతనే వానిసమస్తశక్తులేసిద్ధియందును సంతృప్తిని వహింపనొల్లనట్టి భోగవాంఛల ప్రాప్తినిమిత్తమును పరుగెత్తనేరవు. శక్తులన్నియు నపుడు మానవుని సంపూర్ణాధికారమునం దుండి వాని యాజ్ఞాపాలనము నకయి నిరీక్షింపుచుండఁగలవు. పారితోషికమును సంపాదింపవలయునను వాంఛను గలిగియుండకుండుటచే నతఁడు తన సమస్తశక్తుల స్వకీయకర్తవ్యపాలనమం దేకీభూతమొనరించి సమస్త విషయములయందును, గార్యములందును యథోచితరీతి సఫలతను సిద్ధింపఁజేసికొనుచున్నాఁడు.

సంపూర్ణజ్ఞానియు, సంపూర్ణానందమయుఁడును నగు మనుష్యుఁడు లాలనచేఁ గార్యమొనరింప సన్నద్ధుఁడు కాఁడు.

అతఁడు సదా జ్ఞానసముపార్జననిమిత్తమే కార్యాచరణము నకుఁ గడంగుచుండును. లాలసను గలిగియుండు మనుష్యుఁడు స్వప్రయోజనమును, స్వలాభమును జూచుకొనియే కార్యమును బ్రారంభించుచున్నాఁడు. మాతాపితలనుండి క్రీడావస్తువును, జిఱుతిండిని బడయునిమిత్తమే బాలుఁడు బడికిఁబోవుచున్నాఁడు. అదియేరీతి లాలసాయుక్తుఁడగు మనుష్యుఁడును లాభము నపేక్షించియే కార్యమొనరించుచున్నాఁడు. కాని సజీవుఁడును, సాత్వికుఁడునునగు జ్ఞాని తనశక్తులను వలసినపుడెల్ల, నట్టి యావశ్యక కార్యసంపాదననిమిత్తమయిన నేకీభూతమొనరించి యథోచితముగ నుపయోగింపఁ గలుగుచున్నాఁడు. అతఁ డాధ్యాత్మికదృష్టిచే సంపూర్ణవృద్ధుఁడుగ గణింపఁబడుచున్నాఁడు. వానియెడ సమస్తవిధములగు పారితోషికములును, లంచములును, బహుమానములును వ్యర్థములు. అతఁడు ప్రకృతియందు సంభవించు సమస్తపరివర్తనములను, సుఖదుఃఖములను సానందముగ ననుభవింప సంసిద్ధుఁడయి యుండుచుండును. అతని హృదయాంతరాళమున బ్రహ్మానందమును, ముఖారవిందమున మృదులహాసమును తాండవింపుచుండును. ఇట్టి మనుష్యుఁ డాదర్శజీవితమును బడయుచున్నాఁడు. ఏని యానందము మృదులమును, మధురమును, సుస్థిరమును, యథార్థమును నయి యుండి, విశ

ప్రకృతియొక్క యచల సిద్ధాంతము ననుసరించి యుండు చున్నది. కాని యపూర్వానందము యొక్క యిట్టి జీవిత మొకవిధమగు స్వర్గీయస్థాన మైయున్నది. ఈ స్వర్గీయ స్థానమునుగూర్చి ప్రయాణమొనరింప నెంచు యాత్రికుఁడు మిక్కిలి ప్రయాసము ననుభవింప వలసియున్నది. ప్రయాణికుఁడు పాశవికలాలసలయొక్క దేశమం దుండి పయనమొనరింపుచుండియు నాలాలసలయొక్క మాయావాగురములఁ జిక్కక వానినన్నింటి సాధింపుచు, వానిపై నిరంకుశాధికారమును స్థాపింపుచు స్వర్గీయస్థానమును జేరవలసియున్నది. వాని కీ మార్గమందు బయటనుండి వచ్చు శాత్రవుఁ డెవఁడును దటస్థింపనేరఁడు. అతని నీయాత్రయందు శత్రువులెల్ల రతని హృదయమునుండియే జనింపుచున్నారు. ఆరంభమం దీ యాత్ర ప్రతిమానవునకు మిక్కిలిప్రయాసకరముగ గోచరింపఁగలదు. వాఁడు లాలసప్రభావముచే నంధుఁడయి జీవితముయొక్క సాధారణ నిర్మాణమునయిన గుర్తింపఁజాలనివాఁ డగుచున్నాఁడు. అప్పు డతని కీజీవిత నిబంధనలన్నియు గుప్తముగా నుండి గోచరింపకుండును, కాని వానిమానసము సరళమయి, స్వచ్ఛమయి ప్రకాశించినంతనే జీవితముయొక్క భద్రనియమావళి వాని యాధ్యాత్మికదృష్టికిఁ గానరాఁగలదు. అప్పు డతని కా నిబంధనల గ్రహించుటయందును, వాని యాజ్ఞానుసారము వర్తించు

టయుండును ఏవిధమగు కష్టము కలుగనేరదు. వానిమార్గమవుడు పరిశుద్ధమయి, సక్రమమయి, సులభగమ్యమగుచున్నది. అపుడు వానిని సందిగ్ధతయు, నంధకారమును బాధింపఁజాలకుండును. జ్ఞానప్రకాశముచే సమస్త మతనికి నున్న దున్నట్లుగఁ గానరాఁగలదు.

సత్యాయుతమును, బ్రహ్మానందమయమును నగు జీవితము నన్వేషించు మనుష్యుని గతిని మఱింత తేజస్సంపన్న మొనరించుటయందుఁ దోడ్పడు జీవితముయొక్క నిబంధనములలోఁ గొన్ని నిబంధనములనుగూర్చి దిగువ విచారింపఁబడును. ఈనియమములు ప్రయోగమందు కేవలము గణితశాస్త్ర నిబంధనములవలె నబాధితములయి యున్నవి. "ప్రథమ నియమము నుల్లంఘించువారిని క్షమించుటొప్పదు."

మానవజీవితములన్నియు దర్శనమందు వివిధములుగ నున్నను సమస్తము మూల పదార్థమునం దొక్కటియే. నియమమొకటే, కాని యది బహువిధముల నుపయోగపడుచుండఁ గలదు. వస్తువునకును, మానసమునకును, భిన్నమగు నియమమున్నట్లు కానరాదు. దృష్టములగు స్థూలపదార్థములకును, నదృష్టములగు సూక్ష్మ పదార్థములకును వేఱు వేఱుగ నియమములు సృజింపఁబడి యుండలేదు. సూక్ష్మనియమము సర్వత్ర నొకేవిధముగ నుండుచున్నది. దేహమునకుఁ బ్ర

త్యేకముగను, అంతరాత్మకుఁ బ్రత్యేకముగను ధర్మశాస్త్రము విరచితమయియుండ లేదు. దేహాత్మల రెంటికిని ధర్మశాస్త్రమొకటియే. మనుష్యుఁడు విశుద్ధప్రాపంచికబుద్ధిచేఁ బ్రపంచకార్యములందుఁగొన్ని నిబంధనములు వెలయుచుండుటను విలోకింపుచున్నాఁడు. అతఁ డీ నియమములను దాను విస్మరించినను, నుల్లంఘించినను దనసామర్థ్యము వెల్లడియగుననియుఁ, దనకుహాని సంభవించుననియు, సంఘమందును, సామ్రాజ్యమందును ఘోరోపద్రవము లుత్పత్తిలఁగల వని గ్రహింపుచున్నాఁడు. ప్రపంచమం దధికసంఖ్యాకు లీనియమములే యాధ్యాత్మికములును, సూక్ష్మములు నగు వస్తువులయందును సార్థకములగుచున్నవని గ్రహింపజాలకున్నారు. వారు తమయజ్ఞానమునలనను, నసావధానతచేతను భయంకరమగు నష్టమునకు గురియగుచున్నారు.

మనుష్యుఁడు తన్ను దానే పోషించుకొనుటకును, నిజహస్తములచేఁ గృషిసలిపి సంపాదించుకొనుటకును, నకారణముగఁ గృషి సేయని దినమున నిరాహారిగ నుండుటకును బద్ధుఁడయియుండవలసిన దని ప్రపంచముయొక్క యచల సిద్ధాంతము బోధింపుచున్నది. శరీరకష్ట మొనరింపని వ్యక్తికి భోజనమును స్వీకరింప నధికారము లేదు. మనుష్యుఁ డీనియమమును గాంచి న్యాయసంయుక్తముగ భావించుటవలననే ప్రపంచముయొక్క

యావశ్యకము లగు వస్తువుల సంపాదింపఁ గలుగుచున్నాఁడు. కాని జనసామాన్య మాధ్యాత్మికవస్తువులవిషయమం దీ నిబంధనము నుపయోగించుచుండుట లేదు. ఎవనియాహారమును వాఁడే కాయకష్టముచే సముపార్జించుకొనవలయు ననియు, నట్లొనర్చుకొనని మూఢుఁడు ఘోరపాపియయి, నిత్యదరిద్రుఁడయి భైక్షుకవృత్తిచే ద్వారద్వారముల వ్యాకుల హృదయముతోఁ దిరుగుచుండుననియు నను సూత్రముల నెల్ల రంగీకరింతురు. కాని యారీతి నాచరించు మనుజుల సంఖ్య మిక్కిలి స్వల్పముగా నున్నది. మనుష్యుఁ డాధ్యాత్మిక జీవితప్రధానుఁడయి లోకహితమునకయి తన యావచ్ఛక్తిని ధారవోయుచున్నచో నట్టివాఁడు శ్రమయొనరింప నక్కఱ లేకుండగఁ బరులొసంగు భోజనమును గుడువ నధికారమును గలిగియున్నాఁ డను విషయము నెల్ల రంగీకరించుచున్నారు. అసంఖ్యాకులగు మనుష్యు లాధ్యాత్మికశక్తిని సంపాదించుచున్నామని నుడువుచు, భిక్షుకులయి, ద్వారద్వారములఁ దిరుగుచు నాంతరికశక్తిని హర్షమును, జ్ఞానమును, శాంతిని బడయలేక భయవిచారముల ననుభవింపవలసినవా రగుచున్నారు. ఇట్టివారికంటెఁ గాయకష్ట మొనరించి జీవించువారే శ్రేష్ఠమానవులు.

మనుష్యుఁ డెవఁడేని యేవేని వస్తువుల యావశ్యకత కలిగినపుడు వెంట వణిజుని విక్రయశాలకరిగి కాంక్షితపదార్థము నూరకే యడుగక మూల్యమునొసంగి తీసికొనినపుడే యావస్తువు వానిదగుచున్నది. వాఁడు యథార్థమగు మూల్యమునొసంగి మూల్యమునకుఁదగిన పదార్థమును దీసికొనినచో దానుచితకార్య మొనరించితినని సంతోషింపఁగలఁడు. అదియేరీతి మనుష్యుఁ డానందము, విశ్వాసము, శాంతి మొదలగు నేదేని యాధ్యాత్మికపదార్థముల నభిలషించినచో దానికి మూల్యముగఁ గొంత వెల నొసంగవలసియుండును. స్థూలపదార్థ మొకదానిని వణిక్కునుండి పడయవలసి వచ్చినపుడు దానికిఁదగిన ద్రవ్యమొసంగఁబడవలసియుండుచున్నది. అదియేరీతి నాధ్యాత్మిక వస్తుప్రాప్తికేదేని సూక్ష్మమగు వస్తువు వెలకుమూల్యముగా నొసంగఁబడ వలసియుండును. ఉద్వేగము, లోభము, అభిమానము, భోగము మున్నగు అతీంద్రియపదార్థములలో నేవస్తువును వెలగానిచ్చినను దానికిఁ దగినంత పరిమాణమందే యాధ్యాత్మికఫలము లభింపఁగలదు. కృపణుఁడు తనద్రవ్యము నంటిపట్టుకొని యుండుచుండును. సదా ధనమును తనయొద్ద నునిచికొని వీక్షించుకొనుచుండుటచే మిక్కిలి యానందము కలుగుచుండుటవలననే యతఁడు దద్దానిలోనుండి పీసమేని పరులకొసంగ సమ్మతింపకుండును. అతఁడు తనధన

మండలియొక్క కానయిన వెచ్చించి తనజీవితసౌఖ్యమున కావశ్యకములగు పదార్థములఁ గ్రయమునకుఁ దీసికొనఁ జాలడు. ధనమును బుష్కలముగాఁ గలిగియుండియు వాఁ డానందములేక సదా దుఃఖమయజీవితమును గడుపుచుండును. అదియేరీతిఁ గ్రోధమును, గాఠిన్యమును, విలాసమును, గర్వమును, దురహంకారమును, స్వపక్షపాతమును బ్రహ్మానందమునిమిత్తము విసర్జింపలేని మనుష్యుఁడు ఆధ్యాత్మిక లుబ్ధుఁడనఁబడుచున్నాఁడు. ఇట్టిభయంకరరోగములచే ముట్టడింపబడియున్నట్టి యాధ్యాత్మికలోభపరాయణునియొద్ద నేవిధమగు నాధ్యాత్మికసౌఖ్యమును జేరదు. ప్రాపంచికానందసంపదలయందలి చిల్లిగవ్వయైన వెచ్చింపక వానినంటిపట్టుకొనియుండు వ్యక్తియొక్క యాధ్యాత్మి కావసరముల దీఱ నేరవు.

ప్రాపంచిక విషయములందు (లోకధర్మములందు) నిపుణుఁడయి యుండువ్యక్తి పరులను యాచించుటకును, చౌర్యమొనరించుటకును సమ్మతింపనొల్లడు. అతఁడు శ్రమయొనర్చి తనకవసరములగు వస్తువులనెల్ల వెలకుఁ దీసికొనుచుండును. ప్రపంచము వాని భద్రత్వమునకును, బ్రకృతినియమపాలనమునకును వాని నభినందింపఁగలదు. అదియేరీతి నాధ్యాత్మికధర్మములందును జతురుఁడయియుండు మనుష్యుఁడు

దీనునివలెను, హీనునిరీతిగను బరుల నర్థించుటకును, దొంగిలించుటకును సమ్మతింపనొల్లడు. అతఁ డంతర్జగత్తునందు గష్టమొనరించి తన కవసరములగు నాధ్యాత్మిక వస్తువులనెల్ల వెలకుఁ దీసికొనుచుండును. సకలప్రపంచ మతని సాధుత్వమునకును, ధర్మాచరణమునకును మిక్కిలి సంతోషించి వాని నెల్లరీతుల సన్మానింపగలదు.

పరులకు సేవ యొనరించు మనుష్యుఁడు నియమితవేతనములను వారినుండి పడయుచుండుట ప్రపంచవ్యవహారమం దొక నియమమయి యున్నది. మాసాంతమున భృత్యుఁడు తన యజమానినుండి సంపూర్ణవేతనమును బొందియుండియుఁ దననియమమునకు భిన్నముగా మఱికొంత ద్రవ్యము నడిగినచోఁ దన యుద్యోగపదవినుండి తొలగింపఁబడఁగలఁడు. ఆరీతిగనే మానవు లనేకు లాధ్యాత్మిక ప్రపంచమున స్వల్పమగు కష్టమునరించుచు నత్యధికమగు ఫలితము నపేక్షించుచుండియుఁ దమ్ము స్వార్థులుగను, మూఢులుగను భావించుకొన కున్నారు. ప్రపంచముయొక్క నిబంధనము ననుసరించి మానవుఁడొనరించు కృషికిఁ దక్కువగాని, హెచ్చుగఁగాని ఫలితము లభింపనేరదు. స్థూలప్రపంచమునను, సూక్ష్మప్రపంచమునను, మనుష్యుని భావములయొక్కయుఁ, గార్యములయొక్కయు పరిమాణము ననుసరించియే ఫలితము లుండుచుండును.

ఈనియమమును జిరస్మరణీయముగ నెఱింగి జ్ఞానసంపన్నుండగు పురుషుఁడు సదా సంతుష్టుఁడయి, సంతృప్తుఁడయి సంపూర్ణ శాంతిపూర్వకముగ జీవితమును గడపుచుండఁగలఁడు. కారణ మేమన నతఁడు తాను పడయుచున్న సంపద్వైభవములన్నియు స్వయంకృత కార్యములయొక్క యథోచితపరిణామములే యని గ్రహించియుండుచున్నాఁడు. మహాతరమగు నీప్రపంచ సంబంధనము ప్రపంచమందలి స్వార్థాంధులును, లోభులు నగు యజమానులు తమ భృత్యుల కొసంగవలసిన వేతనమును గబళించు విధమున మనుష్యుఁ డొనరించియున్న కార్యమునకుఁ దగు ఫలితమును నొసంగుటలో లేశమాత్రముగ మోసమును గావింపనేరదు. ఈ మహాసంబంధనమును దృణీకరించునట్టియుఁ, బరిహాసించునట్టియు మూఢున కది యీచందమునఁ జెప్పుచున్నది. "చెలికాఁడా! నీ కేల మతిభ్రంశము కలిగినది? నీవు నే నేర్పరచియున్న కర్మక్షేత్రమునఁ బనిసేయఁ బ్రవేశించుటకుఁ దొలుతనే మన ముభయులము దినమున కొక్క కాసుజీతమే యొసంగఁబడఁగలదని నిశ్చయించుకొనియుంటిమికదా; పేరాసకు లోఁబడి నీ విపుడేల దినమున కొక్క రూపాయి నపేక్షించుచున్నాఁడవు?"

ఎవఁడేని యొక మనుష్యుఁడు ధనాఢ్యుఁడయినచోఁ దన సంపదల నిరవ్యయములొనరించుచు సంరక్షించుకొని,

సత్యధర్మముల ననుసరించి, యాసంపదల వృద్ధి గావించి, తుదకే దాని లోకకల్యాణకరమగు పవిత్ర కార్యమునకయి సద్వినియోగ మొనరించుట శ్రేయస్కరము. ధనము పట్ల కేవలము నిర్లిప్తతనుగాని, కేవలాసక్తినిగాని కలిగియుండరాదు. ఇట్టి వ్యక్తియే విశ్వమందు నిపుణుఁడును, ధనాఢ్యుఁడును నను ఖ్యాతినందఁగలుగుచున్నాఁడు. విద్యావిహీనుఁడుగా, సోమరియు దుర్వ్యయశీలుఁడును నగు మనుష్యుఁడు ధనాఢ్యుఁడు కాలేఁడు. అట్టివాఁడు లోకహీనుఁడును, దుర్వ్యసనలోలుఁడును నను నపఖ్యాతికిఁ బాల్పడుచున్నాఁడు. అదియేరీతి నంతర్జగత్తునం దాధ్యాత్మిక వస్తువులచే ధనాఢ్యుఁడు కాఁగోరు మనుష్యుఁడు తన మానసికశక్తుల వ్యర్థముగా వ్యయమొనరింపక మితవ్యయముచే సంచయమొనరించుకొనుచుండు టావశ్యకము. అతఁడు తన జిహ్వాదీంద్రియమును, వివిధోద్వేగములను నిరోధించివైచి, తన శక్తిని వ్యర్థము మిథ్యావాదమునకును, దురహంకారపూర్ణమగు కుతర్కమునకును, క్రోధాద్యావేగములకును నష్టమొనరింపకుండ నుండవలయును. ఈరీతిగ నతఁడు బుద్ధికోశమును వృద్ధిగావించుకొనినంతనే వానియొద్ద నపారమగు నాధ్యాత్మిక మూలధనము చేరఁగలదు. అతఁ డీయాధ్యాత్మిక మూలధనమును బరోపకారార్థము వినియోగించుచుండవలయును. ఈ

మూలధనము నతఁడు యథార్థమగు లోకహితమున కయి వినియోగించిన కొలఁదియు వృద్ధిచెందఁగలదు. ఈచందమున మనుష్యుఁడు స్వర్గీయ నైపుణ్యమును, స్వర్గీయసంపదలను బెంపొందింపఁ జేసికొనఁగలుగుచున్నాఁడు. తనయింద్రియోద్రేకములకును, లాలసలకును ననుచరుఁడయి యుండునట్టియుఁ, దన మానసమును వశము నొనరించుకొన నట్టియు మనుష్యు డాధ్యాత్మిక దుర్వ్యయశీలుఁడనఁ బరగుచున్నాడు. వాఁడెపుడును స్వర్గీయ పవిత్రవస్తువులచే ధనికుఁడు కానేరఁడు.

మనము పర్వతముయొక్క శిఖరము మీఁదికిఁ జేరఁ దలంచినచో నాగిరి నారోహింప వలసియుండును. తొలుత మార్గము నన్వేషింపవలసి యుండుచున్నది. అనంతరము సావధానులమయి యామార్గము ననుసరింపవలసిన వారలమగుచున్నారము. ఆరోహించు వ్యక్తి ప్రయాసముయొక్కయు గష్టములయొక్కయు భయముచేఁగాని, శరీరక్లాంతిచేఁగాని పర్వతారోహణ విముఖుఁడు కారాదు. లేనిచోఁ బర్వతారోహణ కార్యము సిద్ధింపనేరదు. సరిగా నిదియేరీతి మానసికమును ధార్మికమునునగు జీవితముయొక్క సమున్నతభూధర శిఖరముపైకరుగ నభిలషించువ్యక్తి, ఆత్మబలముచే గిరినారోహింపవలసి యుండును. అతఁడు మార్గమును గ్రహించి జాగ్రత్తగ నారోహణకార్యమును సఫలీభూతమొనరించుకొన

వలయును. అతఁడు భయముచేఁగాని, వ్యాధులచేఁగాని పర్వ
తారోహణ కార్యమునుండి విముఖుఁడు గాక కష్టములను
విఘ్నములను ననుభవించుచు, జయించుచు లోభాదిశత్రువు
లకు జిక్కకుండ ముందడుగిడుచుఁ బోవుచుండవలయును.
ఇట్లొనరించుటచే నంతమున నతఁ డాధ్యాత్మిక సంపూర్ణత్వము
యొక్క ప్రధానశిఖరమును జేరఁగలుగుచున్నాఁడు. అప్పు
డుద్వేగము, లోభము, దుఃఖము మొదలగు వికారములతోఁ
గూడియున్న ప్రపంచమును దనకుఁ గ్రింద వదలివైచుచున్నాఁ
డు. అప్పు డతనిశిరోభాగమున స్వర్గీయపవిత్రతయొక్క విస్తృత
మును, మానయుతమును నగు ననంత నభోమండల ముండి
పోవుచున్నది.

ఒకమనుష్యుఁడు దూరమందున్న నగరమును జేరఁ
దలంచినచోఁ బ్రయాణమొనరింప వలసియుండును. ప్రయాణ
మొనరింపకయే వాఁడచ్చటికిఁ జేరు నుపాయమేదియు లేదు.
అతఁడా యాత్రావశ్యకములగు సాధనములను, ప్రయత్న
ములను గావింపవలసియుండును. అతఁడు కాలినడక నచటఁ
దలంచినచో నేవిధమగు వ్యయము కానేరదు. కాని దేహ
ప్రయాసమధికముగా గలుగుట సంభవించును. అతఁ డశ్వ
శకటమందుఁగాని, విద్యుచ్ఛకటమందుఁగాని బోవఁదలంచి
నచో శరీరప్రయాస తప్పిపోవును. గాని ద్రవ్య మధికముగా

వ్యయము కావలసివచ్చును. మనుష్యుఁ డీస్థానమున కరుగఁ దలంచినను శ్రమమొనరింపవలసియే యుండుచున్నయది. ఇది యొక నియమము. ఈనియమ మాధ్యాత్మిక జగత్తునపట్లను సార్థకమగుచున్నది. దయ, శౌచము, వివేకము, శాంతము మొదలగు నేదేని యాధ్యాత్మిక స్థానమును జేరఁగోరు మనుష్యుఁ డత్యంతమగు శ్రమను సహించి, ప్రయాణమొనరింప బాధ్యుఁడగుచున్నాఁడు. ఎట్టిశ్రమయు లేకుండఁగనే తలఁపు మరియందుఁ గలిగినంతనే మనుష్యుఁడు తత్క్షణ మనాయాసముగాఁ బరమసుందరములగు నాధ్యాత్మిక నగరములఁ జేరఁ జాలఁడు. అతఁడు సర్వోత్కృష్టమగు ఋజుమార్గము నన్వేషించి తదనుసారముగఁ బ్రయాణమొనరింప వలసియుండును. అపుడతఁ డభిలషించిన స్థానమును జేరఁగలఁడు. ఆనందమయమును, నాధ్యాత్మికమును నగు జీవితముయొక్క సంపూర్ణ మనుష్యత్వమును బరిపక్వస్థితిని బొందుటకుఁ బూర్వమే మనుష్యుఁ డీశ్వరీయ మహానియమముయొక్క యంగప్రత్యంగములగు నీ సామాన్యనియమముల నన్నింటిఁ బరిగ్రహించుటావశ్యకము. ఆధ్యాత్మిక ప్రపంచమునందుఁ బ్రయోగింపఁబడనట్టి నియమమేదియు బాహ్య జగత్తునందుఁ గానరాదు బాహ్యపదార్థము నాధ్యాత్మిక సత్యములయొక్క ప్రతిబింబములును, నుదాహరణములును నయియున్న విధం

బుననే ప్రాపంచికబుద్ధియు నాధ్యాత్మికమును, దైవికమును నగు బుద్ధియొక్క ప్రతిబింబమయి యున్నది. మనుష్య జీవితముయొక్క ప్రాపంచకవస్తుసముదాయము నంతయుఁ బ్రయోజనదాయకము లయి, జనసామాన్యముచే సందేహింపఁబడక యే స్వీకరింపఁబడుచుండు సరళవాక్యములును, సామాన్యములను నగు నిబంధనములు, యథార్థముగా నంతర్జగత్తుయొక్క యాధ్యాత్మిక వస్తువులయెడను శోభించుచున్నవను రహస్యమును గ్రహించినంతనే స్థూలప్రపంచము ననుసరించి సూక్ష్మప్రపంచమందును మనుష్యుఁడు జీవిబంధనములఁ బాలింపఁగడంగి యథార్థమగు జ్ఞానమును బుష్కలముగా సంపాదింప సమర్థుఁడగుచున్నాఁడు. అంతె నతని విషాదభయ సందేహములన్నియు దూరమయి పోవుచున్నవి.

జీవితమొక ప్రత్యక్షమగు న్యాయము. ఇందెట్టి తప్పిదములకును, నొప్పించుటకును స్థానముండనేరదు. ఇద్దాని ప్రయోగము యథార్థమును, నశేయలర్క రూపమును నయి యున్నది. నిబంధనము సదా రాజ్యమొనరించుచుండును. నియమములయొక్క హృదయాంతర్భాగమునఁ బ్రేమ వెలయుచున్నది. పక్షపాతమును, మనోవికారమును— నియమమునకును, బ్రేమకును విరుద్ధములయియున్నవి. ప్రపంచ మెవ్వాని పక్ష మవలంబింపనేరదు. అది న్యాయపరతంత్రము. ఎవఁ

ఎట్టికార్య మాచరించుచుండునో, వానికట్టిఫలితము నొసంగుచుండును. ప్రపంచమునకు సంబంధించిన దంతయు మంచిదియే. కారణమేమన సకలము నియమబద్ధము. విశ్వమందలి ప్రతివస్తువును నియమబద్ధమయి యుండుటచే మనుష్యుడు జీవితమం దుచితమార్గము నన్వేషింపఁగలిగి హర్షాంబుధి నోలలాడుచున్నాఁడు. “భద్రమానవునకు జీవితకాలమందును, మృతుఁడైనకుఁ బిదపను నేవిధమగు నాపత్తియుఁ గలుగనేరదు. జీసను ప్రభువు సిలువవేయఁబడినపుడు తనకు సంభవించిన ఘోరవిపత్తును సయితము సౌఖ్యదాయకమగు స్థితియనియే వచించి ఆమహానుభావుఁడు తన్ను సంహరింపుచున్న క్రూరుల నేమాత్రము నిందించియుండలేదు. ఆప్రభువు ప్రాణమును విసర్జింపుచు నీరీతిఁ బలికియుండెను. “నాప్రాణముల నేమానవుఁడు నపహరింపఁజాలఁడు. నే స్వయముగా లోకహితమునకయి నాయసువులఁ బాయుచున్నాఁడను.”

తనజీవితమును సఫలమొనరించుకొని మానసమును విశుద్ధముగఁ జేసికొని, ఆ ఐక్యముయొక్క మనోహరమగు సరళత్వమును గ్రహింపనేర్చిన మనుష్యుఁడు, సకలపదార్థములయొక్క నియమబద్ధమగుగతిని గుర్తింపుచున్నాఁడు. అతఁడు తనభావముల వలనను, కార్యములవలనను దనకును, బ్రపంచమునకును లభించుఫలమును, నానుత్పన్నము చేయు

చుచున్నట్టి మానసిక కారణములయొక్క పరిణామములను గ్రహింపసమర్థుఁ డగుచున్నాఁడు. అతఁ డంతటినుండి పుట్టుచుఁ బెరుగుచుఁ, బూరియగుచు నిపుడపుడను భేదములేక సదా బ్రహ్మానందము నొసంగునట్టి సద్భావములను, సత్కార్యములను బరిగ్రహింపుచుండఁగలఁడు. ప్రప్రథమ మజ్ఞానముచే దా నొనరించియుండిన కార్యముల దుష్పరిణామముల నతఁ డతివిధేయుఁడయి ననుభవింపుచు దానికయి నిందింపక, భీతిల్లక, ప్రశ్నింపక విశ్వముయొక్క మహత్తరమగు జ్ఞానమును బడయుచు నావిశ్వనియమపాలనమం దపారానందము నందుచుండఁగలఁడు.

“మనమభిలషిత వర్ణవిలసిత సూత్రములచే మనజీవితమను వస్త్రమును నిర్మించుకొన సమర్థులమయి యున్నారము. కర్మపరిణామమగు భాగ్యభూమియందు మనము విత్తినపంటనే పడయుచున్నారము. మనము విత్తినరీతిగనే సస్యమునందుచు నాచరించిన రీతిగనే ఫలమును బడయుచున్నచో దుఃఖము నత్యంతానురాగ పూర్వకముగ స్వీకరింపవలసి యుండును. నష్టమును బడయుట లాభమునకే యని తెలియఁదగును.”

# చతుర్దశ ప్రకరణము.

---

## సౌఖ్యమయ పర్యవసానము.

ధర్మముచే సత్యము లభించుచున్నది. ధర్మము నతిక్రమింపఁగల శక్తి ఎవ్వానికిఁగలదు? ధర్మము యొక్క హృదయము ప్రేమ. ప్రేమ యొక్క పర్యవసానము శాంతి. శాంతి యొక్క పరిణామము మధురమగు సంపూర్ణత్వము. కుమారా! సకలార్థసాధనమగు నిట్టిధర్మము ననుష్ఠింపుము.

—ది లైట్ ఆఫ్ ఏషియా.

సౌభాగ్యముచే నీకార్యము సమాప్తమగుచో దోషములును సుగుణములయి తనరారఁగలవు. అపుడు నీవ్రతము లన్నియు నీశ్వరీయ ప్రకాశముయొక్క వ్రతమందు మెఱగింపఁగలవు.

—వ్హాయిటరు.

మానవజీవితము సమున్నతమును, పవిత్రమును, సుందరమును నగుటచే దీని కనేకవిధములగు సౌఖ్యమయపర్యవ

సానములు కలుగుచున్నవి. జగతీతలమం దపవిత్రతయు, నజ్ఞానమును, నశ్రుపాతమును, దుఃఖశోకములును దక్కువగా లేకపోయినను వానితోఁబాటు పవిత్రతయు, జ్ఞానమును, మృదులహాసమును, విశ్రాంతియు నానందమును బుంఖాను పుంఖములయి సర్వత్ర గోచరించుచున్నవి. పవిత్రమగు నే భావమును, స్వార్థశూన్యమగు కార్యమును సుఖమయమగు పరిణామమును గలిగింపకుండ నుండ నేరదు.

సౌఖ్యమయమును, మనోహరమును నగు గృహమును బడయుటయు నొక విధమగు సౌఖ్యపూర్ణ పర్యవసానమే. సౌఖ్యమగు జీవితమొక విశుద్ధానందమయ పరిణామము. ఒక కార్యము సక్రమముగా సిద్ధించుటయు నొక సౌఖ్యపూర్ణమగు పర్యవసానమె. కృపాళురగు మిత్రులచే ముట్టడింపఁబడియుండుటయు నొక సౌఖ్యమయమగు పరిణామమె. పరస్పర విరోధములను శాంతింపఁ జేయుటయుఁ, గలహముల నిర్మూలించుటయు, నుడువఁబడిన దుర్భాషలను స్వీక ంచుటయు, క్షమార్పణమును గోరుకొనుటయు, మిత్రుల పరస్పరగాఢాలింగనమును మొదలగున వన్నియు సౌఖ్యమయ పర్యవసానములె. చిరకాలమునుండి విశేషమగు ప్రయాసముచే నన్వేషించుచున్న వస్తువును బడయుటయు, నశ్రుపాతమునుండి హర్షమును సంపాదించుటయుఁ, శాపముయొక్క

దుఃఖదాయకములగు భయంకర స్వప్నములచే మేల్కొంచి పరమోజ్జ్వలమగు సూర్యప్రకాశములోని కేతెంచుటయు, దీర్ఘాన్వేషణమునకుఁ బిదప జీవితమందు స్వర్గీయమార్గమును బడయుటయు మొదలగునవన్నియు నానందమయములగు సత్పరిణామములై. ఈగ్రంథమునందు వచింపఁబడిన సత్యముల దీర్ఘాలోచనముచేఁ బరిగ్రహించి, యనుసరించి, ఆత్మవిజయమును సంపాదించిన ప్రతివ్యక్తియు నమందానందకందము నందగలఁడు. వానిసమగ్ర జీవితము సౌఖ్యమయ పర్యవసానములచేఁ బరిపూర్ణము కాఁగలదు. సత్యము ను బ్రారంభించునట్టియు, సత్యము ననుసరించునట్టియు మనుష్యుఁడు క్షణిక నానందదాయకములగు ఫలముల నభిలషించి, వానికయి యన్వేషణ ప్రయాసము నందవలసిన పనిలేదు. ఆనందము లట్టి వ్యక్తి సమ్ముఖమున స్వయముగ సాక్షాత్కరింపఁగలవు. అవి పరిణామ రూపమున లభింపుచున్నవి. నిశ్చయముగా నాయానందమయ పర్యవసానములే మనుష్యజీవితముయొక్క పరమసత్యములును, సారభూతములగు పదార్థములును నయియున్నవి.

బాహ్య ప్రపంచముతో ననఁగా స్థూలశరీరముతో సంబంధమును గలిగియుండు సౌఖ్యమయ పర్యవసానములు నయితే మనేకములు కలవు. అవి క్షణికములగుటచే నతిశీఘ్రముగఁ గడచిపోవుచుండును. అనేకములగు సౌఖ్యమయ పర్యవసాన

ములు. సూక్ష్మశరీరముతో ననఁగా నంతర్జగత్తుతో సంబంధమును గలిగియున్నవి. అవి యజరామరములగుటచే నెప్పటికిని గడచిపోకుండును. మైత్రిసమావేశము, భోగవిలాసము, స్థూలపదార్థములు మొదలగువానిప్రీతి రుచిదాయకమును, మధురమును నయియుండుచుండును. కాని యాదిపరివర్తనశీలమును, నశ్వరమును నయి యున్నది. శౌచము, బుద్ధి, సత్యజ్ఞానము మొదలగు పదార్థములతి మధురములు. వీనికి మార్పు లేదు. నాశనము లేదు. ఇవి నిరంతర వికాసమయములయి యొప్పుచుండును. మనుష్యుఁడు తానరుగు స్థలములకెల్లఁ దన ప్రాపంచికలాభములవెంటఁ దీసికొని పోఁగలుగుచున్నాఁడు. వాఁడు సదా యీప్రాపంచిక సౌఖ్యమయ పదార్థములనే సంస్మరించుచు వానిమీఁదనే సంపూర్ణముగా నాధారపడి యుండుచున్నచో వానికి వియోగము తటస్థించినంతనే యామనుష్యుఁ డున్మత్తునివలె రోదింపనారంభించుచుఁ దన యాధ్యాత్మికశక్తిని గోల్పోవుచున్నాఁడు. కాని యాధ్యాత్మికవస్తువుల హస్తగతమొనరించుకొనిన మనుష్యుఁడు తన సౌఖ్యభండారమునుండి వెలుపలఁ బడనేరఁడు. అతఁడు భూమండలమునం దెచ్చోటకేగినను దన వెనువెంటఁ దన యాధ్యాత్మికవస్తువులఁ గొనిపోవుచుండఁ గలఁడు. వాని యాధ్యాత్మికపర్యవసాన మానందపరిపూర్ణత్వమందు వెలయుచుండఁగలదు.

అహంబుద్ధిని బరిత్యజించి పైనుడివియున్న స్వార్థశూన్యమగు జీవితమును బ్రాప్తింపఁజేసికొనిన వ్యక్తి యజరామరమగు బ్రహ్మానందమున సదా నిమగ్నుఁడయి యుండుచున్నాఁడు. అతఁడీజీవితమందే, యీదినమందే, యీక్షణమందే స్వర్గరాజ్యమునను, మోక్షమునను, నిర్వాణమునను, బహిస్సునందున, కలంపిసునందును బ్రవేశించుచున్నాఁడు. అతని జీవితము యొక్క యంతిమయొక్కయు ననఁగా జగదీశ్వరుని గుర్తించుచున్నాఁడు. వాని పవిత్రాత్మ జగదీశ్వరుని పూర్తితమగు సంకల్పమున విశ్రాంతి నందుచున్నది.

లోభము, ద్వేషము, ఈర్ష్య, విషయవాసనలు మొదలగు దుర్గుణములనుండి తనహృదయమును విముక్తమొనరించినట్టియు, మనస్స్వభావముయొక్కయు, స్వార్థముయొక్కయు భయంకర వాతావరణమునుండి వెలువడినట్టియు, సకలప్రపంచము నపారమగు దయతోడను, విశుద్ధమగు ప్రేమతోడను వీక్షించుచుఁ బక్షపాతరాగద్వేషశూన్యుఁడయి, త్రికరణశుద్ధిగ "జగదీశ్వరుఁడు సమస్త జీవరాసులకు శాంతినొసంగుగాత"మని సదా యాశీర్వదించుచుండునట్టియు, మనుష్యుని విశ్రాంతి యెంత మధురమయినది! వాని యానంద మెంత యగాధమయినది!!

లోకాదర్శప్రాయుఁడగు నిట్టిమనుష్యుఁడు తన్నెస్థితి యందు నడఁబోవునట్టి సౌఖ్యమయ పర్యవసానము బడయుఁ

గలుగుచున్నాఁడు. కారణమేమన నతని యాత్మసౌఖ్యమయ పర్యవసానమున జీవితముయొక్క సంపూర్ణత్వమును, శాంతియొక్క చరమస్థితియు, బరమానందముయొక్క పూర్తియు నయియున్నది. మనుష్యుఁ డజ్ఞానాంధకారమయ మగు నావరణము నుండి వెలువడి కామక్రోధాది భయంకర విషయవికారములఁ బరాభవించి యాత్మవిజయమును సంపాదించినచో నానందసామ్రాజ్యము నానినుండి యెంతియోదూరముగ నుండఁజాలదు. ఆత్మనిజేత స్వార్థశూన్యమగు కృషిచే క్షణమాత్రకాలము శ్రమించినచో నానందసామ్రాజ్య మతని కట్టెదుటనే యున్నటుల స్పష్టపడగలదు. చదువరీ! నీవేల మత్తుఁడవయి, ఆ కానవచ్చుచున్న విశుద్ధానందసామ్రాజ్యమునఁ బ్రవేశింపకున్నాఁడవు?

సర్వేజనాస్సుఖినోభవన్తు.



సుజ్ఞానోదయము! స్వర్గసాక్షాత్కారము!

# అమూల్యములగు నీతిగ్రంథరాజములు.

"యస్యాస్తి సద్గ్రంథ విమర్శభాగ్యం,
కిం తస్య శుష్కై శ్చపలావినోదైః."

మానవుని జీవితకాల మమూల్యమైనది. మానవుఁడు ఇహలోకమందలి భయవిషాదములనుండి విమోచనమునంది, నిత్యానందశాంతుల ననుభవించుటకు జ్ఞానమే పరమసాధనము. మేము మానవుని నైతికజీవితాభ్యుదయము నపేక్షించి కేవల నీతి, ధర్మ, భక్తి, జ్ఞానగ్రంథములను, మహాపురుషుల జీవితములను, సతీమణుల చారిత్రములను, ఆరోగ్యశాస్త్రములను, వేదాంతగ్రంథములను విరివిగాఁ బ్రచురింప యత్నములు సేయుచున్నాము. మాప్రయత్నమును ఆంధ్రదేశప్రసిద్ధపండిత కవులెల్ల రేకాభిప్రాయులయి సుకించియున్నారు.

## ఇదివరకుఁ బ్రచురింపఁబడినగ్రంథములు.

1 బుద్ధపురాణము:—1400 పుటలు. చక్కనిబైండు. వచనము. మనోహరమగు శైలి. ఇందు బుద్ధునిజీవితము, బౌద్ధధర్మములు, హిందూమత విజ్ఞానము, హిందూ బౌద్ధమత సాదృశ్యములు మున్నగు బహువిషయములు చర్చింపఁబడినవి. అహింసాధర్మబోధ కిది తావు. సంస్కృతాంగ్లాంధ్ర ప్రమాణ వాక్యము లనంతములుగనున్నవి. ఆచార్య రాధాకృష్ణ, రామ

లింగారెడ్డి, సాక్షికర్త, ఉమర్ అలీషా మున్నగు 25 గురు మహాకవులు పొగడియున్నారు. ఇట్టి బ్రహ్మాండమగు గ్రంథ రాజమును రచించినవారు "బౌద్ధవాఙ్మయబ్రహ్మ" దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు. బలరామకృష్ణకవిగారి బౌద్ధపురాణ గ్రంథరచనకు మెచ్చియే ఆంధ్రమహాసభవారు "బౌద్ధవాఙ్మయ బ్రహ్మ" యను బిరుదమును వారికొసంగియున్నారు. ప్రత్యేకముగా నీ యీగ్రంథరచనమువలననే వారికా సన్మానము జరిగియుండ వేఱుగ నీ గ్రంథమును గూర్చి ప్రశంసింపవలెనా? దేశోద్ధారకుని అమూల్యమగు పీఠిక కలదు. వెల 4—0—0

2 వేణుగానము:— ఇది మహాత్ముండగు ఆచార్య టి. యల్. వాస్వానిపండితుని "Ancient Murali" కనువాదము అనువాదకులు, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు. రసవంతమగు శైలి. గంభీరములగు భావములు. 70 పుటలు. వెల 0—4—0

3 ఆత్మవిజయము:— 300 పుటలు. 28 పా॥ గ్లేజు కాగితము. అనువాదకులు దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు. శైలి అత్యద్భుతము. ఇందు మానవజీవితసంస్కరణ విధానము సూచింపఁబడినది. ఎట్టి విషయలోలుడయిన యీగ్రంథమును చదివిన తన అవివేకాంధకార బంధురమగు జీవితమునకు సిగ్గు చెంది తన్ను సంస్కరించుకొని ధన్యుఁడు కాఁగలఁడు. జనాబ్ ఉమర్ అలీషాకవిగారి అమూల్యమగు పీఠిక కలదు. వెల రు 1—0—0.

# రాబోవు బ్రహ్మాండమగు గ్రంథరాజము.

4 ఆదర్శ మనుష్యజీవితము:— (ఇదిఅచ్చులోనున్నది.)

ఇది బ్రహ్మాండమగు నొక నైతికగ్రంథరాజము. రమారమి 2000 పుటలు. ఈగ్రంథము బలరామకృష్ణయ్యగారిచే స్వతంత్రముగ వ్రాయఁబడినది. వెల చాల సరసముగానుండును. శైలి రసమును వర్షింపఁజేయుచున్నది. భావము లతిగంభీరములు. ఇందు మానవ జీవితోత్థానమున కవసరములగు 800 సద్విషయములనుగూర్చి వ్రాయఁబడినది. ఇట్టిమహాగ్రంథ మింతవఱ కాంధ్రభాషయందు వెలువడి యుండలేదు. దీనిని చదివిన ప్రతిమానవుఁడు మంచి భాషాజ్ఞానమును, వివిధభావ సంపత్తిని, జ్ఞానమును సులభముగాఁ బడయఁగలఁడు. దీనికీతికర్త యొక మహాకవీంద్రుఁడయి యుండఁగలఁడు ఇవిగాక యింకను అమూల్యములగు గ్రంథములు కొన్ని "బౌద్ధవాఙ్మయబ్రహ్మ" మద్గిరాల బలరామకృష్ణయ్య గారిచే రచింపఁబడుచున్నవి. త్వరలో వెలువడఁగలవు. మాగ్రంథములకు కమీషను యివ్వఁబడదు.

వలయువారు:— టి. లక్ష్మీనారాయణ,

మానవాదర్శ గ్రంథమండలి కార్యస్థానము,

అంగలూరు, కృష్ణాజిల్లా.